# పరిచయం

శ్రీ తిల్లావఝ్ఝలవారు తెలిగించిన యీ కథాసరిత్సాగరము అనే గొప్ప గ్రంథం యీ ఆరవభాగంతో సంపూర్తి అయింది.

వేలాదిగా ఉన్న ఇందులోని కథలూ, వర్ణనలూ విజ్ఞానం ఆర్జించుకోడానికి అనువుగా ఉంటాయి.

సుమారు 200 పేజీలతో ఉండే ఈ 6 భాగాలూ దేనికదే వెల 2-8-0

ప్రకాశకులు

# విషయానుక్రమణిక

# పంచలంబకము

## తరంగము: ౧౦౫

తుష్టేన యేన దేహార్థ
మప్యుమాయై సమర్పితమ్
సవో దదా త్వభిమతం
వరదః పార్వతీపతిః !

నిశి విఘ్నజితో వోఽవ్యా
త్తాణ్డవోద్దణ్డితః కరః
శోణ శ్చన్ద్రాతపత్రస్య
తన్వ న్విద్రుమ దణ్డతామ్.

ఉమకు సంతుష్టుడై యొసగె దేహార్థ
భాగమ్ము వరదు డాపార్వతీనాథు
డిచ్చుగావుత మీకు నీప్సితార్థమ్ము!

వరగుచుండంగ చంద్రాతపత్రమునకు
తాండవోద్దండితంబైన తనదు శోణ
కరము విద్రుమదండంబు కరణి నిశిని,
గాచుగావుత మిమ్ముల గజముఖుండు!

నరవాహనదత్తుడు త్రిలోకసుందరులైన ఆభార్యలతోనూ గోముఖాది మంత్రులతోనూ కౌశాంబిలో సుఖంగా ఉంటున్నాడు. నృత్యగీత కథాలాపములతోనూ, ప్రియవధూసల్లాపాలతోనూ రోజులు హాయిగా గడుస్తున్నవి.

ఇలా ఉండగా ఒకనాడు అతని పెద్దభార్య మదనమంచుకాదేవి అంతఃపురములో కనబడలేదు. ఆమె పరివారజనముకూడా కనబడ

లేదు. నరవాహనదత్తుడు వెలవెలబోయి 'ప్రియురాలు నాహృదయ శోధనకోసమై ఎక్కడనైనా దాక్కున్నదా? నావల్ల ఏదైనా పొరపాటు జరిగితే కోపగించిందా? దుర్మార్గు డెవ్వరైనా మాయచేసి ఆమెను అపహరించినాడా!' అని పరిపరివిధాల బాధపడుతూ వెతికించి విసిగి విచారపడుతూ ఉన్నాడు. ఈసంగతి తెలిసి వత్సరాజు, వాసవదత్త పద్మావతి, తదితరులు వచ్చి చాలా దిగులుపడ్డారు.

ఇలా జరుగుతుండగా అంతఃపురరక్షకురాలైన వృద్ధాంగన వచ్చి అందరూ వింటూ ఉండగా నరవాహనదత్తునికి ఇలా విన్నవించింది : 'మేడమీద మదనమంచుక విహరిస్తూఉండగా చూచి ఆకాశమునుంచి దిగిన మానసవేగ విద్యాధరుడు కళింగసేనాదేవిని సమీపించి నీ పుత్రికను నాకు ఈయవలసింది అని ప్రార్థించి తల్లి వీలు లేదంటే తిరిగి పోయినాడు పూర్వము. వాడు రహస్యముగా వచ్చి మాయాబలము వల్ల మదనమంచుకను అపహరించి ఉండవచ్చును. దివ్యులు పరస్త్రీని పరిగ్రహించరు.' రాగాంధులకు మంచీ చెడ్డా ఉంటుందా? వృద్ధాంగన ఇలా చెప్పినమీదట నరవాహనునికి చాలా కోపమూ వచ్చింది, విచారమూ కలిగింది. అప్పుడు రుమణ్వంతుడు 'మననగరానికి అన్ని పక్కలా మంచికాపలా ఉన్నది. ఆకాశమునుంచి తప్ప మరొకమార్గాన మననగరంలో ఇతరులు అడుగు పెట్టడానికి వీలులేదు. శివానుగ్రహము వల్ల మదనమంచుకాదేవికి ఏమీ కీడు జరుగదు. ఆమె ప్రణయ కలహం వల్ల ఇక్కడే ఎక్కడో దాగి ఉన్నదని తలుస్తాను' అని నిదర్శనార్థము ఈకథ చెప్పినాడు:

పూర్వకాలములో అంగిరసు డనే ముని అష్టావక్రుని దగ్గిరికి వెళ్ళి అతనికూతురు సావిత్రిని తనకిచ్చి పెళ్ళిచేయమని అడిగినాడు. అంగిరసుడు సర్వగుణసంపన్నుడైనప్పటికీ అదివరకే ఆకన్యను ఇంకొకరికి ఇవ్వడానికి సంకల్పించడంచేత అష్టావక్రుడు అంగీకరించలేదు. తరవాత

అష్టావక్రుని సోదరపుత్రిక అశ్రుతను అంగిరసుడు పెళ్ళిచేసుకొని సుఖముగా ఉంటున్నాడు. మొదట తనభర్త సావిత్రిని కోరినాడనే సంగతి అశ్రుతకు తెలుసును. ఒకనాడు అంగిరసుడు చాలా సేపు మౌనం అవలంబించి జపంచేస్తున్నాడు. 'ఏమండీ, ఇలా ఉన్నారు? చాలాసేపటి నుంచీ ఏమిటో ఆలోచిస్తున్నారు. అని అశ్రుత చాలాసార్లు చనువుగా అడిగింది. 'ప్రియా, సావిత్రిని ధ్యానిస్తున్నాను' అని భర్త ప్రత్యుత్తర మిచ్చినాడు. అశ్రుత ఆసావిత్రి అష్టావక్రునికూతురు అని భ్రమపడి తనమీదనే అసహ్యం పుట్టి తనశరీరం మలినం అయిపోయిందని తల పోసి దేహము చాలించా లని అడివికి వెళ్ళి తనభర్తకు మేలుకలగా లని ప్రార్థించి ఉరిపోసుకొన్నది. 'బిడ్డా, సాహసముతగదు. నీభర్త అనుకొన్నసావిత్రి నేను. ఆకన్యకాదు' అని గాయత్రీదేవి అక్షమాలా కమండలాలతో ప్రత్యక్షం అయి అశ్రుతను రక్షించింది. అంగిరసుడు భార్యకోసం వెతుకుతూ ఇంతలో వచ్చి కలుసుకొన్నాడు. ఈప్రకార ముగా ఏదో స్వల్పలోపమువల్ల స్త్రీలకు ఎక్కువకోపం వస్తుంది. అలాగే యువరాజుభార్యకూడా ఇక్కడెక్కడో ఉంటుంది. సాంబ శివుడు ఆమెను సంరక్షిస్తాడు. అయినా వెతకండి.

ఇలా రుమణ్వంతుడు చెప్పినమీదట వత్సరాజు 'నీవు చెప్పినది బాగున్నది. ఆమె కేమీ అరిష్టం కలగదు. కామాంశవల్ల పుట్టిన నరవాహనునికి ఆమెను దేవతలు రతీదేవి అంశలో దేవిగా నిర్మించినారు కదా. ఇతను ఆమెతో విద్యాధరైశ్వర్యము ఒక దివ్యకల్పముపాటు అనుభవిస్తాడని అశరీరవాణి చెప్పిందికదా. అశరీరవాణి మాటలు అసత్యము కావుగదా కాబట్టి ఆమెను బాగా వెతకండి' అన్నాడు.

నరవాహనుడు విచారగ్రస్తుడైనప్పటికీ తండ్రిమాటలవల్ల ధైర్యము తెచ్చుకొని భార్యను వెతకడానికి స్వయముగా బయలు దేరినాడు. ఆమె అన్వేషణార్థము మరుభూతి, గోముఖుడు, వసంతకుడు, హరిశిఖుడు

మొదలైనవారుకూడా తిరుగుతున్నారు. వేగవతి అనే విద్యాధరకన్య ఈలోగా మదనమంచుక సౌందర్యాతిశయాన్ని చూసి ఆమె ఆకారము తాను ధరించి ఉద్యానవనములో అశోకవృక్షముక్రింద ఒంటరిగా నిలిచి ఉన్నది. మరుభూతి ఆమెను చూచి ఆనందించి చప్పున నరవాహనునిదగ్గిరికి వెళ్ళి స్త్రీప్రియురా లిక్కడ ఉన్నది. అని చెప్పిన నరవాహనుని ఆ ఉద్యానవనానికి తీసుకొనివెళ్ళినాడు. నరవాహను డామెను చూచి ఆనందముతో ఆలింగనము చేసుకోబోతే వారించి ఆమె ఇలా చెప్పింది: "మీరు నన్ను ఇప్పుడు తాకకూడదు. నేను చెప్పింది బాగా వినండి. వివాహానికి పూర్వం మీతో సమావేశం ఏర్పాటు చేయమని యక్షులను వేడుకొన్నాను. వివాహసమయంలో నాచేతులారా మీకు బలులు సమర్పిస్తాను అని వాళ్ళతో చెప్పేను. కాని ప్రాణేశ్వరా, పెళ్ళి సందడిలో ఆసంగతి మరిచి పోయినాను. కోపంవచ్చి యక్షులు నన్ను అపహరించి ఇక్కడికి తెచ్చినారు. తెచ్చి 'పో. మళ్ళీ ఆయనను పెళ్ళిచేసుకో. మాకు బలులు సమర్పించు. తరవాత ఆయనతో సుఖంగా ఉండు. అలా చేయకపోతే నీకు క్షేమం లేదు' అని ఇక్కడ నన్ను దింపి ఆజ్ఞయిచ్చి వెళ్ళినారు. కాబట్టి నన్ను మళ్ళీ వేగిరము వివాహము ఆడండి. నేను యక్షులకు అభిమత పూజలు చేస్తాను. తరవాత మీ అభిమతం తీరుతుంది.

నరవాహనుడు తక్షణమే శాంతిసోముడు అనే పురోహితుణ్ణి రప్పించి నిమిషాలమీద వివాహసంభారాలు సమకూర్చి మదనమంచుకా రూపములో ఉన్న విద్యాధరి వేగవతిని వివాహమాడినాడు. ఆమాయా మదనమంచుక స్వహస్తాలతో యక్షులకు మద్యమాంసబలి సమర్పించింది. నరవాహనుడు అదివరకే ఆసవము నిండుగా తాగినప్పటికీ ఆమెమాటమీద మళ్ళీ పానము చేసి ఆమెతో సమస్తసౌఖ్యములూ అనుభవించినాడు. తాను నిద్రించేసమయములో ముఖము మీది

ముసుగు తీసి చూడకూడ దని ఆమె భర్తతో చెప్పింది. మర్నాడు రాత్రి ఆమె నిద్రపోయేటప్పుడు నరవాహనుడు మేలుకొనిఉండి కుతూహలమువల్ల ముసుగు తీసి చూసినాడు. ఆమె మదనమంచుక కాదని వెంటనే గ్రహించి చూస్తూఉన్నాడు. ఇంతలో ఆమె మేలుకొని భర్తను చూచినది. అతను 'ఎవరు నీవు నిజంచెప్పు' అని అడిగితే ఆమె నిజరూపంతో నిలిచి ఇలా చెప్పింది.

## వేగవతి వృత్తాంతము

ప్రాణేశ్వరా, సత్యము చెపుతున్నాను ఆషాఢపురము అనే విద్యాధర నగరము ఉన్నది. వేగవంతునికుమారుడు మానసవేగుడు మహా పరాక్రమవంతుడు. ఆనగరము పరిపాలిస్తున్నాడు. నేను అతని చెల్లెలను. నా పేరు వేగవతి. అన్నకు నామీద ఇష్టములేదు. అందుచేత అతను నాకు విద్యలు ఉపదేశించలేదు. తపోవనములో ఉన్న మా నాయన గారిదగ్గరకు వెళ్ళి చాలా కష్టముమీద విద్యలు పొందినాను. ఉద్యానములో రక్షకులమధ్య ఉన్న మదనమంచుకను చూచినాను. మాఅన్న మదనమంచుకను అపహరించి ఆషాఢపురములో ఉంచినాడు. తనమీద ఇష్టములేని స్త్రీని అతను ముట్టుకోడు — శాపభయమువల్ల కాని మదనమంచుక తన్ను ప్రేమించేటట్టు బోధించమని నన్ను పంపించినాడు. ఆమెదగ్గిరికి నేను వెళితే మీ నామస్మరణమే చేస్తున్న దామె. మీనామధేయము వినగానే నామనస్సు మీపరమై పోయింది. ఎవని పేరు వినగానే నీమనస్సు మదనపరవశము అవుతుందో అతనే నీకు భర్త అవుతా డని స్వప్నములో అమ్మవారు అనుగ్రహించింది. ఆసంగతి జ్ఞాపకము వచ్చి మదనమంచుకతో మందిమాటలాడి నేను ఆమె రూపము ధరించి ఉపాయముతో మిమ్మలిని వివాహము చేసుకొన్నాను. ప్రాణేశ్వరా, మదనమంచుక ఉన్నచోటికి పోదాము. మీమీదా ఆమెమీదా నాకు మహాప్రీతి.'

ఆవిద్యాధరి ఇలా చెప్పి తన ప్రభావమువల్ల నరవాహనుని తీసుకొని ఆకాశమార్గాన బయలుదేరింది. వారు ఉభయులూ వెళ్ళినతరువాత పరివారజనులు భయపడ్డారు. రాజూ, రాణులూ, మంత్రులూ దిగులు పడ్డారు. ఇంతలో నారదుడు వచ్చి అర్ఘ్యపాద్యాదులు అందుకొని వత్సరాజుతో, 'రాజన్, నీపుత్రుని విద్యాధరి తనప్రదేశానికి తీసుకు వెళ్ళింది. కుమారుడు త్వరలోనే మరలివస్తాడు. నీకు ధైర్యము చెప్పడానికి నన్ను మహేశ్వరు డిక్కడకు పంపించినాడు' అని చెప్పి వేగవతి వృత్తాంతము అంతా వివరించి రాజును ఓదార్చి వెళ్ళినాడు.

మానసవేగుడు ఆషాఢపురములో నరవాహనదత్తుడు ఉన్నట్టు తెలుసుకొని అతనిని సంహరించాలని తయారైనాడు. వేగవతి విద్యాబలముతో అన్నను ఎదుర్కొన్నది. పతివ్రతకు భర్తే ప్రాణము కాని బంధువులు కారు. విద్యాప్రభావముచేత ఆమె భయంకరరూపము ధరించి మానసవేగుని సొమ్మసిల్లజేసి అగ్నిపర్వతం మీాద పడవేసింది. తరవాత భర్తను గంధర్వనగరు వెలుపల నీళ్ళులేని నూతిలో దాచిపెట్టి, 'ప్రాణేశ్వరా, మీారు కొంతసేపు ఇక్కడ ఉండండి. దిగులు పడవద్దు. మీాకు శుభం కలుగుతుంది. సర్వవిద్యాధర చక్రవర్తిత్వం లభిస్తుంది. మాఅన్నను ఎదిరించినందువల్ల నాబలముపోయింది. తపస్సు చేసి మళ్ళీ శక్తిసంపాదించి త్వరలో వస్తాను' అని వేగవతివెళ్ళిపోయింది.

## తరంగము : ౧౦౭

## గంధర్వదత్త

నూతిలో ఉన్న నరవాహనుని వీణాదత్తు డనే గంధర్వుడు చూచినాడు ఆ యోగ్యుడు అతని పేరు, కులము అడిగి తెలుసుకొని చెయ్యి అందిచ్చి నూతిలోనుంచి బయటికితీసి 'నీవు దివ్యుడవు కాక మానవుడవే అయితే మానవులు రాలేని ఈ గంధర్వనగరానికి ఎలావచ్చినావు?

అన్నాడు. 'నన్ను విద్యాధరి ఒకతె ఇక్కడికి తీసుకువచ్చి ఈ నూతిలో ఉంచిపోయింది' అన్నాడు నరవాహనుడు. వీణాదత్తుడు అతనిని పరిశీలించి చూచి చక్రవర్తి చిహ్నాములు గమనించి అతనిని తన ఇంటికి తీసుకు వెళ్ళి ఉపచారాలు చేయించినాడు. మర్నాడు నరవాహనుడు ఆపట్టణములో ఉన్నవా రందరి చేతులలోనూ వీణలుచూచి ఇది యేమని అడిగితే వీణాదత్తు డిలా చెప్పినాడు. ఇక్కడ సాగరదత్తు డనే గంధర్వ రాజు ఉన్నాడు. ఆయనకూతురు గంధర్వదత్త చాలా అందగత్తె. శ్రీహరి తనమీది పాట ఆమెకు స్వయముగా నేర్పినాడు. ఆమె వీణ మీద ఆపాట పాడుతూ సంగీతవిద్యలో పరమావధి పొందింది. ఆపాట వీణమీద పలికిస్తూ గాంధారాది గ్రామత్రయములో పాడి సంగీత విద్యలో పరిపూర్ణుడు అయినవాడు మాత్రమే తనకు భర్త అని ఆమె నిర్ణయించుకొన్నది. అందుచేత ఇక్కడివా రంతా ఆశపెట్టుకొని వీణ నేర్చుకొంటున్నారు. కాని ఎవ్వరూ కృతకృత్యులు కాలేదు.

ఈమాటలకు నరవాహనుడు సంతోషించి 'నేను సమస్తకళలకూ స్వయంవరపతిని. త్రైలోక్యగర్భంలో ఉన్న గాంధర్వ మంతా నాకు తెలును' అనేటప్పటికి అతనిని వీణాదత్తుడు సాగరదత్తప్రభువు దగ్గరకు తీసుకొనిపోయి, 'దేవా, ఈయన నరవాహన దత్తుడు, వత్సరాజు కుమారుడు. విద్యాధరివల్ల ఈనగరానికి వచ్చినాడు. ఈయన గాంధర్వాచార్యుడు. విష్ణుస్తుతి బాగా తెలిసినవాడు. ఆపాట మీదనే కదా నీ కుమార్తె గంధర్వదత్తకు చాలాప్రీతి' అని విన్నవించినాడు.

'ఔను. ఈయనప్రభావము గంధర్వుల నోట ఇదివరలో విన్నాను. ఈయన దేవాంశసంభూతుడు కాకపోతే విద్యాధరితో ఈ గంధర్వ భూమి కెలా రాగలడు? గంధర్వదత్తను ఒకమా రిలా రమ్మనండి చూతాము' అని సాగరదత్తుడు అన్నాడు. వెంటనే మహత్తరులు ఆమెను తీసుకొనివచ్చినారు. గంధర్వదత్త తండ్రిపక్కన కూర్చుండి

ఆయన ఆనతి అయినమీదట వీణపైన పాట పాడింది. నరవాహనుడు ఆమె సౌందర్యానికీ సంగీతానికీ ఆశ్చర్యపడి 'రాజపుత్రీ, నీ వీణె స్వరము చక్కగా పలకడము లేదు. బహుశా తీగెకు వెంట్రుకచుట్టుకొని ఉన్న దేమో అన్నాడు. చూస్తే అలాగే ఉన్నది. అందరూ ఆశ్చర్యపడ్డారు. రాజు కుమార్తె చేతులోనుంచి వీణ తీసుకొని 'రాజకుమారా, మా శ్రవణాలలో అమృతవర్షం కురిపించు' అని అతనికి వీణ అందిచ్చినాడు. అతడు విష్ణుస్తుతిగీతము వీణ వాయిస్తూ పాడినాడు. అందరూ ఆనందించినారు. గంధర్వదత్త అతనిమీద ప్రణయచక్షువులు ప్రసారించింది. కుమార్తె ప్రతిజ్ఞ జ్ఞప్తికి వచ్చి తండ్రి ఆమెను నరవాహనదత్తున కిచ్చి మహావైభవముగా వివాహము చేసినాడు. నరవాహనుడు గంధర్వదత్తతో దివ్యభోగములు అనుభవిస్తూ అక్కడనే ఉంటున్నాడు.

ఒకనాడు నరవాహనుడు నగరసంపద చూస్తూ అటూ ఇటూ విహరించేస్తూ పురోద్యానములో ప్రవేశించినాడు. అక్కడ దివ్యాంగన తనకుమార్తెతో 'అమ్మా, అడుగో నరవాహన దత్తుడు. ఆయనే నీకు భర్త' అని విద్యాప్రభావంవల్ల అంటున్నది. నరవాహనుడు విని ఎవరమ్మా మీరు ఎందుకు వచ్చినారు. అని అడిగితే ఆమె ఇలా చెప్పింది: 'నేను దేవసింహుడనే విద్యాధరాధిపతి భార్యను. నన్ను ధనవతి అంటారు. ఈబిడ్డ నాకూతురు అజినావతి, చండసింహుని చెల్లెలు. నీవు దీనికి భర్త వౌతావని అశరీరవాణి చెప్పింది. వేగవతి నిన్ను ఇక్కడ పెట్టి పోయిందని విద్యా ప్రభావంవల్ల గ్రహించాను. నాకోరిక తెలిపేందుకు ఇక్కడికివచ్చాను. విద్యాధరులు సంచరించే ఈప్రదేశాన నీవు ఉండడము మంచిది కాదు. విద్యాధర చక్రవర్తిపదవి పొందనినిన్ను వాళ్ళు ఒంటరిగాచూస్తే బాధిస్తారు. కాబట్టి వారి కగమ్యమైన ప్రదేశానికి నిన్ను తీసుకొని వెళుతాను. తరుణం వచ్చినప్పుడు నాకుమార్తెను పెండ్లిచేసుకొందువుగాని' ఇలాచెప్పి ధనవతి అతనినీ కుమార్తెనూ

తీసుకొని ఆకాశమార్గాన వెళ్ళి శ్రావస్తీనగరములో ఉద్యానములో అతనిని దింపింది. తరవాత తల్లీకూతురూ ఆకాశాన వెళ్ళినారు.

ప్రసేనజిత్తు అనేరాజు వేటనుంచి వస్తూ నరవాహనుని చూచి అతని ముఖలక్షణములుగమనించి కులనామము లడిగి ఆదరముతో తన మందిరానికి తీసుకొనిపోయి భగీరథయశ అనే కుమార్తెను ఇచ్చి పెళ్ళిచేసినాడు.

## ప్ర భా వ తి

ఒకనాడు నరవాహనుడు భగీరథయశ రాత్రివేళ పానగోష్ఠిచేసి పవ్వళించినారు. ఆమెకు నిద్ర పట్టింది. నిద్రా మెళుకువా కాని స్థితిలో నరవాహనుడు వలవరిస్తూ 'తక్కినభార్యలను ఈమెమీద ప్రేమ వల్ల మరిచినాను. నామంత్రులు దూరమైనారు. పరాక్రమశాలి, మరుభూతి, నీతివేత్త హరిశిఖుడు. వాళ్ళతో ఇప్పుడు పనిలేదు. కాని సర్వావస్థలలో చతురుడైన గోముఖుడు దగ్గరలేకపోవడం కష్టంగా ఉన్నది.' అని పలవరించినాడు మృదుమధురవాక్కులతో. అయ్యోపాపము అనేమాటలు అతనికి వినపడ్డవి. ఏమా అని అతడు ఇటూఅటూ చూచేసరికి గవాక్షములో సౌందర్యవతి ముఖము కనిపించింది. ఇంతలో ఆ దివ్యస్త్రీ కిటికీలోనుంచి వేలితో ఇటు రమ్మని సైగ చేసింది. నరవాహనుడు నెమ్మదిగా లేచి శయనాగారము దాటి ఇవతలకు వచ్చినాడు. ఆమె అయ్యో మదనమంచుకా అన్యాసక్తుడైన భర్తను పొగడుతావు అన్ని విధాలా చెడినావు. అన్నది విద్యాధరస్త్రీ. ఆమాటలకు నరవాహనుడు విచారపడి 'ఎవరు నీవు? మా మదనమంచుకను ఎక్కడ చూచినావు? ఎందుకు ఇప్పుడు ఇక్కడికి వచ్చినావు?' అని ఆమె నడిగినాడు.

ఆ ప్రౌఢురాలు అతనిని దూరము తీసుకొనిపోయి ఇలా చెప్పింది. పుష్కరావతీ నగరమున అగ్నిదేవుని సేవించిన పింగళగాంధారుడనే విద్యాధర ప్రభువు కుమార్తెను. నన్ను ప్రభావతి అంటారు. అగ్నిదేవుని

వరమువల్ల చేమ కలిగాను. నా చెలికత్తె వేగవతిని చూడటానికి ఆషాఢ పురము వెళ్ళేను. వేగవతి తపస్సు చేయడానికి ఎక్కడికో వెళ్ళిందని విన్నాను. నీ ప్రియురాలు మదనమంచుక అక్కడే ఉన్నదని వేగవతి తల్లి పృథివీదేవి చెప్పింది. ఆమె నీకోసం అన్నపానాలు మాని చాలా కృశించి పోయింది. ఎప్పుడూ నీపలవరింతే. ఆమె నడిగి నీసంగతి సంద ర్భాలు తెలుసుకొని నిన్ను తెచ్చి సమకూరుస్తానని ఓదార్చాను. విద్యాప్రభావమువల్ల నీవు ఇక్కడ ఉన్నావని గ్రహించి ఆమెపనీ నాపనీ నెరవేర్చడానికి వచ్చాను. నీవు ప్రియురాలిని మరచి ఇతరులను గురించి పలవరిస్తూ ఉంటే విని అయ్యో పాపమని నీ భార్యకోసము విచారపడ్డాను. మదనమంచుక ఉన్నచోటికి నన్ను తీసుకొని వెళ్ళి నీ కోరిక ఏమిటో చెప్పు' అని అడిగేసరికి అతన్ని తీసుకొని ఆకాశమార్గాన పోతూ ఒకచోట అగ్ని మండుతుంటే అతని చెయ్యిపట్టుకుని దాని చుట్టూ ప్రదక్షిణము చేసి వివాహకార్యము నిర్వర్తించుకొన్నది. దివ్యుల క్రియలు సంకల్పప్రధానములు కదా! ప్రభావతి తన ప్రియునికి మార్గములో వింతలు చూపుతూ చాలా దూరము తీసుకుపోయింది. ప్రయాణ శ్రమవల్ల నరవాహనుడు దాహము అన్నాడు. ప్రభావతి అతనిని భూమిమీదికి దింపి ఒక సరోవరతీరాన కూర్చోబెట్టింది. జలము తాగిన తరువాత అతని దప్పిక తీరింది. కాని వనసౌందర్యము చూడ డము వల్ల భార్యతో శయనసౌఖ్యము అనుభవించవలెనని బుద్ధిపుట్టి ఆమెను బలవంతపెట్టినాడు. ఆమె తొందరపడవద్దనీ, అన్యథా భావించ వద్దనీ ఒక కథ చెప్పింది.

## బాలుడు — మోదకములు

పూర్వము పాటలీనగరములో అందగత్తెఅయిన పేదరాలు నిండుయవ్వ నములోనే భర్తను కోల్పోయింది. ఆమె ప్రతిరాత్రి పరపురుషుని కోసం ఎక్కడకి పడితే అక్కడికి వెడుతూండేది. వెళ్ళిపోయేటప్పుడు చిన్ని

కుమారునితో లడ్డు తెచ్చి పెడతానని వాణ్ణి బుజ్జగించి సమాధానపరచి పడుకోబెట్టి వెళ్ళిపోయేది. ఉదయము ఇంటికి వచ్చి ఆమె లడ్డు ఇస్తుం డేది. వాడు లడ్డుమీది ఆశచేత శాంతముగా ఉండేవాడు. ఒకనాడి ఆవిడ లడ్డు తేవడము మరచిపోయింది. ఆబాలకుడు మోదకము ఏదని అడిగాడు. ఆవిడ ఒళ్ళు మరచి 'బాబూ, నాప్రియుడే నాకు మోదకము. ఇంకో మోదకము నాకు తెలియదు.' అన్నది. పిల్లవాడు తల్లి సంగతి గ్రహించి నిరాశ పొంది గుండె పగిలి చనిపోయినాడు.

కాబట్టి ప్రాణేశ్వరా, ముందుగా మనము కలిస్తే నీకోసమై కని పెట్టుకొని ఉన్న మదనమంచుకకు తెలిస్తే అపాయము కలగవచ్చును. అందుచేత ప్రాణాధికుడవైనప్పటికీ నిన్ను దూరముగా ఉంచవలసివచ్చింది.

ఈప్రకారముగా ప్రభావతిచెప్పినమీదట నరవాహనదత్తుడు ఆశ్చర్య పడి 'బ్రహ్మ ఇంత ఉదారచరిత్రను సృష్టిచేసినాడే' అని మెచ్చుకొని ప్రభావతిని ఆదరించి 'మదనమంచుక ఉన్నచోటకు మనము పోదాము.' అన్నాడు. ప్రభావతి అతనిని ఆకాశమార్గాన ఆషాఢపురి చేర్చింది. అక్కడ నరవాహనుడు మదనమంచుక కలుసుకొని ఆనందించినారు.

ఆరాత్రి ప్రభావతి విద్యాబలమువల్ల కల్పించిన భోగాలను వా రుభ యులూ సేవించారు. అక్కడివారికి ఆవిద్యాప్రభావమువల్ల మదనమంచుక కనబడుతున్నది. నరవాహనదత్తుడు కనబడటంలేదు. ఉదయము నర వాహనుడు మదన మంచుకకు జడ విప్పమంటే ఆమె వద్దన్నది. మానస వేగుని సంహరించిన తరవాత మీరు ఈజడను విప్పవలసింది. అలా కానప్పుడు నేను గతించిన తరవాతి పత్నులైనా ఈజడ విప్పవలసింది. కాదా నాతోకూడా ఈజడ కాలిపోవలసింది'అని ప్రతిజ్ఞచేశాను. మానస వేగుడు జీవించి ఉండగనే మీరు జడ విప్పుతున్నారు. అందువల్ల నామనస్సు బాగాలేదు. వేగవతి వాణ్ణి అగ్నిపర్వతముమీద పడవేసినప్ప టికీ వాడు చచ్చిపోలేదు. ప్రభావతి తన శక్తివల్ల మిమ్మల్ని అదృశ్యుల్ని

చేసిండి. అలా కాకపోతే అతనివరివారము మిమ్మల్ని చూసి సహిస్తారా!'

'ప్రాణేశ్వరీ, నీకోరిక సిద్ధిస్తుంది. నేను విద్యలు సాధించి త్వరలోనే శత్రువును సంహరిస్తాను. కాస్త ఓపికపట్టు' అని నరవాహనుడు ఆమెను ఓదార్చి ఆనగరములోనే ఉన్నాడు.

ప్రభావతి తనశక్తివల్ల ఆతనికి తనరూపము ఇచ్చి తాను అంతర్ధానం పొందింది. కావలివారూ తదితరులూ నరవాహనుని చూచి ప్రభావతే అనుకొని వేగవతిమీద ప్రీతిచేత మదనమంచుకకు ఉపచారాలు చేస్తున్న దని మానసవేగునికి విన్నవించారు. ఇలా కాలము గడుస్తుండగా ఒక రోజు మదనమంచుక నరవాహనదత్తునికి తనవృత్తాంతము ఇలా చెప్పింది.

## మదనమంచుకవృత్తాంతము

నన్ను మానసవేగుడు ఇక్కడకు తెచ్చి చాలా భయపెట్టి లోబరుచు కోవలె నని యత్నించినాడు. అప్పుడు భగవంతుడు భైరవాకారము ధరించి కత్తిఎత్తి నాలుక అల్లల్లాడిస్తు హుంకారము చేసి, ఏమిరా! విద్యాధరేంద్రులకు చక్రవర్తి కాబోయేవానిభార్యను మాయెదట అవమానిస్తావా! అని భయపెట్టినాడు. ఆదుర్మార్గుడు నెత్తురుకక్కుతూ నేలమీద పడ్డాడు. భైరవస్వామి అంతర్ధానము పొందినాడు. మానస వేగుడు తేరుకొని ఇంటికి వెళ్ళినాడు. ఆతరవాత వాడు నన్ను బలవంత పెట్టడం మానుకొన్నారు. అయినా నేను భయపడుతుంటే చేటికలు వచ్చి నన్ను ఓదార్చి, వాడు నిన్ను బలాత్కరించడు. భయపడకు. పూర్వం వాడు మునికన్యను బలవంతాన హరించబోతే ఆమె బంధువులు అంగీకారము లేని అంగనతో నీవు కూడితే తలపగిలి చేస్తావు — అని శాపం పెట్టినారు. శాంతంగా ఉండు. నీకు భర్తతో పునస్సమాగమము తప్పకుండా అవుతుంది అని చెప్పినారు. తరు వాత మానసవేగుని చెల్లెలు వేగవతి వచ్చి మంచిమాటలు చెప్పి

మిమ్మల్ని తీసుకొని వచ్చి ఇస్తానని ఊరడించింది. తరవాతసంగతి మీకు తెలిసిందే. వాడితల్లి పృథివీదేవి వచ్చి చల్లనిచూపులతో, 'అన్న పానములు మానుకొని ఎందుకు శ్రమపడతావు: శత్రువుఅన్నను ఎలా తింటా నని సంశయించకు. మా వేగవతికి ఈరాజ్యములో తండ్రి ఇచ్చిన భాగ మున్నది. దానిని నీభర్త పెళ్లిచేసుకొన్నాడు. దాని ధనము భర్తది. కాబట్టి నీధనముకూడా అయింది. ఇక భోజనము చెయ్యి. విద్యాప్రభావమువల్ల సమస్తమూ తెలుసుకొని సత్యము చెవుతున్నాను' అని పట్టుపట్టి నాచేత భోజనము చేయించింది. మిమ్మల్ని తీసుకొని వచ్చిన వేగవతి అన్నతో పోరాడి జయించి మిమ్ము రక్షించింది. ఆ తరువాతసంగతి నాకు తెలియదు. ఆశచేత ప్రాణాలు విడవకుండా ఉన్నాను. ప్రభావతి శక్తివల్ల మీరు నాకిక్కడ లభించారు. ఒకచింత నన్ను వేధిస్తున్నది. ఆమె వెళ్ళిపోతే, మీకు నిజరూపం వస్తుంది. అప్పుడు మనగతి ఏమాతుందో! — ఆమెకు ధైర్యము చెప్పి నరవాహనుడు సుఖముగా ఉంటున్నాడు.

ఒకనాడు ప్రభావతి తండ్రిఇంటికి వెళ్ళేసరికి నరవాహనుని నిజరూపము బైటపడ్డది. కావలివారు చూచి కంగారుపడి మదనమంచుక బతిమాలుతున్నా వినిపించుకోక మానసవేగునికి తెలియపరిచినారు. వాడు భటులను వెంట బెట్టుకొని వచ్చి నరవాహనుని చుట్టు ముట్టినాడు. అతని తల్లి పృథివీదేవి వచ్చి, 'ఇతనిని మనము సంహారించకూడదు. ఇతడు పరస్త్రీకాముకుడు కాడు; వత్సరాజు కుమారుడు నరవాహనదత్తుడు. తనభార్యదగ్గరికే వచ్చినాడు. పైగా ఇతను మన అల్లుడు. ఈసంగతు లన్నీ విద్యాబలమువల్ల తెలుసుకొన్నాను' అని చెప్పింది. మానసవేగుడు కోపముతో ఇతను నాకు శత్రువు అన్నాడు. అప్పుడు పృథివీదేవి 'నాయనా, విద్యాధరలోకములో అధర్మము చేయడానికి అవకాశము లేదు. ధర్మనిర్ణయము చెయ్యడానికి విద్యాధరుల

సభ ఒకటి ఉన్నదికదా! సభలో ప్రధానులయెదుట ఇతనిమీద దోషం ఆరోపించు. తరువాత నిర్ణయప్రకారం చేయవచ్చును. అలాకాకుండా ఇష్టంవచ్చినట్టు చేస్తే విద్యాధరులు ద్వేషిస్తారు. దేవతలు సహించరు' అని బోధించినమీదట మానసవేగుడు నరవాహనుని బంధించి సభకు తీసుకు రావలసింది అని ఆజ్ఞాపించినాడు. నరవాహనుడు ద్వారముకమ్మి ఊడదీసి కొందరుబంట్లను కొట్టి అందులో ఒకనిచేతులోనుంచి ఆయుధము లాక్కొని పరాక్రమముతో తక్కినబంట్లను హతమార్చినాడు.

భేరీ మోగించినారు. విద్యాధరులు సభకు వచ్చినారు. విద్యాధర నాయకుడు వాయుపథుడు వచ్చి సింహాసనముమీద కూర్చున్నాడు. ఈమానవుడు మా అంతఃపురములో ప్రవేశించి చెల్లెలిశీలము చెడగొట్టినాడు. కాబట్టిఇతడు వధ్యుడు' అని నేరము ఆరోపించినాడు. ప్రత్యుత్తరము చెప్పవలసిన దని సభ్యులు నరవాహనుని అడిగినారు. అతడు, ధైర్యముగా 'సభ్యుడు ఉన్నది సభ. ధర్మము చెప్పినవాడు సభ్యుడు ఎందులో సత్యము ఉన్నదో అదిధర్మము. ఎందులో కపటములేదో అది సత్యము. నన్ను కపటశక్తిచేత కట్టివేసినారు. నేను నేలమీద ఉన్నాను. 'ఈయనపీఠముమీద స్వేచ్ఛగా ఉన్నాడు. మాకిద్దరకీ వివాదము సమానమెల్లా అవుతుంది' అన్నాడు. అప్పుడు వాయుపథుడు న్యాయానుసారంగా మానసవేగుని నేలమీద కూచోబెట్టి నరవాహనునికట్లు విడిపించినాడు.

మేఘగంభీరవాక్కులతో నరవాహనుడు ఇలా సమాధానము చెప్పినాడు : 'నాభార్య మదనమంచుకను ఇతడు అపహరించినాడు. నేను నాభార్యను ఇక్కడ కలుసుకున్నాను. ఇందులో దోష మే మున్నది? నేను అంతఃపురద్రోహము చెయ్యలేదే. ఈయనచెల్లెలు మదనమంచుక రూపము ధరించి నాదగ్గిరికి వచ్చి ఉపాయముచేసి నన్ను పెళ్ళాడింది. అందులో నాఅపరాధ మే మున్నది? నాసొత్తు నేనుకోరితే దోష మేమి?

ఈసమాధానము విని వాయుపథుడు బాగా ఆలోచించి సచివులూ నుడు ధర్మము పలికినాడు. ఈయనకు గొప్ప శుభం కలుగ్నప్పుడు మానసవేగా, ఈయనవిషయములో అన్యాయము తలపెట్టకు సుమీ. అని తీర్మానము చేసినాడు. అయినప్పటికీ మానసవేగుడు మోహాంధుడై అన్యాయానికి ఒడిగట్టినాడు. కోపం వచ్చి వాయుపథుడు సేనలు సిద్ధముచేసి మానసవేగునితో యుద్ధానికి సిద్ధమైనాడు. నరవాహనుడు మానసవేగునితో 'నీమాయావిధానం మానుకొని నాతో బహిరంగ యుద్ధానికి రా. ఒక్కదెబ్బలో నీసంగతి తేలుస్తాను' అని పోరాటానికి కాలు దువ్వినాడు. ఇంతలో సభాగృహంలో పెద్దస్తంభం పగిలి భైరవమూర్తి బయలుదేరి గర్జించి 'మూర్ఖా, భవిష్య ద్విద్యాధర చక్రవర్తికి పరాభవము కలుగుతుందా!' అని కేక వేసినాడు. భైరవ స్వామి కేకకు మానసవేగుడు తల వంచినాడు. వాయుపథుడు సంతోషించినాడు. భైరవస్వామి నరవాహనుని తన బుజాలమీాద కెత్తుకొని క్షణములో ఋష్యమూకపర్వతము మీాద దింపి అంతర్ధానమైనాడు. వాయుపథుడు తనవారిని తీసుకొని సభలోనుంచి వెళ్ళిపోయినాడు. మదనమంచుకను ముందుపెట్టుకొని విచారముతో ఆషాఢపురానికి వెళ్ళినాడు మానసవేగుడు.

## తరంగము : ౧౦౭

సంపదలోను ఆపదలోను విధి ఎవరిధైర్యాన్ని తరుచుగా పరీక్షచేస్తూ ఉంటుందో వారికి గొప్ప మేలే కలుగుతుంటుంది. నరవాహనుని ఏకాకిని చేసి దేశదేశాలవెంట తిప్పి మాటిమాటికీ భార్యలను ప్రసాదిస్తున్నది. ఋశ్యమూకపర్వతముమీాద ఉన్న నరవాహనునిదగ్గిరికి ప్రభావతి వచ్చి 'నేను దగ్గర లేనప్పుడు మానసవేగుడు నిన్ను చాలా చిక్కుపెట్టి సభకు తీసుకొనిపోయినాడు. ఆసంగతి తెలిసి విద్యాప్రభావమువల్ల భైరవ

స్వామి రూపముతో నిన్ను తప్పించి, నేనే ఇక్కడికి తీసుకొని వచ్చి నాను. ఇది సిద్ధక్షేత్రము కావడముచేత ఎటువంటివారికీ విద్యలు పని చెయ్యవు. అందువల్ల నీవు ఎలా ఉంటున్నావో అని దిగులు పడు తున్నాను' అన్నది. నరవాహనుడు ప్రభావతితోకూడా అక్కడే నివాసముచేస్తూ మదనమంచుకను ధ్యానిస్తూ సమీపములో ఉన్న పంపాసరస్సులో స్నానముచేస్తూ చెట్లమీదనుంచి రాలిన పళ్ళను భుజిస్తూ జింకమాంసము తింటూ చెట్లక్రింద, గుహాలలోనూ కాలము గడుపుతూ ఉన్నాడు.

ఒకనాడు ధనవతి అజినావతి అనేవిద్యాధర స్త్రీలు పంపాప్రదేశ ములో అతనిదగ్గిరికి వచ్చినారు. అజినావతి ప్రభావతిని కలుసుకొన్న మీదట ధనవతి నరవాహనునితో 'అజినావతిని ఇస్తానని పూర్వమే నీకు వాగ్దానము చేశాను కదా? ఇప్పుడు వివాహం చేసుకో. నీఅభ్యు దయముకోసము కనిపెట్టుకొని ఉన్నది' అన్నది. నరవాహనుడు ప్రభా వతి అంగీకరించారు. ధనవతి విద్యాప్రభావముచేత దివ్యసంబారాలు కల్పించి మహావైభవంగా వివాహము చేసి 'బాబూ, నీవు ప్రతిచోట ఇంతంత కాలము ఉండడము మంచిది కాదు. విద్యాధరులు మాయా నిపుణులు కాబట్టి నీవు వెంటనే భార్యలతో కౌశాంబికి వెళ్ళు. నా కుమారుడు చండసింహునీ, నా ఇతర బంధువులనూ తీసుకొని అక్కడికే వస్తాను, అని వెళ్ళిపోయింది.

అజినావతి ప్రభావతి నరవాహనుని తీసుకొని కౌశాంబికి వెళ్ళి ఉద్యా నములో దింపినారు. పరివారజనులు అతనిని చూచి యువరాజు వచ్చి నాడు. మనఅదృష్టము అని కోలాహలము చేసినారు. ఇంతలో వత్స రాజు, వాసవదత్త, పద్మావతి, రత్నప్రభ, మొదలైనవా రంతా అక్కడికి వచ్చినారు. యౌగంధరాయణాది మంత్రులు, కళింగసేన గోముఖాది సచివులూకూడా నరవాహనుని కలుసుకొన్నారు. వత్సరాజు

యౌగంధరాయణాది మంత్రులు, కళింగసేన, గోముఖాది సచివులూ కూడా నరవాహనుని కలుసుకొన్నారు. వత్సరాజు మహోత్సవము చేయించినాడు. వేగవతి ఆకాశమార్గాన వచ్చి అత్తమామలకు ప్రణామము చేసి భర్తపాదాలకు నమస్కరించి 'తపస్సు చేసి విద్యలు మళ్ళీ సాధించి ఈసంగతి తెలుసుకొని ఇక్కడికి వచ్చాను' అని విన్నవించింది. అందరూ ఆమెనుప్రశంసించి తమమధ్య కూచోబెట్టుకొన్నారు.

ఇంతలో ధనవతి వచ్చింది. ఆమె వెంట విద్యాధరేశ్వరులు చండసింహుడు, అమితగతి, పింగళగాంధారుడు, వాయుపథుడు, రత్నప్రభ తండ్రి హేమప్రభుడు, కుమారుడు వజ్రప్రభుడు, గంధర్వదత్తతో సాగరదత్తుడు, అతని కుమారుడు చిత్రాంగదుడూ వచ్చినారు. అందరికీ సముచిత సత్కారము జరిగింది. తరవాత పింగళగాంధారుడు నరవాహనునితో ఇలా అన్నాడు. 'నాయనా, మా కందరికీ చక్రవర్తిగా నిన్ను దేవతలు నిర్మించారు. మేమందరమూ ప్రీతిచేత ఇక్కడికి వచ్చినాము. నీఅత్త ధనవతి జ్ఞాననిధి; గాయత్రీదేవివలె విద్యాధరోత్తముల కందరికీ వంద్యురాలు. నిన్ను సంరక్షించడానికి సంసిద్ధంగా ఉంటుంది. నీకు కార్యసిద్ధి అవుతుంది. అయినప్పటికీ నేను చెప్పేది బాగా విను. హిమాచలములో విద్యాధరులకు రెండు భాగము లున్నవి. ఉత్తరవేదార్ధము కైలాసానికి అవతల, దక్షిణ వేదార్ధము కైలాసానికి దక్షిణాన ఉన్నవి. ఉత్తర వేదార్ధానికి ప్రభువు కావలెనని అమితగతి తపస్సుచేసి మహేశ్వరుని మెప్పించినాడు. నరవాహనుడు చక్రవర్తి అయి నీకోరిక తీరుస్తాడు. అని శివాజ్ఞ అయింది. ఇతడు నీదర్శనార్ధము వచ్చాడు. మందర దేవుడనే రాజు దుర్మార్గుడు, వాడు మహాబలవంతు డైనప్పటికీ విద్యలు సాధించిన నీకు అసాధ్యుడు కాడు. వాడు ఉత్తరవేదార్ధములో ఉన్నాడు. దక్షిణవేదార్ధములో గౌరీముండుడు అనే దుర్బుద్ధి విద్యాప్రభావ సంపన్నుడు మానసవేగునికి ప్రాణస్నేహితుడు రాజు. వానిని జయిస్తేనే

కార్యసిద్ధి అవుతుంది. కాబట్టి నీవు ముందు తపస్సుచేసి అఖండ విద్యా బలము సంపాదించు'.

ధనవతి లేచి 'నాయనా, మీమామగారు చెప్పింది సత్యము. కాబట్టి సిద్ధ క్షేత్రానికి వెళ్ళి మహేశ్వరుని గురించి తపస్సు చెయ్యి, ఈశ్వరానుగ్రహము లేనిది శుభము ఎలా కలుగుతుంది? నీవు తపస్సు చేసే కాలములో ఈవిద్యాధర ప్రభువులు నిన్ను సంరక్షిస్తూ ఉంటారు' అని చెప్పింది. చిత్రాంగదుడు లేచి నేను ముందుగా వెడతాను. అని బయలు దేరినాడు.

నరవాహనుడు వెంటనే ప్రయాణ మంగళము చేయించి తల్లి దండ్రులకు ప్రణామము చేసి దీవనలు పొంది అమితగతి ప్రజ్ఞచేత సృష్టించిన పల్లకీలో భార్యలు, తాను, మంత్రులూ ఎక్కినారు. ధనవతి మొదలైన వారి ప్రభావమువల్ల క్షణ కాలములో వారంతా సిద్ధక్షేత్రము పర్వతము చేరినారు. నరవాహనుడు సిద్ధులవల్ల వ్రతవిధానము ఉపదేశము పొంది ప్రాతఃస్నానము చేస్తూ, ఫలములు తింటూ, నేల మీదనే పడుకొంటూ మహేశ్వరునిగూర్చి తపస్సు చేస్తున్నాడు. విద్యాధరులు అప్రమత్తులై అహోరాత్రములు అతనిని కనిపెట్టుకొని ఉన్నారు.

ఆవిధముగా తపస్సు చేస్తున్న నరవాహనుని విద్యాధరకన్యలు చూచి మోహించినారు. అందులో ఐదుగురు 'మనము అయిదుగురమూ ఒక్కసారే ఇతనిని పెళ్ళాడదాము. అలా కాక ఎవతె ఐనా విడిగా వివాహమాడితే తక్కిన నలుగురమూ ఆదుర్మార్గురాలిని శపించి అగ్నిప్రవేశము చేతాము' అని ప్రమాణం చేశారు. ఇంతలో ఆతపోవనములో ఉత్పాతాలు బయలుదేరినవి. వాయువు చెలరేగి భయంకరంగా విసిరి మహావృక్షాలను పెకలించి వేసింది. భూమి కంపించింది. కొండలు పగిలినవి. ఆకాశాన మబ్బులు లేకుండానే ఉఱుములు ఉరిమి

నవి. నరవాహనుడు నిష్కంపంగా మహేశ్వరుని ధ్యానిస్తున్నాడు. విద్యాధరులు అతనిని కనిపెట్టుకొని ఉన్నారు.

మర్నాడు శత్రుసైన్యాలు ఆకాశమంతా నిండినవి. ధనవతి విద్యా ప్రభావమువల్ల సమస్తమూ గ్రహించి 'మానసవేగుడు గౌరీముండు నితో కలిసి మనమీదికి వచ్చినాడు' అని చెప్పింది. గౌరీముండుడు విద్యాధరులను చూచి 'మనిషి ఎక్కడ, మన మెక్కడ? వీనిపక్షము అవలంబించిన మిమ్మల్ని సంహరిస్తాను, అని అరచినాడు. అప్పుడు చిత్రాంగదుడూ సాగరదత్తుడూ గౌరీముండునితో తలపడినారు. అమిత గతి, చండసింహుడు, వాయుపథుడు, పింగళ గాంధారుడు, తక్కినవిద్యా ధరేశ్వరులు తమసైన్యముతో మానసవేగుణ్ణి ఆక్రమించినారు. ఘోర యుద్ధము జరిగింది. తనసైన్యము యావత్తు నశించినమీదట గౌరీ ముండుడు తాను ఉపాసించిన గౌరీవిద్యను స్మరించినాడు. ఆవిద్యా మూర్తి భవించి త్రినేత్రములతో త్రిశూలముతో ఆవిర్భవించింది. నర వాహనదత్తునిపక్షమువారు మూర్ఛపోయినారు. గౌరీముండుడు నూతన బలముతో సింహనాదము చేసి ద్వంద యుద్ధానికి రమ్మని నరవాహనుని మీదికి దూకినాడు. బాహుయుద్ధములో నరవాహనునిచేత దెబ్బ తిని గౌరీముండుడు గౌరీవిద్యను స్మరించి నరవాహనుని చేతులతో ఎత్తి ఆకా శాని కెగిరాడు. ధనవతిచేసిన ప్రతిక్రియవల్ల గౌరీముండుడు అతనిని చంప లేక అగ్నిపర్వతముమీద పడవేసినాడు. మానసవేగుడు నరవాహనుని మంత్రులైన గోముఖాదులను ఎత్తుకొనిపోయి దిక్కుదిక్కునా పారవేసి నాడు. ధనవతీప్రభావమువల్ల వాళ్ళు చనిపోక భూమండలంమీద విడి విడిగా నిలిచినారు. గౌరీముండ మానసవేగులు యుద్ధములో జయించి నట్లు అనుకొని తమనివాసములకు వెళ్ళినారు. 'నరవాహనుడు విద్యా సిద్ధిపొంది త్వరలోనే మిమ్మల్ని కలుసుకుంటాడు. అతని కేమీ హాని కలగదు అని ధనవతి విద్యాధరగంధర్వులకు చెప్పి వారిని నిజనివా

పాలకు పొమ్మని అజినావతినీ, ఆమె సవతులనూ తనమందిరానికి తీసుకొనివెళ్ళింది.

మానసవేగుడు ఇంటికి పోయి మదనమంచుకతో 'యుద్ధములో నీభర్తను సంహరించాను. ఇక నన్ను స్వీకరించు' అని పలికినాడు. దేవతలు నిర్మించిన ఆయన నెవరూ చంపలేరు. మిమ్మల నందరినీ ఆయనే సంహరిస్తాడు. అని మదనమంచుక నవ్వుతూ చెప్పింది.

నరవాహనుడు అగ్నిపర్వతములో పడలేదు. మధ్యలోనే దివ్యపురుషుడు అతనిని పట్టుకొని రక్షించి మందాకినీతీరము చేర్చినాడు. ఎవరు నీవని అడిగితే 'నేను విద్యాధరాధిపతిని. అమృతప్రభుడు నా పేరు. నిన్ను రక్షించమని శివాజ్ఞ అయినది. అదే పరమేశ్వరనివాస మైన కైలాసము. మహేశ్వరుని ఆరాధించినిర్విఘ్నంగా శ్రేయస్సు పొందుదువుగాని. నిన్నక్కడకు తీసుకొని పోతాను' అని ఆ దివ్యపురుషుడు అతన్ని కైలాసగిరిమీద దింపి సెలవు తీసుకొన్నాడు.

నరవాహనుడు తపస్సుచేసి మొదట విఘ్నేశ్వరుని మెప్పించి సెలవు తీసుకొని మహేశ్వరాశ్రమము ప్రవేశించి ద్వారములో నందీశ్వరునికిప్రదక్షిణము చేసినాడు. నంది అతనితో 'నీవుసిద్ధుడవు అయినట్టే. నీవిఘ్నాలు శాంతిపొందినవి. అయినప్పటికీ ఈశ్వరప్రీతి అయ్యేవరకూ ఇక్కడ ఉండే తపస్సుచెయ్యి.సమస్తపాపములూ హరించి శుద్ధిచేసితపస్సు సిద్ధులనిస్తుంది' అని బోధించినాడు. నరవాహనుడు వాయుభక్షణ చేస్తూ ఉమామహేశ్వరులను ధ్యానిస్తూ తపస్సు చేసినాడు. సంతోషించి మహేశ్వరుడు పార్వతీదేవితోకూడా ప్రత్యక్షమయి 'వత్సా, నీవు ఇక సమస్తవిద్యాధరులకు చక్రవర్తి వవుతావు. మహావిద్యలన్నీ నీకు ప్రాదుర్భవిస్తవి. నీవు ఇక శత్రువులకు అజయ్యుడవు, అచ్ఛేద్యుడవు, అభేద్యుడవు అవుతావు. సమస్తశత్రుసంహారము చేస్తావు. నిన్ను చూచేసరికి నీశత్రువులకు ఉండేవిద్యాప్రభావాలు లోపించి పోతవి. నీకు గౌరీవిద్యకూడా ప్రాప్తి

స్తుంది' అని అనుగ్రహించి, బహ్మనిర్మిత మైనమహాపద్మవిమానము అతని కిచ్చినాడు. అంతట సకలవిద్యలూ విగ్రహము ధరించి అతనియెదట ఆవిర్భవించి ఆజ్ఞను చూస్తూ నిలిచినవి.

ఈవిధముగా నరవాహనుడు వరములు పొంది పార్వతీపరమేశ్వరులకు ప్రణామము చేసి అనుజ్ఞ పొంది మహాపద్మవిమాన మెక్కి వక్రపురము చేరినాడు. అతనిని దూరమునుంచే చూచి అమితగతి మహారాజు ఎదురు పోయి నమస్కరించి అతనిని తనమందిరానికి తీసుకొని వచ్చినాడు. వరములు లభించినవృత్తాంతము సవిస్తరముగా విని అమితగతి తనకూతురు సులోచనను ఇచ్చినాడు. అపరవిద్యాధర లక్ష్మివలె విలసిల్లు తున్న ఆసులోచనతో నరవాహనదత్తచక్రవర్తి ఆరోజు సుఖముగా గడిపినాడు.

## తరంగము : ౧౦౮

మర్నాడు వక్రపురములో నూతనచక్రవర్తి నరవాహనుడు కొలువు తీర్చి ఉండగా వేత్రహస్తుడు ఒకడు ఆకాశము నుంచి దిగివచ్చి 'దేవా కులక్రమాగతముగా నేను చక్రవర్తి ప్రతీహారుడను. నాపేరు పౌరరుచి దేవుడు. ఏలినవారిని సేవించడానికి వచ్చాను' అని విన్నవించినాడు. అమితగతి అవును అన్నమీదట నరవాహనుడు అతనిని ప్రతీహారిగా స్వీకరించినాడు. వేగవతీ ప్రభృతులను తీసుకొని ధనవతి, ఇతర విద్యాధర ప్రముఖులు నూతనచక్రవర్తిని చూడడానికి వచ్చినారు. అందరికీ స్వాగతమని చక్రవర్తి ధనవతికిమాత్రము ప్రణామము చేసినాడు. ఆమె అల్లుని దీవించింది. సిద్ధివృత్తాంతము అతడు చెప్పగా చండసింహాదు లందరూ సంతోషించారు. తనభార్యలు వచ్చి పార్శ్వములో నిలిచినమీదట చక్రవర్తి నామంత్రు లేరీ అని ధనవతి నడిగినాడు. 'మానసవేగుడు వారిని దిక్కులకు విసిరివేస్తే రక్షించి వివిధ ప్రదేశా

లలో ఉంచాను. ఇప్పుడే పిలిపిస్తాను అని విద్యాప్రభావమువల్ల వారిని రప్పించింది. కుశలప్రశ్నాదికము అయినతరువాత చక్రవర్తి సచివులను 'ఇన్నిరోజులు మీరు ఎలా గడిపారో సవిస్తరంగా నాకు చెప్పవలెను' అని కోరినాడు.

మొదట గోముఖుడు తనవృత్తాంతమును ఈప్రకారముగా చెప్పినాడు: 'శత్రువు నన్ను విసిరివేయగానే ఎవరో దేవత నన్ను పట్టుకొని నెమ్మదిగా అరణ్యములో దింపి అదృశ్యమయింది. నేను దుఃఖముతో ప్రాణత్యాగము చేయబోతుంటే ఒకతాపసుడు వచ్చి, 'గోముఖా, కార్యసిద్ధి పొందిన నీప్రభువును మళ్ళీ చూస్తావు' అని నన్ను నివారించాడు. ఆర్యా ఎవరు మీరు? మీకిది ఎలావచ్చింది? అని నేనడిగితే తరువాత చెపుతాను. ముందు నాఆశ్రమానికి రా అన్నా డాయన. ఆయనకు పరోక్షజ్ఞానం ఉందని నమ్మి ఆయన ఆశ్రమానికి వెళ్ళాను. అది శివాలయము; ఆతాపసుడు నాకాతిథ్య మిచ్చి తన వృత్తాంతము ఈవిధముగా చెప్పినాడు.

## గో ము ఖు ని వృ త్తా ం త ము

నేను కుండిననగరనివాసిని, బ్రాహ్మణుడను. నానామము నాగస్వామి. మానాయన పోగానే నేను పాటలీపురానికి వెళ్ళి జయదత్తుడు అనే ఉపాధ్యాయునికి శుశ్రూష చేశాను. గురువు ఎంత చెప్పినా నాకు అక్షరం అంటలేదు. తక్కిన విద్యార్థులు నన్నుచూసి నవ్వసాగినారు. అవమానము సహించలేక వింధ్యవాసినీదేవి దర్శనము చేతా మని బయలుదేరి మార్గమధ్యములో వక్రోలకనగరము చేరాను. అక్కడ ఒకఇంటికి భిక్షకు వెడితే ఆ ఇల్లాలు భిక్షతోపాటు ఎర్రతామరపువ్వును కూడా ఇచ్చింది. అది తీసుకొని మరొకఇంటికి నేను వెళ్ళేసరికి ఆ ఇల్లాలు 'అయ్యో, నిన్ను యోగినిపట్టింది. చూసుకో. అది రక్తకమ

లముకాదు,మనిషి చెయ్యిఅన్నది. నేను కంగారుపడి చూస్తే అదిచెయ్యి' కాని కమలముకాదు. అది కింద పారవేసి ఆఇల్లాలిపాదాలకు మొక్కి 'అమ్మా, నేను బతికేఉపాయం చెప్పు' అని ప్రార్థించాను. 'ఇక్కడికి మూడు ఆమడలదూరాన కరభకగ్రామములో దేవరక్షితుడు అనే బ్రాహ్మడియింట కామధేనువువంటి కపిలగోవు ఉన్నది. నీవు వెళ్ళిదానిని శరణు వేడితే అది నిన్ను ఈ రాత్రికి కాపాడుతుంది' అనిచెప్పింది.

ఆమెకు నమస్కారము చేసి భయముతో తొందరతొందరగా ప్రయాణము చేసి చీకటి పడేటప్పటికి కరభకగ్రామము చేరి బ్రాహ్మణ గృహానికి పోయి కపిలగోవుకు నమస్కరించి 'తల్లీ, నన్నురక్షించు' అని వేడుకొన్నాను. ఇంతలోనే ఆయోగిని ఇతరయోగినులతోసహా ఆకాశ మార్గాన అక్కడికి వచ్చి 'తే, నీమాంసము, తే నీరక్తము' అని అరిచింది. కపిలగోవు తనగిట్టలనడుమ నన్ను దాచి ఆయోగినులతో పోరాడుతూ ఆరాత్రికి నన్ను రక్షించింది. తెల్లవారుఝామున యోగినులు వెళ్లిపోయినారు; వెళ్లిపోగానే గోవు స్పష్టవాక్కులతో 'వత్సా, ఇక నిన్ను రక్షించడం నావల్ల కాదు. ఇక్కడికి అయిదు యోజనాల దూరములో అరణ్యములో శివాలయములో పాశుపతోత్తము డైన జ్ఞాని ఉన్నాడు. ఆభూతిశివుడు నిన్ను ఒక్కరాత్రి రక్షిస్తాడు' అని చెప్పింది. నేను కపిలగోవుకు నమస్కరించి బయలుదేరి భూతిశివుని దర్శించి శరణు వేడినాను. రాత్రివేళ యోగినులు అక్కడికి వచ్చినారు. భూతిశివుడు నన్ను ఇంట్లో పెట్టి త్రిశూలము తీసుకొని ద్వారములో నిలుచుని యోగినులను జయించి తరవాత నాకు భోజనము పెట్టి తెల్ల వారినతరువాత 'బ్రాహ్మణా, ఇక నిన్ను రక్షించలేను. ఇక్కడికి పది యోజనాలలో సంధ్యావాస మనే గ్రామములో వసుమతి అనే బ్రాహ్మణుని దగ్గరకు పో. ఈ మూడోరాత్రి దాటితే ఈ యోగినులు నీజోలికి రారు' అన్నాడు. ఆయనకు నమస్కరించి నేను బయలుదేరి ఎంత

నడిచినా దారిలోనే సూర్యాస్తమానం అయింది. యోగినులు వచ్చి నన్ను పట్టుకొని ఆకాశమార్గాన వెళ్ళబోతుంటే కొత్తయోగినుల జట్టు ఎదురు వచ్చింది. ఉభయపక్షాలకూ పోరాటము ఆరంభ మయింది. దైవవశాత్తు నేను జారి నిర్జనప్రదేశంలో పడ్డాను.

అక్కడ పెద్ద ఇల్లొకటి ఉన్నది. ద్వారము తెరిచి ఉన్నది. నేను పరుగుపరుగున ఆమందిరములోకి వెళ్ళినాను. అక్కడ అనేకశత తరుణీ పరివృతురా లైన యువతీమణిని చూచి నేను ప్రశ్న వేసినాను. ఆమె యక్షిణి; పేరు సుమిత్ర. శాపమువల్ల ఆ అరణ్యములో ఉంటున్నది. మనుష్యసంగమమువల్ల ఆమెశాపము పోతుంది. సుమిత్ర తన పనికత్తెల చేత నాకు స్నానముచేయించింది. తరవాత చందనలేపనము, నవీనవస్త్రములు, షడ్రసోపేతభోజనము, సమస్తఉపచారములూ జరిగినవి. డాకినుల భయముతప్పి అఖండసౌఖ్యము అనుభవిస్తూ యక్షిణితో కొన్నిరోజులుగడిపినాను. ఒకనాడు ఆమె 'బ్రాహ్మణోత్తమా, నాశాపము తీరిపోయింది. ఇక ఇక్కడినుంచి వెళ్ళిపోతాను. నా అనుగ్రహామువల్ల నీకు దివ్యజ్ఞానము కలుగుతుంది. తాపసుడవు, సిద్ధభోగుడవు, నిర్భయుడవు అవుతావు. ఈమందిరమధ్యభాగములోకి ఎన్నడూ వెళ్ళకు' అని అదృశ్యురాలయింది.

మనస్సుఉండబట్టలేక నేను ఆమధ్యభాగములో ప్రవేశించాను. అక్కడి గుర్రముదగ్గిరికి వెళ్ళినాను. అది గిట్టతో నన్ను తన్నింది. ఆ దెబ్బకు వచ్చి ఈ శివాలయంలో పడ్డాను. అప్పటినుంచీ ఇక్కడే ఉంటూ క్రమేణా సిద్ధుడ నైనాను. మానవుడ నైనప్పటికీ నాకు త్రికాలజ్ఞానం కలిగింది. చాలా కష్టముమీాద గాని సిద్ధులు లభించవు. నీవు ఇక్కడే ఉండు. శివానుగ్రహామువల్ల నీకోరిక నెరవేరుతుంది. ఇలా జ్ఞాని చెప్పిన మీాదట ఇన్నాళ్ళూ అతని ఆశ్రమములోనే చాలా సుఖముగా ఉన్నాను. గతరాత్రి స్వప్నములో ఈశ్వరునివల్ల నీసంగతి తెలిసింది.

ఎవరో దేవత ఇక్కడికి నన్ను తీసుకొని వచ్చింది. ఇది నా వృత్తాంతము అని గోముఖుడు విరమించినాడు.

## మ రు భూ తి క థ

తరువాత మరుభూతి తనసంగతి ఇలా చెప్పినాడు: కూనసవేగుడు నన్ను విసిరివేయగానే ఎవరో దేవత నన్నుపట్టుకొని రక్షించి అడవిలో విడిచిపెట్టి అంతర్ధాన మైనది. దుఃఖభారముచేత నేను ప్రాణములను విడుద్దామని ప్రయత్నిస్తూ తిరుగుతూఉంటే ఆశ్రమము కనపడ్డది. దాని చుట్టూ నది ఉన్నది. అక్కడ శిలాతలముమీద కూర్చున్న తాపసుని సమీపించాను. ఎవరు నీవు? మనుష్యులు అడుగుపెట్టడానికి వీలులేని ఈ భూమికి ఎలా వచ్చినావు? అని ఆయన నన్ను అడిగితే సమస్తమూ చెప్పినాను. నీవు ప్రాణత్యాగము చెయ్యకు. నీ ప్రభువుసంగతి తెలుస్తుంది. తరవాత నీఇష్టమువచ్చినట్టు చెయ్యవచ్చు' అన్నాడు ఆ తాపసుడు. ఆనదిలో స్నానం చేయటానికి దివ్యాంగనలు వచ్చారు. పో, స్నానము చేసే స్త్రీలలో ఒకదాని చీర పట్టుకు రా. దానివల్ల నీకు ప్రభువు వృత్తాంతము తెలుస్తుంది. అని ఆయన అంటే నేను ఆయన మాటప్రకారము చేశాను. అప్పుడు ఆతరుణి తడిబట్టతో రొమ్ముమీద చేతులు పెట్టుకొని నావెంట వచ్చింది. 'నరవాహనదత్తుని వృత్తాంతము చెపితే నీకు వస్త్రము ఇస్తాను' అన్నాడు తాపసుడు. ఆయన ఇప్పుడు ఈశ్వరారాధన చేస్తూ కైలాసాన ఉన్నాడు. త్వరలోనే విద్యాధర చక్రవర్తి అవుతాడు'. అని చెప్పి, ఆదివ్యయువతి శాపవశాన ఆతాపసునికి భార్య అయింది. ముని ఆమెతో కొంతకాలము గృహస్థాశ్రమ సుఖములు అనుభవించాడు. ఆమె మాటప్రకారము నేను నీ సమాగమముకోసం ఎదురుచూస్తూ ఉన్నాను. ఆ దివ్యయువతి కొన్నాళ్లకు ప్రసవించి తాపసునితో 'నాశాపము నేటితో తీరింది. మళ్ళీ సమా

గమము నీవు కోరేపక్షములో ఈ బిడ్డను బియ్యముతో కలిపివండి తిను' అని వెళ్ళిపోయింది. ఆయన ఆప్రకారమే చేసి గగనమార్గాని కెగిరి ఆమెను కలుసుకున్నాడు. నన్ను కూడా ఆ వంట తిన మన్నాడు. కాని నేను అంగీకరించలేదు. ఆయనను సిద్ధి లభించడం చూచి నేను అన్న భాండము శోధించి అందులో రెండుమెతుకులు దొరికితే తిన్నాను. అందువల్ల నేను దేనిమీద ఉమ్మివేసినా అది బంగార మౌతున్నది.

తరవాత అక్కడినుంచి బయలుదేరి ఒకానొకనగరము చేరి వేశ్య ఇంటికి పోయి బంగారము బాగా ఖర్చుపెడుతున్నాను. వేశ్యమాత నాఅంతు కనుక్కోవలె నని రహస్యముగా వమనౌషధము ప్రయోగించింది. నాకు కక్కులు వచ్చినవి. నేను తిన్న రెండుమెతుకులూ పద్మరాగాలవలె నోటిలోనుంచి ఇవతల పడినవి. వేశ్యమాత వెంటనే అవి తీసుకొని భక్షించింది. నాకు స్వర్ణసిద్ధి పోయింది, దానికి కలిగింది. నేను విచారముతో నిన్ను ధ్యానిస్తూ చండికాలయానికి వెళ్ళి త్రిరాత్రోపవాసము చేశాను. దేవి స్వప్నములో కనపడి 'వత్సా, నీప్రభువు కోర్కెలు సిద్ధించినవి. వెళ్ళి ఆయనను చూడు' అని ఆజ్ఞఇచ్చింది. నాకు మెళుకువ వచ్చింది. తెల్లవారేసరికి ఎవరో దేవత నన్ను నీసన్నిధానానికి తీసుకొని వచ్చింది'. ఈప్రకారము మరుభూతి చెప్పగా వేశ్యవల్ల మోసపోయినా డని అందరూ మరుభూతిని చూచి నవ్వినారు.

## హ రి శి ఖు ని వృ త్తాం త ము

హరిశిఖుడు ఆతరువాత ఇలా చెప్పినాడు: శత్రువు నన్ను విసిరి పారవేయగానే ఎవరో దేవతతీసుకొని పోయి ఉజ్జయినిలో దింపింది. దుఃఖాతిశయముచేత నేను దేహము చాలించా లని రాత్రి శ్మశానానికి వెళ్ళి చితిపేర్చి నిప్పు పుట్టించడానికి అగ్నిని పూజిస్తూ ఉంటే తాళజంఘుడు అనే భూతరాజు వచ్చి 'ఎందుకు అగ్నిప్రవేశము చేస్తావు?

నీ ప్రభువు సజీవంగా ఉన్నాడు. అతనికి సిద్ధులు లభించిన తరువాత మీరిద్దరూ కలుసుకో గలరు' అని మంచిమాటలు చెప్పి [illegible] తప్పించాడు. నేను ఆతరువాత మహాకాళేశ్వరుని సన్నిధిలో తపస్సు చేస్తూ ఉన్నాను. ఎవరో దేవత నన్ను ఇక్కడికి తీసుకొని వచ్చింది.

ఈవిధముగా హరిశిఖుడు చెప్పినమీదట మిగిలిన సచివులుకూడా తమతమ వృత్తాంతాలు వివరించారు. అమితగతి మాటప్రకారము నరవాహనుడు ధనవతిని ప్రేరేపించి తన సచివులకు ఆమెచేత సమస్తవిద్యలూ ఇప్పించినాడు. అతనిసచివు లంతా విద్యాధరు లైనారు.

## విజయయాత్ర

ధనవతి మంచిరోజు చూచి 'ఈవేళ బయలుదేరి శత్రువులను జయించు' అని ప్రబోధించేసరికి నరవాహనుడు గౌరీముండునినగరము గోవిందకూటముమీదికి దండయాత్రకు ఆజ్ఞ ఇచ్చినాడు. విద్యాధర బలము అసంఖ్యాకముగా బయలుదేరింది. నరవాహనుడు పద్మవిమాన ములో కూచుని భార్యలనూ మిత్రులనూ యథాస్థానాలలో కూచోపెట్టి ఆకాశమార్గాన బయలుదేరినాడు. మార్గమధ్యములో మాతంగపుర ములో దిగి ధనవతి చేసినసపర్యలు స్వీకరించి ఆరో జక్కడ గడిపి గౌరీ ముండ మానసవేగులకు యుద్ధవార్త తెలపడానికి దూతలను పంపించి, భార్యలను మాతంగపురములోనే ఉంచి గోవిందకూటముమీదికి బయలు దేరినాడు. చండసింహాదులు గౌరీముండ మానసవేగులను ఎదుర్కొ న్నారు. నరవాహనుడు మానసవేగుని తరిమి, జుట్టు పట్టుకొని శిరస్సు ఖండించినాడు. అది చూచి రౌద్రాకారముతో తనమీదికి వచ్చినగౌరీ ముండుని పట్టుకొని ఒక్కచూపుతో వాని విద్య లన్నీ స్తంభీభూతము చేసి నేలమీద పడద్రోసి కాళ్ళు పట్టుకొని ఎత్తి గిరగిరా తిప్పి పాషా ణముమీద బాదినాడు. ఈప్రకారముగా మానసవేగ గౌరీముండులునశిం

చినమీదట వాళ్ళసేనలు భయపడి పారిపోయినవి. నరవాహనునిమీద పుష్పవర్షం కురిసింది. దేవతలు భళీభళీ అన్నారు. తరవాత నరవాహనుడు విద్యాధరేశ్వరులతో కలిసి గౌరీముండునిరాజధాని అయిన గోవిందకూటము ప్రవేశించినాడు. గౌరీముండునిబంధువు లందరు నరవాహనునికి లోబడి అతనిశాసనము శిరసా వహించినారు.

## మదనమంచుకా సమాగమము

విజయోత్సవము జరుగుతుండగా ధనవతి నరవాహనదత్తునితో 'గౌరీముండునికూతురు ఆత్మనిక అనే కన్యారత్నమున్నది. దానిని పెళ్ళి చేసుకో' అని చెప్పింది. సరేఅని నరవాహనుడు ఆమెను అక్కడికి రప్పించి వివాహమాడి ఆరాత్రి సుఖముగా గడిపి ప్రభాతసమయాన ప్రభావతీవేగవతులను పంపించి మదనమంచుకను మానసవేగునినగరము నుంచి రప్పించినాడు. ఆమె వచ్చినతరువాత సకలవిద్యలూ ఇచ్చి వెంటనే విద్యాధరత్వము పొందిన మదనమంచుకతో కొన్నిరోజులు సుఖముగా గడిపి ప్రభావతిద్వారా భగీరథయశను రప్పించి ఆమెకు సమస్త విద్యలూ ఇచ్చినాడు.

## మందరదేవుని వృత్తాంతము

ఒకనాడు చక్రవర్తి కొలువుతీర్చి ఉండగా ఇద్దరువిద్యాధరులు వచ్చి నమస్కరించి 'దేవా, మేము ధనవతీదేవిగారి అజ్ఞానుసారముగా మందరదేవుని సంగతి సందర్భాలు తెలుసుకోడానికి ఉత్తరవేదర్ధానికి వెళ్ళినాము. అతనిఆస్థానములో మేము ప్రచ్ఛన్నముగా ఉండి విన్నమాటలు ఏలినవారికి మనవిచేయడానికి వచ్చినాము. తమరు విద్యాధరేశ్వరులై గౌరీముండాదుల నందరినీ సంహరించినసంగతి అతనికి తెలిసింది. మిమ్మల్ని ఉపేక్షించ డట. శత్రువు పైకి వస్తున్నప్పుడే తుంచివేస్తా

డట' అని విజ్ఞాపన చేసినారు. చారులు చెప్పినమాటలకు సభలో అంద రికీ కోపము వచ్చింది. నరవాహనుడుమాత్రము క్రోధము కనపడనీయక శాంతముగా ఉన్నాడు.

విద్యాధరచక్రవర్తిఅంగములు సాధించడానికీ, శత్రువులనుజయించ డానికీ భార్యలతోను మంత్రులతోనూ విమాన మెక్కి నరవాహనుడు గోవిందకూటమునుంచి బయలుదేరి హిమాలయము చేరి సరోవరము చూచినాడు. 'చక్రవర్తికేగాని అన్యునికి ఇందులో స్నానము చేయ డము సంభవించదు. ఇప్పుడు నీకు స్నానసిద్ధి అవుతున్నది. కాబట్టి చక్రవర్తిత్వము సిద్ధిస్తున్నది' అని దివ్యవాణి వినవడ్డది. ఆమాటలు విని నరవాహనుడు భార్యలతోకూడా సరస్సులో దిగి జలక్రీడ లాడినాడు. స్నానానంతరము ఆసరోవరతీరాన సపరివారముగా ఆరోజు గడిపి ప్రాతః కాలాన బయలుదేరి విమాన మెక్కి పోయి మార్గములో వాయుపథుని నగరముచేరి అతని కోరికమీద ఒకరోజు అక్కడ ఆగినాడు.

పూర్వము వాయుపథుని చెల్లెలు వాయువేగయశ అనేకన్య నర వాహనుని చూచింది. ఇప్పు డామె ఉద్యానములో కనపడే టప్పటికి అతనికి వలపు పుట్టింది. వాయువేగయశ స్వర్ణవాలుకా నదీతీరాన ఉద్యానములో విహరిస్తూ ఆతనిని చూచి అతనిమీద ఆసక్తి ఉన్నప్ప టికి అంతర్ధానము పొందింది. ఆమెసిగ్గు వల్లనో మరేకారణముచేతనో కనబడకుండా పోయిం దని అనుకొని అతడు విడిదికి వెళ్ళినాడు. మరు భూతివల్ల ఈవృత్తాంతము గోముఖుడు గ్రహించి చక్రవర్తిసిబ్బంది వాయువేగయశసంగతి గ్రహించడానికి నగరానికి వెళ్ళినాడు. నగరం చూడడానికి వచ్చినట్టు నటించిన గోముఖునికి వాయుపథుడు అతిథి సత్కారాలు చేసి ఏకాంతప్రదేశానికి తీసుకొనిపోయి 'నాచెల్లెలువాయు వేగయశ చక్రవర్తికిభార్య అవుతుం దని సిద్ధులు చెప్పినారు. కాబట్టి ఆమెను చక్రవర్తికి ఇస్తాను. మీసహాయము కావాలి. మీదగ్గరికి వస్తా

మనుకుంటున్నాను' అన్నాడు. 'చక్రవర్తి శత్రువును జయించడానికి బయలు దేరినాడు. అయినప్పటికీ నీవు వెళ్లి విన్నవించు నేనుకూడా తోడ్పడతాను' అని గోముఖుడు సెలవు తీసుకొని నరవాహనునిదగ్గరికి వెళ్ళి 'మనము ప్రార్థించకుండానే కార్యము సిద్ధించింది' అన్నాడు. మర్నాడు వాయుపథుడు వచ్చి విన్నపము చేసినమీదట గోముఖుడు 'దేవా వాయుపథునికి నీమీద చాలా భక్తి. ఇతని ప్రార్థన అంగీకరించాలి' అని తోడు పలికినాడు. నరవాహనుడు అంగీకరించినాడు. తన చెల్లెలి కిష్టములేక పోయినప్పటికీ వాయుపథుడు ఆమెను చక్రవర్తికి ఇచ్చినాడు. 'లోకపాలకులారా, నాదోషములేదు. నే నంగీకరించక పోయినా మాఅన్న నన్ను చక్రవర్తికి బలవంతాన ఇచ్చినాడు' అని వాయువేగయశ ఆక్రోశించింది. ఆ కేక వినపడకుండా వాయుపథుని రాణులు కోలాహలము చేసినారు. తనప్రభువుకు అవమానకరమైన కేకకు కారణమేమై ఉంటుందో అని గోముఖుడు ఆలోచిస్తూ కొంతదూరం వెళ్ళినాడు. ఒకచోట నలుగురు విద్యాధరకన్యలు అగ్నిప్రవేశము చేయడానికి సిద్ధముగా ఉన్నారు. గోముఖుడు కారణ మడిగితే వాయువేగయశ చేసిన ప్రతిజ్ఞ ఉల్లంఘించడమే కారణ మన్నారు. వాళ్ళు వారిని తొందరపడ వద్దని చెప్పి త్వరలో వస్తానని గోముఖుడు వెళ్లి చక్రవర్తికి ఈసంగతి చెప్పినాడు. అతడు ఆశ్చర్యపడుతుంటే వాయువేగయశ 'ఆర్యపుత్రా, త్వరగా లేవాలి; వెళ్లి ఈకన్యలను రక్షింతాము; కారణము తరవాత చెపుతాను' అని తొందర పెట్టింది. చక్రవర్తి అక్కడ ఉన్నవా రందరినీ వెంటబెట్టుకొని శీఘ్రముగా వెళ్లి చితులకు నిప్పు అంటిస్తున్న నలుగురినీ చూచినాడు. వాయువేగయశ వాళ్ళను వారించి భర్తతో ఇలా చెప్పింది 'ఆర్యపుత్రా, ఈమె కాళిక, కాలకూటపతి కుమార్తె. ఈమె విద్యుత్పుంజుని పుత్రిక. ఈమె మందరునికి కూతురు

మతంగిని. ఈమె మహాదంష్ట్రుని కుమార్తె పద్మప్రభ. ఈ నలుగురూ నేనూ కలిసి సిద్ధక్షేత్రములో తపస్సు చేస్తూ ఉండగా నీవు మాకు కన పడ్డావు. ఈప్రియుని మనము అయిదుగురము వివాహము చేసుకోవాలి. విడిగా ఎవరూ వివాహ మాడకూడదు. ఎవరైనా ఒకతె అలాచేస్తే తక్కినసలుగురూ అగ్నిప్రవేశము చేయాలి' అని. ఆనాడే నియమం చేసు కొన్నాము. అందుచేతనే వివాహానికి ప్రత్యేకంగా అంగీకరించలేను. మాఅన్న బలవంతాన ఇచ్చినాడు. నేను ప్రతిజ్ఞ ఉల్లంఘించనందుకు నీవూ లోకపాలకులూ సాక్షులు కాబట్టి ఆర్యపుత్రా, ఈ నాచెలికత్తె లను కూడా నీవు వివాహం చేసుకోవాలి- సఖులారా, మీరు అన్యథా భావించకూడదు".

ఈ మాటలకు ఆ నలుగురు కన్యలు మరణము మానుకొని అన్యో న్యాలింగనాలుచేసుకొన్నారు. ఈవృత్తాంతము తెలుసుకొని విద్యాధర కన్యల తండ్రులు వచ్చి నరవాహనునికి తమ పుత్రికల నిచ్చి అల్లుని చక్రవర్తిత్వం అంగీకరించినారు. ఈప్రకారముగా గొప్పవిద్యాధర ప్రభు వుల పుత్రికలను ఒక్కసారే పెళ్ళాడి నరవాహనుడు పంచ కన్యలతో అక్కడనే కొన్నిరోజు లున్నాడు.

ఒకనాడు సేనాపతి హరిశిఖుడు ప్రభువుతో 'దేవా, రాజనీతి తెలిసి కూడా ఇలా ప్రవర్తిస్తున్నావేమి? యుద్ధము దగ్గరలో ఉంటే ఈ భోగా లేమిటి? మందరదేవుణ్ణి జయించడానికి బయలుదేరడ మేమి, రాణివాసా లతో ఇన్నాళ్లు విహారాలేమి!' అని మందలించినాడు. 'నీవు చెప్పింది నిజమేకాని భోగాలకోసము నే నేమైనా ప్రయత్నం చేశానా? ఈనూతన భార్యలవల్ల శత్రుసంహారానికి ఉపయోగించే బంధుసంపద హెచ్చుతూ ఉండడంవల్ల అంగీకరిస్తున్నాను. ఇక శత్రువిజయార్థము బయలుదేరు దాము' అన్నాడు.

అతనిమామ మందరుడు ఈ విధముగా చెప్పినాడు. 'శత్రువును జయించడానికి చక్రవర్తి అంగములైన రత్నాలను సాధించాలి. మందర దేవుని జయించడం సామాన్యము కాదు. అతను ఉన్నది దుర్గమభూమి. ద్వారదేశంలో దేవమాయు డనే మహావీరుడు కాపలా ఉన్నాడు. త్రిశీర్ష గుహా ముం దున్నది. రత్నాలను సాధించిన చక్రవర్తే కాని ఇంకొకడు ఆ గుహలో అడుగు పెట్టలేడు. చక్రవర్తి రత్నాలలో ప్రధానమైన చందనవృక్షము ఈ భూమిలో ఉన్నది. ప్రథమములో దాన్ని సాధించు. చక్రవర్తే కాని ఇతరు లెవ్వరూ ఆ వృక్షసమీపానికి వెళ్ళలేరు'

మందరుని బోధ విని నరవాహనుడు నిరాహారుడై నియమ పూర్వకంగా ఉండి ఆచందనవృక్షము దగ్గిరికి వెళ్ళినాడు. మార్గములో అడుగడుగుకూ విఘ్నములు కలుగుతున్నప్పటికీ అతడు సహించి ఆ వృక్షమూలములో ఉన్న ఉన్నతవేదికమీదికి మెట్లమీదుగా ఎక్కి వృక్షరాజానికి నమస్కారము చేసినాడు. 'చక్రవర్తీ' చాలా సంతోషము నన్ను తలుచుకొన్నప్పుడు నీసన్నిధికి వస్తాను. ఇక గోవిందకూటానికి వెళ్లు. తక్కినరత్నములు అక్కడ నీకు సిద్ధిస్తవి. తరవాత మందరదేవుణ్ణి తేలికగా జయిస్తావు' అని వృక్షములోనుంచి అశరీరవాణి వినపడ్డది. సంతోషించి నరవాహనుడు వృక్షానికి నమస్కరించి ఆకాశమార్గాన తనశిబిరము చేరుకొన్నాడు. తెల్లవారినతరువాత నరవాహనుడు సభ చేసి, తాను చందనవృక్షాన్ని సాధించిన విధాన మంతా వర్ణించినాడు. విన్నవారందరూ చాలా ఆనందించి ఆతని శక్తిసామర్థ్యాలను ప్రశంసించారు. తరవాత చక్రవర్తి ఆప్తులతో ఆలోచించి దివ్యవిమాన మెక్కి చందనవృక్షము చెప్పిన తక్కినరత్నాలను సాధించడానికి గోవిందకూట గిరికి ప్రయాణ మైనాడు.

త ర ం గ ము : ౧౧౯

నిశాసు తాణ్డవోద్దణ్డ
శుణ్డాసీత్కార సీకరైః
జ్యోతింపి పుష్ణ న్నివ ప
స్తమో ముష్ణాతు విఘ్నజిత్.

తాండవోద్దండ తుండసీత్కారసీక
రములచేత నేవేలుపు రాత్రులందు
వెలుగుచును వృద్ధి చేసెడి విధిని దోచు
అట్టి విఘ్నేశ్వరుడు తమం బడచుగాక!

## ర త్న సి ద్ధి

ఆవిధముగా నరవాహనదత్తుడు గోవిందకూటమున ఆస్థానములో ఉండగా, అమృతప్రభుడు అనే విద్యాధరుడు ఆకాశమార్గాన అతని వద్దకు వచ్చినాడు. శత్రువులు పూర్వము నరవాహనుని అగ్నిపర్వతాన పడవేస్తే రక్షించినవాడు. వచ్చి విద్యాధరుడు తా నెవరో తెలుపుకొని నమస్కారము చేస్తే చక్రవర్తి ప్రీతిపూర్వకముగా అతనికి అతిథిసత్కారాలు చేసినాడు.

"దక్షిణదిక్కున మలయము అనే మహాపర్వత మున్నది. అక్కడి ఆశ్రమములో వామదేవ మహాముని ఉన్నాడు. నీతో ఏమోపని ఉన్నదనీ, నీవు ఒంటరిగా రావలెననీ నిన్ను పిలుచుకు రమ్మనీ నన్ను పంపించినాడు. ప్రభూ! ఇదివరలోనే నీవు నా ప్రభువు. అందుచేత వచ్చినాను. కాబట్టి కార్యసిద్ధికోసము ఆ మునిసన్నిధికి వెళ్ళుదాము. త్వరగా రావలి" అని విద్యాధరుడు విన్నవించినాడు.

చక్రవర్తి భార్యలనూ సైన్యమునూ అక్కడే నిలిపి అతని వెంట ఉండాలని ఏడెనిమిది క్షణంలో మలయాచలము జేరి వామదేవఋషిని దర్శించి నాడు. ఆముని వార్ధకముచేత పాలిపోయినాడు. చాలా ఉన్నత శరీరుడు. మాంసహీనము లయిన నేత్రకుహరాలతో కనుపాపమణులు మెరుస్తున్నవి. తన చరణములకు నమస్కరించిన నరవాహనునికి ఆతిథ్య మిచ్చి ముని ఇలా చెప్పినాడు. "పూర్వము నీవు కాముడవు. హరుడు నిన్ను దహించినప్పటికీ, రతీదేవిమీది అనుగ్రహముచేత సర్వవిద్యాధర చక్రవర్తిగా నిర్మాణము చేసినాడు. ఈ ఆశ్రమములో గుహాలోపల చాలాలోతున రత్నా లున్నవి. వాటిసంగతి చెపుతాను. నీవు వాటిని సాధించాలి. సిద్ధరత్నుడ వైన నీకు మందరదేవుడు స్వాధీను డవుతాడు. మహాదేవుని అనతిప్రకారము నిన్నుఇందుకోసమే ఇక్కడికి రప్పించాను."

అప్పుడు ముని నరవాహనుకి రత్నసాధన విధానము ఉపదేశించి నాడు. నరవాహనుడు సంప్రీతితో గుహాలో ప్రవేశించినాడు. అక్కడ రకరకాల విఘ్నాలు కలిగినవి. వాటిని అతడు జయించి ముందుకు వెళ్ళుతుంటే మహాగర్జనము చేస్తూ మదపుటేనుగు అతని మీదికి వచ్చింది. నరవాహనుడు పిడికిలితో దాని ముఖాన పొడిచి రెండుదంతాలమీదా రెండుపాదాలుంచి లాఘవముగా దానిమీది కెక్కి కూర్చున్నాడు.

"మేలుమేలు నీకు మహాగజరత్నము సిద్ధించింది" అని గుహానడుమ అశరీరవాణి వినబడ్డది. తర్వాత మహాఖడ్గము కనబడ్డది. నరవాహనుడు రాజ్యలక్ష్మి కీల్జడను పట్టుకున్నట్టు దానిని పట్టుకొన్నాడు. "సాధు సాధు! నీకు ఖడ్గరత్నము లభించిందని అశరీరవాక్కు బయలుదేరింది. పిమ్మట ఆ గుహాలో చంద్రికారత్నము, కామినీరత్నము విధ్వంసిని అనే విద్యారత్నం అతనికి లభించినవి. ఈప్రకారముగా వెనుకటి రత్నములతోపాటు సరస్సు చందనవృక్షము కలిసి ఏడురత్నములు లభ్యమైనవి. ఈ రత్నములు కార్యకాలములో ఉపయుక్త మయినవి; మహాత్తు సహ

కూర్చేవీని. అతడు గుహలోనుంచి వెలుపలికి వచ్చి వామదేవమహర్షితో రత్నసిద్ధిని గురించి చెప్పినాడు. అప్పుడు వామదేవుడు ప్రీతితో "నాయనా, మహాచక్రవర్తి రత్నాలు లభించినవి. ఇక వెళ్ళు కైలాసానికి ఉత్తరపార్శ్వములో ఉన్న మందరదేవుని జయించు. సామ్రాజ్యలక్ష్మిని రెండుపార్శ్వములా అనుభవించు" అని బోధించినాడు.

నరవాహనుడు మునికి నమస్కారము చేసి అమృతప్రభునితో ఆకాశమార్గాన బయలుదేరి గోవిందకూటముమీద ఉన్న తన శిబిరానికి క్షణకాలములో చేరినాడు. మహాప్రభావసంపన్నురా లయిన అతని అత్త ధనవతి శిబిరాన్ని కాపాడుతున్నది. అతని రాణులు, మంత్రులు, విద్యాధరాధిపులు అతనిరాకకు ఎదురు చూస్తున్నవారు చాలా సంతోషించారు. నరవాహనచక్రవర్తి కూర్చున్న తర్వాత వారు అతనిని విశేషాలు చెప్పమన్నారు. అతడు వామదేవమహర్షి దర్శనమూ, గుహాప్రవేశమూ, రత్నసిద్ధీ వర్ణించినాడు. అంతట దివ్యతూర్యములు మ్రోగినవి, విద్యాధరాంగనలు నర్తనము చేశారు. ఆసవాదులు పానము చేసి మహోత్సవము చేశారు.

ఆ మరునాడు శత్రుస్థానాలలో క్రూరగ్రహాలు కంటకస్థానాలలో సౌమ్యగ్రహాలూ ఉండి అన్యసంపత్తు లన్నీ కూడిన శుభలగ్నములో చక్రవర్తి మంగళసంపన్నుడై బ్రహ్మనిర్మితమూ ఈశ్వరదత్తమూ అయిన విమాన మెక్కి భార్యలతోనూ సైన్యముతోనూ బయలుదేరినాడు. సేనాపతి హరిశిఖుని ఆజ్ఞానుసారముగా గంధర్వరాజ విద్యాధరాధిపతులు కొందరు భయమువల్ల, కొందరు భక్తివల్ల చక్రవర్తి చుట్టూఉండి ప్రయాణము చేశారు. వివేకవతి అయిన తల్లి ధనవతితో చండసింహుడు, వీరు డయిన పింగళగాంధారుడు. వాయుపథుడు, విద్యుత్పుంజుడు, అమితగతి, కాలకూటపతి, మహాదంష్ట్రునితో మందరుడు, చక్రవర్తిమిత్రుడు అమితప్రభుడు, సాగరదత్తునితో వీరుడు,

చిత్రాంగదుడు, గౌరీముండుని ఆశ్రయించిన ఇతరవిద్యాధరులు తమతమ సైన్యాలతో మందర దేవుని జయించడానికి బయలుదేరినారు. దేవ ఋషి సమూహసేవిత మైన మానససరస్సు దాటి, దివ్యస్త్రీల లీలో ద్యాన మున్నగండశైలము గడిచి స్ఫటికధవళ మైన కైలాసపర్వత మూలము చేరినారు.

అక్కడ మందాకినీతీరాన కూర్చున్న చక్రవర్తితో విద్యాధరాధి పతి మందరుడు సస్నేహముగా "దేవా, ఈమందాకినీతీరాన మనము ఆగవలె. కైలాసపర్వతమువిూదుగా అవతలికి పోవడము యుక్తము కాదు. మహేశ్వరనివాసమైన ఈపర్వతముపైగా వెళ్ళితిమా మనవిద్యలు (శక్తులు) వెంటనే నశిస్తవి. త్రిశీర్షగుహద్వారా కైలాసగిరికి ఉత్తర ముగా వెళ్ళవచ్చు. అయితే ఆమార్గమును దేవమాయు డనే రాజు రక్షిస్తున్నాడు. అతడు చాలా దర్పము కలవాడు. అతనిని గెలవకుండా పోవడము ఎలాగు!" అన్నాడు. మందరునిమాటలు ధనవతి ఆమో దించింది. నరవాహనదత్తుడు అక్కడే ఆగి సామవాక్యాలతో దేవ మాయునివద్దకు దూతను పంపినాడు. అతడు ఇతనివాక్కులు లెక్క చెయ్యక ధిక్కరించి పంపినాడు.

## దేవమాయునితో యుద్ధము

మర్నాడు తనపక్షమురాజు లంతా తమతమ సైన్యాలతో సంసి ద్ధులై వెంటరాగా చక్రవర్తి దేవమాయుని విూదికి బయలుదేరినాడు. ఈసంగతి తెలిసి దేవమాయుడు వరాహ వజ్రముష్టిప్రముఖులగు ప్రభువు లతో సేనాసమేతుడై వచ్చి చక్రవర్తితో ఢీకొన్నాడు. ఉభయ సేనలూ తలపడ్డవి. ప్రచండ యుద్ధము జరిగింది. దేవమాయుని సేనాధి పతి అగ్రయోధుడూ అయిన వరాహుని చండసింహుడు సంహరించ డము ఆశ్చర్యము కానేకాదు. నరవాహనదత్తుడు యుద్ధములో దేవ

మాయుని ప్రహరించి మూర్ఛపోయిన అతనిని స్వయముగా బంధించి తేవడము మాత్రము చిత్రము. తర్వాత కట్టుతాళ్ళతో ఉన్న దేవమాయుని సైనికులు తనసన్నిధికి తీసుకొని వచ్చినపుడు చక్రవర్తి అనుగ్రహించి అతనిని ఓదార్చి కట్లు విప్పించినాడు. వజ్రముష్టిప్రభృతులయిన తన అనుచరులతో చక్రవర్తికి ప్రణామము చేసి ఆయనఆజ్ఞ శిరసావహించినాడు. అంతట యుద్ధము ఆగిపోయింది. దేవతలు మేలు మేలు అని ఆకాశాన పలికినారు. అందరూ చక్రవర్తిని ప్రశంసించినారు.

మర్నాడు ఉదయము కొలువుకూటములో చక్రవర్తి త్రిశీర్షగుహా ప్రవేశము చేయదలచినా నన్నాడు. అతని పార్శ్వమున నిలిచిన దేవమాయుడు గుహాచరిత్ర ఇలా చెప్పినాడు.

## త్రిశీర్ష గుహ

దేవా, పూర్వము కైలాసానికి ఉత్తర దక్షిణాలలో విద్యాధర రాజ్యాలు రెండు ఉండేవి. కొన్నాళ్ళకు ఋషభుడు తపస్సుచేసి మహేశ్వరుని సంప్రీతునిచేసి రెండు రాజ్యాలకు తా నొక్కడే చక్రవర్తి అయినాడు. ఋషభుడు ఒక పర్యాయము దక్షిణమునుంచి ఉత్తరానికి వెళ్ళడములో కైలాసము మీదుగా పోబోయి మహేశ్వరుని ఆగ్రహానికి గురిఅయి విద్యలు కోలుపోయి నేలమీద పడిపోయినాడు. మళ్ళీ అతడు ఘోరతపస్సు చేసి మహేశ్వరానుగ్రహము పొంది, యథాప్రకారముగా ఉత్తర దక్షిణాలకు చక్రవర్తి అయి, హరునితో "దేవదేవా, మేము కైలాసము దాటడానికి వీలు లేదాయె. ఇక ఏమార్గాన నేను రెండు రాజ్యాలు పరిపాలించగలను." అని మొర పెట్టుకొన్నాడు. అప్పుడు మహేశ్వరుడు కైలాసపర్వతము తొలిచి గుహామార్గము ఏర్పాటు చేసినాడు. రంధ్రము కావడముచేత కైలాసుడు విచారముతో "భగవన్, నా ఉత్తరభాగము మానవులకు అగమ్యము. ఇప్పుడు గుహామార్గము

వల్ల అది గమ్యముపుతున్నది. కాబట్టి నామర్యాదకు భంగములేకుండా అనుగ్రహించాలి" అని విన్నవించినాడు. అంతట మహేశ్వరుడు గుహాలో దిగ్గజాలను మహాసర్పరాజులను గుహ్యకులనూ కాపలా ఉంచినాడు. దక్షిణద్వారాన మహామాయుడు అనే విద్యాధరప్రభువును ఉత్తరద్వారాన కాళరాత్రి అయిన చండికనూ నిలిపినాడు. ఈవిధముగా కట్టుదిట్టములు చేసి మహేశ్వరుడు మహారత్నాలను సృజించినాడు. సిద్ధరత్నుడైన చక్రవర్తి ఉత్తరదక్షిణాలకు వెళ్ళగలడు. దేవతలూ, వారిభార్యలకూ, దూతలకూ ఈమార్గము సుగమము. చక్రవర్తి సమ్మతి సంపాదించిన ఉత్తరదిక్కురాజులు కూడా ఈమార్గాన వెళ్ళ గలరు. తక్కినవారు వెళ్ళలేరు" అని ఆనతి ఇచ్చినాడు.

ఋషభకుడు చక్రవర్తి పదవిలో ఉండి గర్వోద్రేకముతో దేవత లతో వైరము పెట్టుకొని మహేంద్రుని వజ్రాయుధముదెబ్బతిని చని పోయినాడు. దేవా, ఇది త్రిశీర్ష గుహ సంగతి. మీవంటివారుతప్ప ఇతరులు ఇందులో ప్రవేశించలేరు. మహామాయుని వంశములో కాల క్రమేణ నేను జన్మించాను. నాజనన కాలములో ఆకాశవాణి వీడు విద్యాధరులలో జనించాడు. మానవులు యుద్ధములో వీనిని గెలువలేరు. ఒకవేళ వీనిని జయించినవాడు ఈభాగానికి చక్రవర్తి అవుతాడు. ఆ చక్రవర్తినే వీడు సేవించాలి. అని పలికింది. దేవా, నీవు నన్ను జయిం చావు. నీవు సిద్ధరత్నుడవు. ప్రభావసంపన్నుడవు. మా ప్రభువువు. ఈత్రిశీర్షగుహ దాటిపోయి మిగిలిన శత్రువులను జయించు.

"మంచిది ఈపూట గుహాద్వారమువద్ద ఆగుదాము. ప్రాతఃకాలము అన్నియేర్పాట్లు చేసుకొని గుహాలో ప్రవేశింతాము. అని చక్రవర్తి తనరాజు లందరితోనూ బయలుదేరి త్రిశీర్ష ద్వారమువద్ద దిగినాడు. సూర్యచంద్రులకాంతి పడని ఆగుహ కాళరాత్రిలా ఉన్నది.

ఉదయము గుహాపూజచేసి విమానమెక్కి స్మరించడముచేత వచ్చిన

రత్నాలతో సహా చక్రవర్తి సపరివారముగా గుహలో ప్రవేశించినాడు. చంద్రికారత్నములచేత చీకట్లు పోయినవి. చందనరత్నముచేత పాము విషమూ, హస్తిరత్నమువల్ల దిగ్గజాలూ, ఖడ్గరత్నమువల్ల గుహ్యాకులూ ఇతర రత్నాలవల్ల తక్కిన విఘ్నాలు తొలిగిపోయినవి. చక్రవర్తి సమస్త పరివారముతోనూ గుహదాటి ఉత్తర ద్వారముచేరి కైలాసోత్తర భూములను చూచినాడు. 'బళీ బళీ! చక్రవర్తి! రత్నప్రభావమువల్ల నీవు గుహ దాటినావు.' అని ఆకాశవాణి పలికింది.

అంతట ధనవతీ దేవమాయుడూ చక్రవర్తితో ఇలాచెప్పినారు. "ఈద్వారములో కాళరాత్రి ఎప్పుడూ కాచుకొని ఉంటుంది. అమృతము హరించడానికి యత్నించిన దానవులను సంహరించడానికి విష్ణువువల్ల ఈమె ఉద్భవించింది. ఇప్పు డీమెను పూజించు. పూజిస్తే ఈమె నీకు విజయము సమకూర్చుతుంది."

సాయంకాల మయింది. పర్వతములు సంధ్యారాగరంజితా లయినవి. తర్వాత అంధకారము దిక్కులయందు వ్యాపించింది. నరవాహనుడుతప్ప తక్కినవారంతా మూర్ఛలోమునిగిపోయినారు. కాళరాత్రిపూజచెయ్యక పోవడముచేత వచ్చినఆపదఅది అనిగ్రహించి నరవాహనుడు ఆమెను స్తోత్రము చేసినాడు. స్తుతి చేసినప్పటికీ కాళరాత్రి సంప్రీత కాలే దని అతడు తనశిరస్సు ఖండించి బలిఇవ్వ దలచి కత్తి దూసేసరికి కాళరాత్రి ఆఖడ్గము చేతితో పట్టుకొని "వత్సా, ఇంతసాహసము వద్దు. ప్రసన్నురాల నయినాను. నీపరివారము యావత్తూ మోహనిద్రలోనుంచి లేస్తారు. నీకు సాయము కలుగుతుంది!" అని అనుగ్రహించింది. నిద్ర లేచినట్టు అందరూ మేలుకొని చక్రవర్తిమహాత్మ్యాన్ని ప్రశంసించారు. తర్వాత చక్రవర్తి అన్నపానాదులసంగతి చూచి అతికష్టముమీద రాత్రి గడిపినాడు; ప్రాతఃకాలము కాళరాత్రిని అర్చించి అక్కడినుంచి బయలుదేరి ముందు మార్గాన్ని అడ్డగించి ఉన్న విద్యాధర ధూమశిఖునిమీదికి

దండయాత్ర చేసినాడు. మందరదేవునికి ప్రధానుడు ధూమశిఖుడు. జరిగిన ఘోరయుద్ధములో ధూమశిఖుడు పట్టుపడినాడు. చక్రవర్తి అతని బంధనాలు విడిపించి ఆదరము చూపినాడు. ధూమశిఖుడు అతనిశాసనము శిరసావహించి తనపట్టణానికి తీసుకొని వెళ్ళినాడు.

## యుద్ధము

మందరదేవుడు యుద్ధానికి వస్తున్నాడని గూఢచారులవల్ల మర్నాడు తెలిసింది. చక్రవర్తి విద్యాధరాధిపతులతో అతనిమీదికి వెళ్ళినాడు. మందరదేవునిసేన వ్యూహము తీర్చినట్టు కనబడ్డది. తన సైన్యాన్ని వ్యూహాలుగా నిర్మించి చక్రవర్తి శత్రువులతో యుద్ధము ప్రారంభించినాడు. చండసింహాది మహారథులు చక్రవర్తిపక్షములోనూ కాంచనదంష్ట్రాదిప్రభువులు మందరదేవునిపక్షములోనూ ఉండి పోరాడినారు. ఆభీకరయుద్ధములో కాంచనదంష్ట్రుడు పెద్దగద తీసుకుని చండసింహునిశిరస్సుమీద కొట్టినాడు. దానితో అతడు కింద పడిపోయినాడు. తనకుమారునికి దెబ్బ తగిలినందుకు కోపించి ధనవతి రెండు పక్షాలసేనలనూ శపించింది. నరవాహనదత్త మందరదేవులుతప్ప తక్కిన వారంతా సమ్మోహనాస్త్రము వేసినట్టు నిశ్చేష్టు లయినారు. ఆ సమయములో ప్రధానశత్రులకు యుద్ధము జరిగింది. మందరదేవుడు ఆయుధము పట్టుకొని చక్రవర్తిమీదికి వెళ్ళినాడు. నరవాహనుడు ఖడ్గరత్నముతీసి విమానము దిగినాడు. మందరదేవుడు మాయాబలము ప్రయోగించి జయము పొందుదా మనే భావముతో తనవిద్యాప్రభావమువల్ల మదగజరూపము ధరించినాడు. నరవాహనుడు తనవిద్యామహిమవల్ల భయంకరసింహాకారము దాల్చినాడు. మందరదేవుడు హఠాత్తుగా ఏనుగురూపము వదులుకొనేసరికి నరవాహనుడు సింహాకారము విడిచిపెట్టినాడు. నిజరూపాలతోనే ఉభయులూ పోరినారు.

నానావిచిత్రకరణములు, అంగహారక్రియాయుక్తులు, మండలాగ్రఘాతములు అయి నాట్యప్రవృత్తులవలె ప్రకాశించారు. మందరదేవుని హస్తమునుంచి ఖడ్గమును నరవాహనుడు నేర్పుతో లాగివేసినాడు. అంతట వాడు తీసిన పరికి చక్రవర్తి దానిని ఉపాయముతో హరించినాడు. అంతట ఉభయులూ బాహుయుద్ధము చేశారు. అందులో చక్రవర్తి మందరదేవుని మడమలమీద తన్ని అతనిని భూమిమీద పడవేసి రొమ్ముమీద పాదముంచి, జుట్టు పట్టుకొని ఖడ్గముతో శిరస్సు ఖండించబోయినాడు. ఆక్షణములో మందరదేవుని చెల్లెలు మందరదేవి అనేకన్య చప్పునవచ్చి "రాజన్, నిన్ను తపోవనములో పూర్వము చూచి, అప్పుడే నాభర్తగా ఎంచుకొన్నాను. కాబట్టి మాఅన్నను సంహరించవద్దు" అని ప్రార్థించి నివారించింది.

చక్రవర్తి మందరదేవుని విడిచిపెట్టి "విద్యాధరేశ్వరా, నిన్ను విడిచినాను. సిగ్గుపడ వద్దు. యుద్ధములో శూరులకు జయము కాని పరాజయముకాని నిశ్చలము కాదు." అని పలికినాడు. అందుకు మందరదేవుడు "యుద్ధములో స్త్రీ రక్షించిన నాజీవితము ఏమిజీవితము. వనములో ఉన్న మానాయనగారి సన్నిధికిపోయి తపస్సు చేసుకుంటాను. నిన్ను ఉభయ వేద్యార్థచక్రవర్తిగా భగవంతుడు నిర్మించినాడు. ఈవిషయము పూర్వమే మానాయనగారు సూచించారు" అని అభిమానముతో తపోవనానికి వెళ్ళినాడు.

"చక్రవర్తీ, మేలు మేలు! శత్రువులను అందరినీ గెలిచి సామ్రాజ్యము పొందినావు" అని గగనచారులైన దేవతలు ఆ సమయాన అన్నారు.

మందరదేవుడు వెళ్ళగానే ధనవతి తన సమ్మోహనాస్త్రము ఉపసంహరించింది. అందరూ నిద్ర లేచినట్టు లేచినారు. శత్రువు ఓడిపోయినాడని గ్రహించి సచివాదులు చక్రవర్తిని అభినందించారు. కాంచన

దంష్ట్రుడు, అశోకుడు, రక్తాక్షుడు, కాలజిహ్వుడు మొదలయిన రాజులు మందరదేవుని పక్షమునా గంతా నరవాహనదత్తుని శాసనము శిరసా వహించినారు.

చండసింహుడు కాంచనదంష్ట్రుని చూడగానే దెబ్బ తిన్నవాడు కావడముచేత జ్ఞాపకము వచ్చి కత్తి పిడికిడిలో పట్టుకొని అతనిని బెదరించడము ప్రారంభించినాడు. అతని తల్లి ధనవతి "వత్సా, యుద్ధము అయిపోయింది. నిన్ను జయించగలిగినవాడెవడు! ఉభయపక్షాలలో జననాశము కాకుండా ఉండడానికి సమ్మోహనాస్త్రము ప్రయోగించాను" అని చెప్పి అందరినీ శాంతపరిచింది.

నరవాహనదత్తుడు ఆనందభరితుడయినాడు. విజయ దుందుభులు మోగినవి. విద్యాధరాంగనలు నాట్యము చేసినారు. తన ప్రియురాండ్రతోనూ, మంత్రులతోనూ, సామంత ప్రభువులతోనూ కలిసి నరవాహనుడు మధుపానకేళిలో ఆరోజు గడిపినాడు.

## తరంగము : ౧౧౦

## పంచకన్యలు

నరవాహనదత్తుడు కైలాససానువునుంచి మర్నాడు పరివారముతో బయలుదేరి కాంచనదంష్ట్రుడు ముందుదారి చూపుతూ ఉండగా మందరదేవుని రాజధాని అయిన విమలపురము చేరినాడు. అనంతరము విద్యాధర రాజులు పార్శ్వములో నిలిచి ఉండగా కొలువుకూటములో ఆసీనుడయిన నరవాహన చక్రవర్తి సన్నిధికి అంతఃపుర వృద్ధస్త్రీలు వచ్చి "దేవా, మందరదేవుడు నీచేతిలో ఓడిపోయి తపోవనానికి పోవడముచేత అతనిరాణులు అగ్నిప్రవేశము చేతా మనుకొంటున్నారు. తర్వాత దేవరవారిచిత్తము" అని విన్నపము చేశారు. చక్రవర్తి వారి మరణము మాన్పించి వారికి గృహాదులిచ్చి తనచెల్లెళ్ళవలె ఆదరించినాడు.

ఈవనినల్ల అతడు విద్యాధరాధీశ్వరుల హృదయాలు చూరగొన్నాడు. అదివరలోనే అనుకొన్నప్రకారము మందరదేవుని రాజ్యానికి అమిత గతిని కృతజ్ఞతతో ప్రభువును చేసినాడు. మందరదేవుని సామంతుల నందరినీ అమితగతిపక్షాన వెళ్ళమన్నాడు. ఏడురోజులు అక్కడ మహా వైభవముతో గడిపినాడు.

నరవాహనుడు ఉభయవేద్యార్థచక్రవర్తి అయినప్పటికీ తృప్తిపడక మేరుభూములనూ దేవతాశ్రయాలనూ జయించవలె ననేకోరికతో బయలుదేరడానికి సంసిద్ధుడయినాడు. వద్దని మంత్రులు వారించినా విన లేదు. అప్పుడు నారదుడు వచ్చి ఈప్రకారముగా బోధించినాడు. "రాజన్, నీతివేత్తవు. ఇటువంటి తగని ఉద్యమానికి తలపడినావేమి? గర్వోద్రేకమువల్ల రావణాసురుడు కైలాసపర్వతము పెకలించబోయి పరాభవము పొందినాడు. అసాధ్యకార్యము తలపెట్టితే అతనిలాగే అవుతుంది. సూర్యచంద్రులు మాత్రము మేరువును దాటగలరా? నీకు మహేశ్వరుడు విద్యాధరాధిపత్యము అనుగ్రహించాడు, కాని సురేంద్ర త్వము ఇవ్వలేదే! హిమవంతము విద్యాధరుల ప్రదేశము. నీవు గెలవనే గెలిచావు. మేరువు దేవభూమి. అక్కడ నీకేమి పని? ఈప్రయత్నము విడిచిపెట్టు. మందరదేవునితండ్రి అకంపనుడు అరణ్యములో తపస్సు చేస్తున్నాడు. వెళ్లి ఆయనదర్శనము చేస్తే మేలు"

నారదమహర్షి వెళ్లినతర్వాత ఋషభుని నాశనము జ్ఞప్తికి తెచ్చు కొని తనప్రయత్నము విడిచిపెట్టి అకంపనరాజర్షిని దర్శించడానికి నర వాహనుడు బయలుదేరినాడు. తపోవనములో జటావల్కలములు ధరించిన అకంపనునిచుట్టూ బ్రహ్మర్షులు మునిజనులూ పద్మాసనములు వేసి కూర్చున్నారు. నరవాహనుడు ఆయన సన్నిధికి వెళ్లి ప్రణామము చేసినాడు. ఆరాజర్షి ఇతనికి అతిథి సత్కారాలు చేసి "రాజన్, నీ వీ ఆశ్రమానికి రావడము చాలా మంచిది. రాకుండా వెళ్ళిపోయినట్లయితే

మహర్షుల శాపము నీకు తగిలేదే" అన్నాడు. మునివ్రతము అవలం బించిన మందరదేవుడు తన చెల్లెలు మందారవతితో కూడా అక్కడికి వచ్చినాడు. నరవాహనుడు అతనికి కంఠాలింగనము చేసుకొని ఆదరించి నాడు. పూర్వము శత్రువులుగా ఉండి తర్వాత శాంతించినవారి విషయ ములో ధీరులు ప్రీతివహిస్తారు. తన సంతానమును చూపి, అకంపనుడు చక్రవర్తితో "రాజన్, ఈకన్య నాపుత్రిక, మందరదేవి. చక్రవర్తికి రాణి అవుతుందని దివ్యవాణి పూర్వమే పలికింది. ఇప్పుడు ఈకన్యను నీకిస్తు న్నాను. వివాహము చేసుకో" అన్నాడు. ఆ సమయాన మందరదేవి ఇలా విన్నవించింది. నా చెలికత్తెలు విద్యాధరేంద్రకన్యలు నలుగు రున్నారు. కాంచనదంష్ట్రుని కూతురు కనకవతి; కాలజహ్వుని పుత్రిక కలావతి; దీర్ఘదంష్ట్రునికుమార్తె శ్రుత; పోత్రరాజుకూతురు అంబరప్రభ- మేము అయిదుగురము తపోవనములో సంచరిస్తూ ఆర్యపుత్రుని చక్ర వర్తిని చూచి ఈయనగారిని మన కందరికీ భర్తను చేసుకొందాము. మనలో ఎవరయినా ఈయనను విడిగా వివాహమాడితే తక్కిన నలుగు రము ఆక్షణమే ప్రాణాలు విడిచిపెట్టుదామని ప్రతిజ్ఞ చేసుకొన్నాము; కాబట్టి ఆ చెలికత్తెలతో పాటు వివాహము జరగాలి; నాకు ప్రత్యేక ముగా వనికిరాదు. మావంటివాళ్ళము సత్యవాక్కులను అతిక్రమించ డానికి వీలులేదు.

అకంపనుడు ఆ నలుగురు వరకన్యల తండ్రులను పిలిపించి జరిగిన సంగతి చెపితే వారు సంతోషించి ధన్యులమయినాము అని తమపుత్రిక లను అక్కడికి రప్పించినారు. నరవాహనుడు ఆ అయిదుగురు కన్య లనూ పెళ్ళాడి చాలా రోజులు అక్కడే మహోత్సవసౌఖ్యాలు అనుభ విస్తూ, త్రిసంధ్యలలో మాత్రము ఋషులను సందర్శించి ప్రణామములు చేస్తూ ఉన్నాడు.

ఒకనాడు అకంపనుడు "వత్సా, మహాభిషేకము కోసము నీవు

ఋషభాద్రికి వెళ్ళు" అని చెప్పినాడు. దేవమాయుడు కూడా "దేవా, పూర్వచక్రవర్తు లందరికీ ఋషభాద్రిమీదనే మహాభిషేకము జరిగింది. నీవుకూడా అలాగే వెళ్ళడము యుక్తము" అని విన్నవించినాడు. "దగ్గరలో ఉన్న మందరాద్రిమీద అభిషేకమహోత్సవము చేయడము ఉత్తమము" అని హరిశిఖుడు చెప్పేసరికి ఆకాశవాణి "వెనకటి చక్రవర్తుల వలెనే నీవుకూడా ఋషభాద్రిమీదికి వెళ్ళు. అది సిద్ధుల స్థానము" అని పలికింది.

నరవాహనుడు అకంపనాదులకు నమస్కారము చేసి శుభముహూర్తములో అక్కడనుంచి బయలుదేరి, అమితగతి ప్రభృతు లైన విద్యాధరాధిపతులతో త్రిశీర్ష గుహకు ఉత్తరద్వారము వద్దకు చేరుకొని కాళరాత్రిని పూజించి గుహలో ప్రవేశించి దక్షిణద్వారము వెంట ఇవతలకు వచ్చినారు. అనంతరము దేవమాయుని ప్రార్థనమీద అతని యింట్లో సపరివారముగా ఆదినము విశ్రమించినాడు.

## భ గ వ ద్ద ర్శ న ము

నరవాహనుడు కైలాసమున సమీపములో ఉన్న శివుని సందర్శించా లని గోముఖుని వెంటబెట్టుకొని వెళ్ళి శంకరాశ్రమము చేరినాడు. కామధేనువునూ వృషభమునూ చూచి నమస్కారము చేసి, ద్వారములో ఉన్న నందికి ప్రదక్షిణముచేశాడు. నందీశ్వరుడు సంతోషించి దారి ఇచ్చినాడు. వెంటనే గౌరీ సహితు డయిన శంకరుని దర్శన మయినది. ఆ సమయాన గౌరీశంకరులు పాచికలతో ఆడుతున్నారు. నరవాహనుడు పార్వతీ పరమేశ్వరులకు మూడుసార్లు ప్రదక్షిణమూ పాదప్రణామమూ చేసినాడు.

శంకరుడు ప్రసన్నుడై "వత్సా, నీవు ఇక్కడికి రావడము యుక్తము. రాకపోతే అపరాధివి అయ్యేవాడవు. ఇకముందు నీవిద్యలకు భంగ

పాటు ఉండదు. సిద్ధక్షేత్రమైన ఋషభాచలానికి వెళ్ళు. అక్కడ సన్ముహూర్తములో మహాభిషేకము జరిపించుకో'' అని ఆనతిచ్చినాడు.

మహాప్రసాదము అని నరవాహనుడు గౌరీశంకరులకు ప్రణామము చేసి, తిరిగి దేవమాయుని భవనానికి వచ్చినాడు.

"ఆర్యపుత్రా, ఎక్కడికి వెళ్ళినారు? ముఖాన ఆనందము తాండవిస్తున్నది. ఈప్రాంతాలలో అయిదుగురు నూతన కన్యలు లభించారాయేమి!'' అని మదనమంచుకాదేవి చమత్కారముగా అన్నది. నరవాహనుడు గౌరీశంకర దర్శనవృత్తాంతము చెప్పి ఆమెను హర్షపరవశురాలిని చేసినాడు.

మరునాడు నరవాహన చక్రవర్తి సమస్తపరివారముతో బయలుదేరి ఋషభాచలము చేరినాడు. అన్నిదిక్కులనుంచీ విద్యాధరులు అభిషేకానికి సంభారాలూ, కానుకలూ తెచ్చినారు. "నీతో ఏదేవిని కూర్చోబెట్టి మహాభిషేకము చెయ్యవలెనో సెల వియ్యాలి'' అని విద్యాధరాధిపతులు అడిగితే నరవాహనుడు "మదనమంచుకా దేవిని'' అని సమాధానము చెప్పినాడు. విద్యాధరాధీశులు ఆలోచనాపరులై ముఖముఖాలు చూడడము ప్రారంభించారు. అప్పుడు దివ్యవాణి ఇలా వినబడ్డది: "విద్యాధరులారా, మదనమంచుకాదేవి మానవాంగన కాదు. నరవాహనదత్తుడు కాముడు, ఈమె రతీదేవి. మదనమంచుకాదేవి కళింగసేనా మదనవేగుల పుత్రిక కాదు. ఈమె అయోనిసంభూత. కళింగసేన ప్రసవించిన క్షణములోనే దేవతలు మాయాబలముచేత ఆ శిశువును తీసుకుపోయి ఈమెను అక్కడ ఉంచారు. కళింగసేన కన్నకొడుకు ఇత్యకుడు; మదనవేగునివద్ద ఉంటున్నాడు. కాబట్టి ఈ మదనమంచుకాదేవి అర్ధాసనమునకు యోగ్యురాలు. పూర్వము మహేశ్వరుడు సంప్రీతుడై ఈమెకు అటువంటి వరము అనుగ్రహించినాడు.

ఇలాపలికి దివ్యవాణి విరమించగానే విద్యాధరాధీశ్వరులు సంతో షించి మదనమంచుకా దేవిని ప్రశంసించారు.

## పట్టాభిషేకము

తర్వాత శుభవాసరమున పురోహితుడు శాంతిసోముడు వ్యగ్రుడయి ఉన్నాడు. మంగళవాద్యఘోషలు, విద్యాధరాంగనాగీతములు, బ్రాహ్మణవేదఘోషలు, దశదిశల వ్యాపించినవి. మహర్షులు నరవాహనదత్తుని సింహాసనముమీద కూర్చోబెట్టి అతని వామపార్శ్వాన మదనమంచుకా దేవిని ఉపవిష్టురాలినిచేసి నానాపుణ్యతీర్థాలనుంచి హేమకుంభాలతో తెచ్చిన జలములతో ఉభయులనూ అభిషేకించారు. దేవాంగనలు అతనిమీద పుష్పదామములు వేసినారు. మందార మాలికలు చుట్టి, దుకూలములు కట్టుకొని, దివ్యకిరీటము ధరించిన చక్రవర్తిశోభ ఇంద్రవైభవాన్ని అనుకరించింది. అభిషేకము పొంది, దివ్యాలంకారాలు ధరించి చక్రవర్తిపార్శ్వమున ఉన్న మదనమంచుకా దేవి ఇంద్రునిపక్కన శచీదేవివలె ప్రకాశించింది. తర్వాత దుందుభులు మోగినవి, పైనుంచి పుష్పవర్షము కురిసింది. ఆ పర్వతముమీద విద్యాధరస్త్రీలే కాక వాయుకంపితలతలుకూడా నృత్యము చేసినవి. విద్యాధరులు దివ్యాసవములు తాగి మత్తెక్కి మహానందముతో కాలక్షేపము చేసినారు.

అభిషేకమహోత్సవానంతరము నరవాహనుడు తండ్రిని స్మరించి గోముఖాదిమంత్రులతో ఆలోచించి వాయుపథుని పిలిపించి "మా నాయనగారి సన్నిధికి వెళ్ళి మీ కుమారుడు మిమ్మల్ని తలుచుకొంటున్నాడు, అని విన్నవించి ఆయననూ, దేవేరులనూ, మంత్రులనూ తీసుకొని రా" అని చెప్పినాడు. ఆ ఆనతిప్రకారము వాయుపథుడు ఏడుకోట్లమంది విద్యాధరులతోసహా ఆకాశమార్గాన బయలుదేరి క్షణములో కౌశాంబీనగరము చేరాడు. పౌరులు భయాశ్చర్యాలతో వీరిని

చూచినారు. దేవీసహితుడై మంత్రిసమేతముగా ఉన్న ఉదయనుని వాయుపథుడు సాదరముగా సందర్శించినాడు. కూర్చున్న తర్వాత కుశల ప్రశ్నలు వేసి అందరూ తనకేసి ఆశ్చర్యముతో చూస్తూ ఉండగా వాయుపథుడు ఇలా పలికినాడు : "రాజేంద్రా, నీపుత్రుడు నరవాహన దత్తుడు శంకరుని ఉపాసించి వరము పొంది, నరులకు లభ్యము కాని అనేక విద్యలు సాధించి, దక్షిణాన మానసవేగ గౌరీముండులను సంహ రించి, ఉత్తరాన వేద్యర్థపతి మందరదేవుని ఓడించి, ఉభయవేద్యర్థముల విద్యాధరరాజులు తన శాసనము శిరసావహించేలాగున చేసి ఉత్తరదక్షి ణాలకు చక్రవర్తి అయినాడు. ఋషభపర్వతము మీద మహాభిషేకము జరిగింది. దేవీమంత్రి సమేతముగా నిన్ను తీసుకొని రావలసినదని నన్ను పంపినాడు. మీరు త్వరలో బయలుదేరాలి.

## ఉ ద య ను ని రా క

వాయుపథవిద్యాధరపతి తన విద్యాప్రభావముచేత కల్పించినదివ్య యానములో వత్సరాజు (ఉదయనుడు) కళింగసేననూ, తదితరులనూ కూర్చోబెట్టి తానూ కూర్చుని ఆకాశమార్గాన ఋషభ పర్వతము చేరినాడు? విద్యాధరేంద్రుల మధ్య భార్యలతో సింహాసనస్థుడైన తన కుమారుని చూచి హర్షపరవశు డయినాడు. బహుకాలానికి కనబడిన తండ్రిని చూచి నరవాహనుడు లేచి సపరివారముగా ఎదురు వెళ్ళినాడు. తండ్రి కుమారుని కౌగలించుకొని ఆనందబాష్పాలు విడిచినాడు. వాసవ దత్తాదేవి పుత్రుని ఆలింగనము చేసుకొన్నది. పద్మావతీదేవి, యౌగంధ రాయణాది మంత్రులు, మేనమామ గోపాలకుడూ, అతనిని హర్షవివ శులై చూచారు. ఆసమయములో కళింగసేన తన కూతురు మదనమంచు కనూ అల్లుడు నరవాహనదత్తునీ చూచి పొంగిపోయింది. ప్రభు ప్రసాదమువల్ల దివ్యత్వము పొందిన తమ పుత్రులు మరుభూతిప్రభృతు లను చూచి, యౌగంధరాయణాదులుచాలా సంతోషించారు. మదన

మంచుక, రత్నప్రభ, అలంకారవతి, లలితలోచన, కర్పూరిక, శక్తియశ, భగీరథయశ, రుచిరదేవునిసోదరి దివ్యరూప, వేగవతి, అజినావతి, గంధర్వదత్త, ప్రభావతి, ఆత్మనిక, వాయువేగయశ, ఆమెచెలికత్తెలు కాళికాదులు, సులోచన, మందరదేవి, ఆమెసఖులు నలుగురు ఉదయనునికి, వాసవదత్తకు, పద్మావతికి ప్రణామములు చేశారు. వారందరూ కోడళ్ళను ఆశీర్వదించారు. తండ్రిని తనతల్లులను ఉచితాసనములమీద కూర్చోబెట్టి నరవాహనుడు సింహాసన మెక్కినాడు. వాసవదత్తాదేవి తనకొత్తకోడళ్ళను పలకరిస్తూ వారివారికులగోత్రనామాదులు తెలుసుకొంటున్నది.

అంతలో ప్రతీహారుడు రుచిరదేవుడు వచ్చి "పానశాల సిద్ధముగా ఉన్నది. అందరూ దయచెయ్యాలి" అని విన్నవించినాడు. అందరూ లేచి ఆ పానభూమికి వెళ్ళినారు. అక్కడ రకరకాలరత్నాలగిన్నెల నిండా మద్యము నింపి ఉన్నది. వారు హాయిగా ఆసవములు సేవించి కొంత సేపటికి భోజనశాలకు వెళ్ళినారు. రకరకాలవంటకములు భక్ష్యభోజ్యాదులు ఆరగించి రాత్రి శయనగృహాలకు వెళ్ళి పడుకొన్నారు.

నరవాహనుడు తనవిద్యాప్రభావముచేత ఎందరుభార్య లున్నారో అన్ని శరీరాలు ధరించి వారితో క్రీడించినాడు. మదనమంచుకాదేవి శయ్యమీదమాత్రము నిజదేహముతో పడుకొన్నాడు.

కొన్నిరోజులు ఉదయనుడు అక్కడ వివిధభోగాలు అనుభవించి ఒకనాడు కౌశాంబికి వెళ్ల దలచి కుమారునితో ఇలా అన్నాడు: "నాయనా, ఈదివ్యభోగాలు అందరూ అభిలషించేవే కాని జన్మభూమికి వెళ్ళవలె. నీవు దివ్యమానుషుడవు, కాబట్టి ఈప్రదేశాలు నీకు వాసయోగ్యములు. విద్యాధర వైభవము అనుభవిస్తూఉండు. ఏదయినా సందర్భము వచ్చినప్పుడు మాకు వర్తమానము పంపించు. మేము వస్తాము. నీసంపదలు చూచి ఆనందించడము మాజన్మఫలము."

తండ్రి నిండుహృదయముతో పలికిన వాక్కులు విని నరవాహనుడు వెంటనే దేవమాయుని పిలిపించి "నాయనగారు అమ్మగార్లు, మంత్రులూ కౌశాంబికి బయలుదేరుతున్నారు. నీవు వెయ్యిబారువుల సువర్ణము రత్నాలు విద్యాధరులచేత ముందుగా పంపించు" అని గద్గదకంఠముతో ఆనతిచ్చినాడు. దేవమాయుడు శిరస్సువంచి "మహాప్రభూ, అనుచరులతో కౌశాంబిదాకా నేను వెళుతాను. అనుగ్రహించవలి" అని పలికినాడు.

నరవాహనుడు సంతోషించి తండ్రికి వస్త్రాలంకారాదులు సమర్పించి వాయుపథుని దేవమాయుని పరివారసమేతముగా తండ్రికి తోడు పంపినాడు. ఉదయనుడు తనవా రందరితో విమాన మెక్కి చాలాదూరము వెంట వచ్చిన కుమారుని వెనకకు పంపినాడు. గమనసమయములో వాసవదత్త మాటిమాటికి వెనకకు తిరిగి కుమారుని చూస్తూ వెళ్ళింది.

నరవాహనుడు మంత్రులతో ఋషభపర్వతానికి మరలి వచ్చినాడు. అక్కడ విద్యాధరప్రభువులతోను, గోముఖాది బాల మంత్రులతోను, మదనమంచుకాదేవితోను కాలము గడిపినాడు.

## సు ర త మం జ రీ లం బ క ము

### త రం గ ము : ౧౧

పాతు వ స్తాణ్డవోడ్డీన
గణ్డ సిన్దూర మణ్డనః
వాన్తాభిపీత ప్రత్యూహ
ప్రతాప ఇవ విఘ్నజిత్ !

తాండవోడ్డీన సిందూర మండిత మగు
గండమున నంతరాయ విక్రాంతి ద్రావి
ఉమియుచున్న విధంబున నొప్పు విఘ్న
నాయకుడు మీకు రక్షణ చేయు గాక !

# సుషేణ విరహము

వసంతఋతువు వచ్చింది. గోముఖాదిమంత్రులు నరవాహనునితో "దేవా! ఋష్యభాద్రిమీదివనము లన్నీ వసంతశోభతో మనోహరముగా ఉన్నవి. మందాకినీ నదీతీరాన ఉద్యానములో వసంతోత్సవము చేశాము" అని హెచ్చరించినారు.

నరవాహనుడు అంతఃపురజనముతో మందాకినీ తీరానికి వచ్చి విహారము చేసి చంద్రశిలాతలమున కూర్చున్నాడు. మదనమంచుక అతనియెడమపక్కన కూర్చున్నది. మిగిలిన అంతఃపురవనితలను దగ్గరగా కూచోబెట్టుకొని నరవాహనుడు చండసింహాదివిద్యాధర ప్రభువులతో పానగోష్ఠిలో వివిధసరసప్రస్తావనలు చేసి ఇలా అన్నాడు: "దక్షిణవాయువు చల్లగా తాకుతున్నది. దిక్కులు తేటగా ఉన్నవి. అన్నివైపులా వనములు పుష్పించి పరిమళిస్తున్నవి. కోకిలలు మధుర కూజితములు చేస్తున్నవి. పానగోష్ఠిలో ప్రమోదము కలిగింది. వసంత ఋతువులో సమస్తమూ సంతోషదాయకమే. ప్రియజనవియోగము మాత్రము దుస్సహము. తిర్యగ్జంతువులకుకూడా విరహము దుర్భరము. ప్రియుని ఎడబాసి ఈకోకిల చాలాసేపు కూజితము చేసిచేసి చివరకు మామిడిగుబురులో నిర్జీవమయిపోయినట్టు అణగి పోయింది చూడండి."

చక్రవర్తిమాటలు ఆకర్ణించి గోముఖమంత్రి ఇలా పలికినాడు: "నిజము దేవా! వసంతఋతువులో విరహము ఎవరికైనా బాధాకరమే. శ్రావస్తిలో సంఘటన ఇందుకు నిదర్శనము. శ్రావస్తిలో శూరసేనుడనేరాజపుత్రుడు రాజసేవ చేస్తూ ఒకగ్రామాధికారము పొందినాడు. మాళవదేవకన్య సుషేణ చాలా యోగ్యురాలు. ఆమెను పెళ్ళిచేసుకొని శూరసేనుడు ప్రాణముకంటె ఎక్కువగా చూచుకొంటున్నాడు. ఒకరోజున అతడు రాజాజ్ఞచొప్పున తనగ్రామమునుంచి రాజధానికి

వెళ్ళబోతుంటే సుషేణ భర్తను వెళ్ళవద్దు అని వేడుకొన్నది. 'రాజ సేవలో ఉన్న నేను రాజాజ్ఞ అయినప్పుడు ఎలా వెళ్ళకుండా ఉండను; నీకు సమస్తమూ తెలుసు గదా' అన్నాడు భర్త. భార్య కళ్ళనీళ్ళతో 'మీరు వెళ్ళక తప్పనిసరి అయితే వసంతఋతువు మొదటిరోజుకు విధిగా వచ్చితీరాలి. ఎలాగో అంతవరకూ ఓర్చుకొని ఉంటాను' అన్నది. సుషేణ "ప్రియా, వెళ్ళినపని మానుకొని అయినా చైత్రపాడ్యమినాటికి వచ్చితీరుతాను నిశ్చయము" అని, కష్టముమీద భార్యను ఒప్పించి, శూర సేనుడు రాజుసన్నిధికి వెళ్ళినాడు. ఆమె రోజులు లెక్కపెట్టుకొంటూ చైత్రశుద్ధ పాడ్యమికోసము ఎదురుచూస్తున్నది. కొన్నాళ్ళకు వసం తోత్సవదినము వచ్చింది. కోకిలలు కూసినవి. తుమ్మెదలు ఝుం కారముచేసినవి. "వసంతోత్సవము వచ్చింది. ప్రాణేశ్వరుడు తప్ప కుండా వచ్చేస్తాడు" అని సుషేణ స్నానముచేసి, మన్మథపూజ చేసి, అలంకారము చేసుకొని భర్తకోసము ఎదురు చూస్తున్నది. పగలు గడిచిపోయింది; శూరసేనుడు రాలేదు. అర్ధరాత్రివేళ ఆమె ఆశవిడిచి పెట్టి "నాకు మరణము సమీపించింది. ప్రాణేశ్వరుడు రాలేదు. పర సేవాసక్తులైనవారికి తమవారిమీద ప్రీతి ఉంటుందా! అనుకొంటూ భర్తనుగురించి వివిధవిధాల భావిస్తూ ఉండగా, ప్రాణాలు పోయినవి.

అక్కడశూరసేనుడు రాజువద్ద ఎలాగో సెలవుపుచ్చుకొని సకాలా నికి రావడానికి ఒంటె ఎక్కి త్వరితప్రయాణము చేసి తెల్లవారు జామునకు ఇంటికివచ్చినాడు. అలంకారాలు ఏమీ చెదరకుండా పెల్ల గిలి కింద వాలిన పుష్పలతవలె ఉన్న భార్యను చూచి దుఃఖముతో ఆమెశిరస్సు తనతొడమీద పెట్టుకొని విచారిస్తూ ఉండగా అతని ప్రాణాలుకూడా ఎగిరిపోయినవి. అప్పుడు వారికులదేవత చండికాదేవి ఆ మృతదంపతులను కనికరించి బతికించింది. నాటినుంచీ ఎన్నడూ విడి పోక వారు సుఖముగా ఉన్నారు.

కాబట్టి వసంతము విరహులకు చాలా దుస్సహము అని గోముఖుడు కథ ముగించినాడు.

## మ హా సే న ని ని ర్యా ణ ము

నరవాహనదత్తుడు ఏమో ఆలోచనలో పడ్డాడు. అతని మనస్సు స్వాధీనము తప్పిపోతున్నది. ఉదారహృదయుల అంతరంగము వల్లనే శుభాశుభములు సూచనగా తెలుస్తవి. ఆపగలు గడిచింది రాత్రి నరవాహనుడు శయ్యాగృహములో పడుకొన్నాడు. తన జనకుని నల్లనిస్త్రీ దక్షిణ దిక్కుకు తీసుకొని పోతున్నట్టు తెల్లవారుజామున కల కన్నాడు. మెళుకువ వచ్చినతర్వాత తన తండ్రికి ఏదో కీడు మూడిందని భయపడి ప్రజ్ఞప్తి విద్యను తలుచుకొన్నాడు. ఆవిద్య ఆకారము ధరించి దర్శనమిచ్చింది. 'మానాయనగారి సంగతి యేమిటి? దుస్స్వప్నమువల్ల మనస్సు కలకబారింది' అన్నాడు నరవాహనుడు.

ప్రజ్ఞప్తివిద్య ఈప్రకారముగా చెప్పింది. "ఒక రోజు ఉజ్జయినీ నగరమునుంచి కౌశాంబికి మీానాయనగారి సన్నిధికి దూతవచ్చి చండమహాసేనప్రభువు దివంగతు డయినాడనీ ఆయన పట్టమహిషి అంగారవతీదేవి సహగమనము చేసిందనీ విన్నవించినాడు. ఆవార్తకు మీానాయన మూర్ఛపోయి కొంతసేపటికి తెప్పిరిల్లినాడు. మీాఅమ్మ, నాయన, పరివారజనులూ చాలా దుఃఖించారు. తర్వాత మంత్రులు "దేవా, క్షణభంగురమైన ఈసంసారములో ఏది శాశ్వతము? మీావంటి అల్లుడు గోపాలునివంటి కుమారుడు నరవాహనదత్తుని వంటి మనుమడూ ఉన్న ఆప్రభువు కోసము దుఃఖించడ మెందుకు?" అని బోధ చేశారు. మీా నాయనలేచి అత్తమామలకు జలాంజలి యిచ్చినాడు. తర్వాత తన పార్శ్వాన ఉన్న బావమరిది గోపాలుని చూచి గద్గద కంఠముతో "లే, ఉజ్జయినికి వెళ్ళు; రాజ్యము పాలించు; ప్రజలు

నీకోసము ఎదురు చూస్తున్నారని దూత తెలిపినాడు.” అని ప్రబోధించినాడు. గోపాలుడు దుఃఖముతో “నిన్నూ వాసవదత్తనూ విడిచి వెళ్ళలేను. నాయనగారు లేని ఉజ్జయినిని చూడలేను, కాబట్టి నాతమ్ముడు పాలకుడు ప్రభువు. నేను అనుజ్ఞ యిస్తున్నాను.” అని వత్సరాజు ఎంత చెప్పినా వినలేదు. అప్పుడు మీనాయన సేనానాయకుడు రుమణ్వంతుని ఉజ్జయినికి పంపించి అన్నగారి ఆనతిప్రకారము పాలకునికి పట్టము కట్టించి ప్రభువును చేసినాడు.

తరువాత మీనాయన యౌగంధరాయణాది మంత్రులను పిలిచి “ఈ సంసారము నిస్సారము, ఏసుఖము చూచినా చివరకు విరసము. నేను అన్నిభోగములూ అనుభవించాను. బహుకాలము రాజ్యము చేశాను. శత్రువులను జయించాను. విద్యాధరాధిపతి అయిన కుమారుడు కలిగినాడు. ఇప్పుడు బంధువులతోపాటు వయస్సు దాటిపోతున్నది. దేహము జరాక్రాంత మవుతున్నది. ఇక కాలంజరగిరికి వెళ్ళి ఈ అస్థిర శరీరాన్ని విడిచి శాశ్వతపదవి పొందవలె” అన్నాడు.

వాసవదత్తాదేవీ, మంత్రులూ బాగా యోచించి ప్రభువాక్యములకు ఏకగ్రీవముగా సమ్మతించి “దేవా, మీరు సెలవిచ్చినది సమంజసము. మీ అనుగ్రహమువల్ల మేముకూడా మీవెంట వచ్చి ఉత్తమగతి పొందుతాము” అని విన్నవించారు. రాజు సంతోషించి గోపాలకుని చూచి “నీవూ నరవాహనదత్తుడూ నాకు సమానులు కాబట్టి ఈ కౌశాంబీ రాజ్యము నీకు ఇస్తున్నాను. నీవే పరిపాలించుకో” అన్నాడు. గోపాలకుడు “మీమార్గ మేదో నామార్గమూ అంతే; మిమ్మల్ని విడిచి ఉండలేను” అనేసరికి మీనాయన కోపము నటించి “నీవు మా వెంట రావడము వట్టిది! చెప్పినమాట ఇప్పుడే వినడము లేదు నీవు పదవి విడిచిన వాని ఆనతిని ఎవడు నెరవేరుస్తాడు!” అని కఠినముగా పలికినాడు. గోపాలుడు తల వంచుకొని దుఃఖిస్తూ, అరణ్యానికి వెళ్ళి

పోవలెనని మనస్సులో నిశ్చయించుకొని వెంటనే వారిని అనుసరించక అక్కడనే ఆగినాడు.

## వత్సరాజాదుల మహాప్రస్థానము

మీనాయన వాసవదత్తతో పద్మావతితో ఏనుగ ఎక్కి ప్రయాణ మయినాడు. మంత్రులు కూడా ఆయనను అనుసరించారు. పౌరులు బంధుమిత్ర సహితముగా ప్రభువు వెంట నడిచారు. 'గోపాలుడు మీకు ప్రభువు, సంరక్షకుడు' అని చెప్పి వారిని వెనుకకు మరలించి మీ నాయన క్రమేణా కాలంజరగిరి చేరినాడు. అనంతరము పర్వతము మీది కెక్కి మహేశ్వరునికి మొక్కి ఘోషవతీ వీణను తీసుకొని వాసవదత్త, పద్మావతి రెండు పక్కలా నిలువగా యౌగంధరాయణాది మంత్రులతో సహా కొండకొమ్మమీది నుంచి దుమికినాడు. పడీపడడంలోనే దివ్య విమానము వచ్చింది. అందరూ అందులో ఎక్కి దివ్యకాంతులతో స్వర్గానికి వెళ్ళినారు.

ప్రజ్ఞప్తి విద్య ఇలా చెప్పేసరికి నరవాహనుడు 'అయ్యో, నాయనా!' అని మూర్ఛపోయినాడు. తెలివి వచ్చినతర్వాత అందరూ కలిసి దుఃఖించారు. విద్యాధరాధీశ్వరులు ధనవతి అతనితో "మహా రాజా, సంసారము ఇంద్రజాలమువంటి దనీ, అశాశ్వతమనీ తెలిసి కూడా ఎందుకు మోహములో పడిపోతావు. నీతల్లిదండ్రులు ధన్యులు. వారి కోసము దుఃఖించడ మెందుకు" అని ఓదార్చినారు. నరవాహ నుడు తల్లిదండ్రులకు తిలోదకాలు విడిచి ప్రజ్ఞప్తి విద్యతో "మా మామ గోపాలుడు ఎక్కడ ఉన్నాడు? ఏమి చేస్తున్నాడు?" అన్నాడు.

"మీనాయన మహాప్రస్థానము చేసినతర్వాత గోపాలకుడు చాలా దుఃఖించి, పురము వెలపలనే ఉండి, ఉజ్జయినినుంచి తనతమ్ముడు పాల కుని రప్పించి ఉజ్జయినీ కౌశాంబీరాజ్యాలు రెండూ అతనికే ఇచ్చి తాను

విరక్తుడై తపస్సు చేయడానికి అసితగిరిమీది కశ్యపాశ్రమానికివెళ్ళి వల్కలాలు ధరించి నీమామ మునులమధ్య తపస్సు చేస్తున్నాడు" అన్నది విద్య.

నరవాహనుడు మేనమామను చూడడానికి వెంటనే పరివార సమేతముగా విమానములో అసితగిరికి వెళ్ళినాడు. అనంతరము విద్యాధరులతో సహా కశ్యపముని ఆశ్రమము చూచినాడు. గోపాలుడు జటావల్కలములతో మునులనడుమ మూర్తీభవించిన శాంతరసమువలె కనబడినాడు. గోపాలుడు లేచి మేనల్లుని కౌగలించుకొని ఒళ్ళో కూర్చోబెట్టుకొన్నాడు. ఉభయులూ బంధువులకోసము దుఃఖించారు.

ఆరోజు గడిచింది. మర్నాడు నరవాహనుడు మామను తనతో రమ్మనీ, సమస్త వైభవములూ అనుభవించమనీ కోరినాడు "నిన్ను చూచాను చాలదా, నీకు నామీద ప్రీతి ఉన్నది కాబట్టి ఈ వర్షాకాలము వెళ్ళేదాకా ఇక్కడేఉండు" అని వేడినాడు గోపాలకుడు. సరే అని నరవాహనుడు కశ్యపాశ్రమములోనే సపరివారముగా ఉన్నారు.

## తరంగము : ౧౧౨

## ఇత్యకుని చర్య

అసితగిరిమీద నరవాహనదత్తుడు ఒకనాడు కొలువుదీర్చి కూర్చున్నాడు. ఇంతలో అతనిసేనాపతి వచ్చి "దేవా, రాత్రి సైన్యమును పరీక్షిస్తూ సౌధములో ఉన్నాను. ఇంతలో ఎవరో దివ్యపురుషుడు స్త్రీని అపహరించి ఆకాశాన వెళ్లుతున్నాడు. ఆవిడ ఆర్యపుత్రా అని రోదనము చేస్తున్నది. నేను వానితో "ఎవరు నీవు పాపాత్మా నరవాహనదత్త ప్రభువు రాజ్యములో పరస్త్రీని హరించి యెక్కడికి పోగలవు. అరవై వేల యోజనాల విద్యాధరభూమిలో జంతువులుకూడా అధర్మమార్గాన ప్రవర్తించవు" అంటూ వెంబడి అతనిని పట్టుకొని వరశాయించి చూసేసరికి కళింగసేనా మదనవేగులపుత్రుడు మీ బావమరది

ధరుడు "ఎవ రీవనిత; ఎందుకు ఈమెను బలాత్కారముగా తీసుకుపోతు
న్నావు" అని మేము ప్రశ్నించేసరికి ఇత్యకుడు ఇలా చెప్పినాడు. ఈమె
సురతమంజరి. అశోకమంజరీ మతంగదేవుల బిడ్డ విద్యాధరి. తల్లి మొదట
ఈమెను నాకు ఇస్తానని వాగ్దానము చేసింది. కాని, తండ్రి ఈమెను
మానవునకు ఇచ్చినాడు నాభార్యను తీసుకు వెళ్లుతుంటే వదిలిపోమను!"

"అమ్మా నీభర్త యెవరు? ఇతనికి ఎలా దొరికినావు" అని ఆమెను
మేము ప్రశ్నించాము. "ఉజ్జయినిలో పాలకమహారాజు కుమారుడు
సుగృహీతనామధేయుడు అవంతివర్ధనునిభార్యను నేను. మేము మేడమీద
నిద్రపోతూఉండగా ఈదుర్మార్గుడు నన్ను అపహరించినాడు" అని ఆమె
చెప్పింది. ఇత్యకుని బంధించి ఉంచాను. సురతమంజరీదేవి నాఅధీనములో
ఉన్నది. పైన దేవరచిత్తము!"

సేనాపతి మాటలు విని నరవాహనుడు సంశయగ్రస్తుడయి గోపాల
కుని దగ్గిరికివెళ్ళి ఈసంగతి చెప్పినాడు "నాకీవిషయము తెలియును. ఈ
మెను అవంతివర్ధనుడు ఈమధ్య వివాహము చేసుకొనిఉంటాడు. ఉజ్జ
యినినుంచి కుమార అవంతివర్ధనుని భరతరోహకమంత్రిని ఇక్కడికి
రప్పించి కనుక్కొంటే సత్యము తేలుతుంది"అన్నాడు గోపాలకుడు. వెం
టనే నరవాహనుడు ధూమశిఖుడనే విద్యాధరుని పంపించి వారినిరప్పించి
నాడు. వారు వచ్చి నమస్కారము చేశారు. నరవాహనుడు వారిని
ఆదరించి అసలు విషయాన్నిగురించి అడిగినాడు. అవంతి వర్ధనుడు
సురతమంజరితండ్రి ఇత్యకుడు వాయుపథాది విద్యాధరాధీశ్వరులు కశ్యప
ముని, తదితరులూ అక్కడఉన్నారు. అప్పుడుభరతరోహకమంత్రి ఇలా
చెప్పినాడు.

## అంగారవతిచరిత్ర

"దేవా, ఈవిషయము సవిస్తరముగా అవధరించాలి. ఒకరోజున
పాలకమహారాజు వద్దకు పౌరప్రముఖులు వచ్చి ఈనాడు ఉదకదాన

మహోత్సవము చెయ్యాలి. తమకు తెలుసునో తెలియదో, దీనికి మూలము. పూర్వము మీనాయనగారు ఖడ్గరక్షణ ముకోసమూ, భార్యా రక్షణ ముకోసమూ చండికాదేవినిగురించి తపస్సు చేసినారు. అమ్మ వారు ప్రసన్నురాలై తనఖడ్గమే ఆయనకిచ్చి "అంగారకాసురుని ఈ ఖడ్గముతోనే ఖండించి అతని పుత్రిక అంగారవతిని శీఘ్రకాలములోనే పెళ్లి ఆడు తావుఅని సెలవిచ్చింది. మీనాయనగారు అందుకు ఎదురు చూస్తూ ఉన్నారు. ఇలా ఉండగా ఉజ్జయినికి నగరాధ్యక్షులు ఎవరైతే వానిని రాత్రివేళ ఏదో క్రూరజంతువు సంహరించడము జరుగుతున్నది. చండమహాసేనుడు ఒకానొక రాత్రి స్వయముగా బయలుదేరి ఏకాకిగా నగరములో తిరుగుతూ నవీనపురుషుని చూచి చప్పున కత్తిదూసి ఆ భటజనముతో కూడిన అతని శిరస్సు ఖండించినాడు. ఇంతలో ఎవరో రాక్షసుడువచ్చి ఆ మొండెము తీసుకున్నాడు. వీడే నగరాధ్యక్షులను చంపి తినివేస్తున్నాడు అనుకొని ప్రభువు వానిజుట్టుపట్టుకొని శిరస్సు ఖండించబోయినాడు. "మహాప్రభూ, నన్ను వృథాగా ఎందుకు చంపుతావు? నీనగరాధ్యక్షులను భక్షించే రాక్షసుడు వేరు' అని వాడనేసరికి నీవెవరో చెప్పు అన్నాడురాజు. 'దేవా, పాతాళనివాసి అయిన అంగారకాసురుడు రాత్రివేళ వచ్చి మీనగరాధ్యక్షులను మింగివేసేవాడు ఇంతేకాక వివిధప్రదేశాలనుంచి రాజకన్యలను బలవంతాన అపహరించి తెచ్చి తనకూమార్తె అంగారవతీదేవికి పరివారజనముగా ఏర్పాటు చేస్తాడు. వాడు అరణ్యములో తిరిగేటప్పుడు కనిపెట్టి ఖండించి నీవు కృతకృత్యుడవు కావాలిఅని విన్నవించినాడు. రాజు వానిని వదిలిపెట్టి వెళ్లినాడు.

తరువాత ఒకనాడు రాజు అరణ్యానికి వేటకు వెళ్ళి పెద్దశరీరము నిప్పులు కక్కేకన్నులతో, అంజనపర్వతంవలె నల్లగా ఉన్న వరాహమును చూచి ఇది నిజముగా పంది కాదు. మాయాకారము ధరించిన

అంగారకాసురు డేమో అనుకొని రథములోనుంచే దానిమీద బాణ
ములు విడిచినాడు. వరాహము ఏమీ లెక్క చెయ్యక రథము పడ
దోసి నేలలో పెద్దరంధ్ర ముంటే అందులో ప్రవేశించింది. రాజు దాని,
వెంట బడి గుహలో ప్రవేశించి చూచేసరికి దివ్యనగరము కనబడ్డది.
వరాహము మాత్రము కనబడలేదు. కొంతదూరము వెళ్ళేసరికి దిగుడు
బావిబడ్డున అనేకకన్యకలు పరివేష్టించి ఉండగా మధ్యను దేదీప్యమాన
విగ్రహము గలకన్యామణి కనబడ్డది. ఆమెలేచి రాజును సమీ
పించి ఆగమనకారణము అడిగి కళ్ళనీళ్ళతో ప్రేమ తొణికిసలాడే
చూపులతో 'ఆర్యా, ఇక్కడి కెందుకు వచ్చారు? అయ్యో! మీరు
చూచినవరాహము అంగారకాసురుడు, వజ్రకాయుడు, మహాబలసంప
న్నుడు. ఇప్పుడు వరాహరూపము వదిలి లోపల నిద్ర పోతున్నాడు.
మేలుకొని భోజనము చేయబోయేటప్పుడు మీకు ఉపద్రవము కలి
గిస్తాడు. ఆయన నాతండ్రి. నాపేరు అంగారవతి. మీకు కలగబోయే
ఆపద తలచుకొంటే నాప్రాణాలు కంఠగత మగుచున్నవి' అన్నది ఆ
కన్యక. దేవిఇచ్చినవరము జ్ఞాపకము వచ్చి కార్యసిద్ధి అవుతుందని రాజు
ధైర్యము తెచ్చుకొని ఆమెతో "నీకు నావిషయంలో స్నేహం ఉంటే
నేను చెప్పినట్టు చెయ్యి. మీనాయన మేలుకొన్నతర్వాత ఆయన
పక్కన నిల్చుని రోదనం చెయ్యి. ఎందుకు ఏడుస్తా వని ఆయన అడుగు
తాడు 'నాయనా, నీవు పరాకుగా ఉన్నప్పుడు ఎవరైనా సంహరిస్తే నా
గతి ఏమిటి?' అని అడుగు. ఇలా చేస్తివా నీకూ నాకూ శుభం కలుగు
తుంది' అన్నాడు. అంగారవతి అనురాగవశాన రాజు చెప్పినట్టే చేసింది.
అంగారకాసురుడు తన కేమీ భయము లేదనీ తనది వజ్రశరీర మనీ,
ఆయువుపట్టు ఎడమఅరచేతిలో ఉన్నదనీ, అందులో ధనుస్సు ఉంటుం
దనీ ధైర్యము చెప్పినాడు కుమార్తెకు. చాటున దాగిఉన్నరాజు
ఈమాటలు విన్నాడు. అంగారకుడు స్నానముచేసి వచ్చి శివపూజకు

కూర్చున్నాము. రాజు ధనుస్సు ఎక్కుపెట్టి అసురునిఎదుటికి వెళ్ళి యుద్ధానికి రమ్మని పిలిచినాడు. అంగారకుడు మానము పూని కుడి చేతితో అర్చనచేస్తూ ఉండడమువల్ల ఎడమచెయ్యి ఎత్తి కాస్త ఆగు అన్నట్టు సంజ్ఞ చేసినాడు. గురితప్పనిరాజు వెంటనే అసురునిఎడమ చేతిలో మర్మస్థానముమీద వాడిబాణము విడిచినాడు. అసురుడు నేల మీద పడిపోయి 'దాహంగా ఉన్ననన్ను చంపినవాడు ఏటేట నాకు ఉదకతర్పణం చెయ్యకపోతే అతనిమంత్రులు ఐదుగురూ చనిపోతారు' అని ప్రాణాలు విడిచినాడు. తర్వాత రాజు అంగారవతిని తీసుకొని ఉజ్జయినికి వెళ్ళి యథావిధిగా వివాహము చేసుకొన్నాడు. ప్రతిసంవత్సరము అంగారకునికి జలతర్పణం జరుగుతున్నది. ఉదకదానము చేయవలసినరోజు ఇదే. మీనాయనగారిపద్ధతిని అనుసరించండి.

పౌరప్రముఖులు ఈప్రకారముగా విన్నవించినమీదట పాలకమహారాజు ఉదకదానమహోత్సవమునకు ఆజ్ఞ ఇచ్చినాడు. జనులు ఉత్సవకోలాహలములో ఉండగా మదించి, కట్టుకంబము ఊడబెరికినయేనుగు హఠాత్తుగా అక్కడకు వచ్చింది. అంకుశము లాగిపారవేసి, మావటివానిని పడదోసి, ప్రజలను కొందరిని తొక్కి చంపివేసింది. మావటివాళ్ళు మహామంత్రులూ దాన్ని కట్టడానికి పరుగెత్తుకొని వచ్చారు. అది యెవరికీ అలివి కాలేదు. ఏనుగు క్రమేణ మాలవాడకు వెళ్ళింది. అందులోనుంచి మాలపిల్ల ఒకతె ముందుకు వచ్చి, ఏనుగుతొండము మీద తనచేతితో అడిచి, కటాక్షవీక్షణాలు దానిపైన ప్రసారించింది. ఆమెచెయ్యి తగలగానే ఏనుగు మోహము కలిగి, ఆమెవైపేచూస్తూ నిలబడ్డది. ఆకన్య తనఉత్తరీయము దానిదంతాలకు ఉయ్యాలగా కట్టి అందులోకూచుని ఊగింది. కొంతసేపటికి ఆమెకు దాహ మయింది, ఏనుగు చెట్టునీడకు వెళ్ళింది. ఈవింతచూచి పౌరులు "ఈమె ఎవరో దివ్యకన్యక; చాలా ప్రభావ సంపన్నురాలు" అనుకొన్నారు.

ఈవార్త నగర మంతా వ్యాపించింది. కుమార అవంతి వర్ధనుడు వచ్చి ఆమెను చూచి మోహించినాడు. ఆమెకూడా అతని చూడ గానే మోహాపరవశురాలై ఏనుగు దిగి ఉత్తరీయము తీసుకొన్నది. ఇంతలో మావటివాడువచ్చినాడు. ఆకన్య (ప్రేమార్ద్రి)లోచనాలతో అవంతి వర్ధనుని చూస్తూ తనయింటికి వెళ్ళిపోయింది. రాజకుమారుడుకూడా ఇంటికి వెళ్ళి జలదానమహోత్సవము మాట మరిచిపోయి 'ఎవరాకన్య? ఎవరికూతురు? పేరేలాటిదో' అని వయస్యులను అడిగినాడు. 'ఇక్కడి మాలగూడెములో ఉత్పలహస్తునికూతురు; పేరు సురతమంజరి. ఆపిల్ల చిత్రపటములో బొమ్మవలె చూడడానికే గాని భోగానికి పనికిరాదు' అని ఒకరు చెప్పినారు. 'ఆమె మాలపిల్ల కాదు. ఎవరో దేవకన్యక అనిపిస్తున్నది. ఆసుందరిని వివాహము చేసుకోకపోతే జీవితము వృధా' అని రాజకుమారుడు పట్టుపట్టి మంత్రులమాట వినలేదు. అతనితల్లి దండ్రులు అవంతిమతీదేవి పాలకమహారాజు ఈసంగతి విని చాలావిచార పడ్డారు. మహాకులీను డైననాకుమారుడు కడజాతిదానిని కామిస్తు న్నాడే, అని రాణి ఆశ్చర్య పడ్డది. అందుకు రాజు తనకుమారుడు ఈ కన్యను వలచినా డంటే నిజంగా ఈకన్య మాలపిల్లకాదు. ఎవరో శాపమువల్ల ఇలా అయి ఉంటుంది. కోరదగినది కాని - కోరదగనిదికాని, చేయదగినది కాని చేయదగనిదికాని సజ్జనులకు అంతరంగమే చెపుతుంది' అని నిదర్శనార్థము ఈకథచెప్పినాడు.

## కు రం గి క థ

పూర్వము సుప్రతిష్ఠిత మనే నగర ప్రభువు ప్రసేనజిత్తుకు కురంగి అనే సుందరపుత్రిక ఉన్నది. ఒకనాడు ఆకన్య విహారార్థము ఉద్యాన ములోనికి వెళ్ళుతుంటే మత్తమాతంగము కట్టు తెంచుకొని ఆమెను తొనాలో పహా దంతాలమధ్య పట్టి పరుగెత్తడము ప్రారంభించింది.

పరివారజనులు ఏడుస్తూ పరుగెత్తినారు. ఇంతలోకే మాలయువకుడు ఖడ్గహస్తుడై వచ్చి ఏనుగుతొండము నరికివేసి కన్యను రక్షించినాడు. పరివారజనము వచ్చింది. కురంగి అతనిమీద వలపుగొని హృదయ భారముతో ఇంటికి వెళ్ళింది. ఆ మాలయువకునికి ఆమెమీద ప్రేమ ఉదయించింది. క్రమక్రమముగా అతనికి మనోవ్యథ హెచ్చిపోయింది. ఈవిషయము ఎవరితో చెప్పదగినది కాదు. తాను చనిపోవడమే చాలా యుత్తమమని భావించి ఆమాలయువకుడు రాత్రివేళ శ్మశానానికి వెళ్ళి స్నానము చేసి చితి పేర్చుకొని నిప్పు ముట్టించి 'అగ్నిభట్టారకా, నన్ను ఆహుతిగా స్వీకరించు; వచ్చే జన్మలో కురంగి నాకు భార్య అయ్యే లాగున వరము అనుగ్రహించు' అని దూక బోయినాడు. అగ్నిదేవుడు ప్రత్యక్షమై 'వృథాగా సాహసించకు. నీవు మొదట మాలడవు కావు. ఆకన్య నీకు భార్య అవుతుంది. ఈనగరములో కపిలశర్మ అనే బ్రాహ్మ ణుని అగ్నిగృహములో నేను ఆకారము ధరించి నివసిస్తాను. ఒకనాడు ఆయన కూతురు నా సన్నిధికి వచ్చేసరికి ఆమెను వలచి భార్యగా స్వీక రించాను. నీవు నాకుమారుడవు. భయము చేత నీతల్లి నిన్ను వీధి మొగదల పెట్టి వెళ్ళిపోయింది. మాలలు చూచి నిన్ను మేకపాలతో పెంచి పెద్దవాణ్ణి చేశారు. నీవు నాపుత్రుడవు కావడముచేత నీకు మైల లేదు. రాజకన్య నీకు భార్య అవుతుంది. అని చెప్పి అంతర్ధానము పొందినాడు. మాలయువకుడు. ఆశాపూరితుడై నిజగృహానికి వెళ్ళినాడు.

తర్వాత అగ్నిదేవుడు ప్రసేనజిత్తు ప్రభువుకు స్వప్నములో కనబడి విషయము యావత్తు తెలియచెప్పినాడు. రాజు అగ్నిదేవుని ఆజ్ఞప్రకా రము ఆయువకునికి తన కుమార్తెనిచ్చి వివాహము చేసినాడు. ఇలా దివ్యపురుషులు ప్రచ్ఛన్నముగా భూలోకములో సంచరిస్తూ ఉంటారు. ఈ సురతమంజరికూడా ఎవరో దివ్యకన్య. బహుశా వెనుక జన్మలో మనవానికి భార్య. అందుచేతనే వీరి కిద్దరికి ప్రథమ సందర్శనములోనే

ప్రణయము కలిగింది. ఈవిధముగా పాలకమహారాజ మా మొదట చెప్పగా నేను జాలరి కథ ఇలా చెప్పినాను.

## సు ప్ర హా రు ని క థ

పూర్వము రాజ గృహములో మలయసింహు డనే రాజుకు మాయావతి అనే మహాసుందరి పుత్రిక. ఒకనాడు ఆమె ఉద్యానములో విహారము చేస్తుంటే సుప్రహారుడనే జాలరి యువకుడు చాలా అంద మైనవాడు ఆమెను చూచి మోహించి ఇంటికిపోయి అన్నపానాదులు విసర్జించి రాజకుమారినే ధ్యానము చేయడము ప్రారంభించాడు. అతని తల్లి రక్షితిక కుమారుని బలవంతపెట్టి అడిగితే నిజం చెప్పినాడు. ఆమె 'నాయనా, దిగులు పడకు; అన్నము తిను. ఉపాయం చేసి నీకోరిక ఈడేరే మార్గం చూస్తాను' అని ఓదార్చింది.

రక్షితిక మంచిరకాల చేపలు తీసుకొని రాజకుమారి ఇంటిదగ్గిరకి వెళ్లి అక్కడి పరిచారికల అనుమతి పొంది రాజపుత్రికాదర్శనము చేసి ఆమెకు చేపలు కానుకగా ఇచ్చింది. ఈ ప్రకారముగా కొన్నిరోజులు గడిచినవి. ఒకనాడు రాజపుత్రిక సంతోషముతో 'నీ కేమి కావాలి? అడుగు తప్పకుండా నెరవేరుస్తాను' అన్నది. 'నన్ను అనుగ్రహిస్తే ఒక సంగతి మనవి చేస్తాను' అని అభయ ప్రదానము పొంది ఏకాంత ప్రదేశములో ఆజాలరిది రాజకన్యతో 'అమ్మా, ఉద్యానవనంలో నిన్ను చూచి నాకుమారుడు అదోమాదిరి అయిపోయినాడు. చచ్చిపోతా నంటూ ఉంటే నేనే ఆశపెట్టి ధైర్యం చెప్పి ఎలాగో ప్రాణాలు విడవకుండా నిలిపాను. నన్ననుగ్రహించి నాకుమారుని కాచి రక్షించాలి' అని వేడుకొన్నది.

రాజకుమార్తె సిగ్గుపడి మొహమాటపడి కొంతసేపు ఆలోచించి ఆరాత్రి రహస్యంగా అతనిని తన మందిరానికి తీసుకురమ్మని చెప్పింది.

రక్షితిక సంతోషంతో ఇంటికి పోయి రాత్రి కుమారుని అలంకారము చేసి రాజకన్య మందిరానికి తీసుకు వెళ్ళింది. సుప్రహారుని శయ్యమీద కూర్చోబెట్టి తన చల్లని చేతితో రాజకుమారి తాకింది. వాడు మహా సంతోషభరితుడై పడుకొని నిద్రపోయినాడు. రాజపుత్రి వేరే శయ్యమీద పడుకొని తనశీలం కాపాడుకొన్నది. కొంతసేపటికి సుప్రహారుడు మేలుకొని రాజకుమారి కనబడకపోయేసరికి కంగారుపడి తల్లడిల్లి ప్రాణములు విడిచినాడు. తర్వాత రాజకన్య ఈవిషయము గ్రహించి విచారపడి తనను నిందించుకొని వానితో సహగమనం చేయటానికి ఉద్యుక్తురాలయింది.

రాజుకు ఈ సంగతి తెలిసివచ్చి ఎన్నివిధాల చెప్పినా కూతురు వినక పోవడముచేత ఆచమనము చేసి 'లోకపాలకులారా, నేను నిజముగా మహేశ్వరభక్తుడనే అయితే ఇప్పుడు నాకర్తవ్య మేమిటి మీరు బోధించాలి' అని బిగ్గరగా పలికినాడు. అప్పుడు దివ్యవాణి ఇలా చెప్పింది. 'రాజా, నీకూతురు వెనుక జన్మలో జాలరి యువకుని భార్య నాగస్థల గ్రామములో మహీధరుని కుమారుడు బలధరుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతని తండ్రి చనిపోగానే దాయాదులు మోసముచేసి ధనము అపహరించారు. బలధరుడు విరక్తి చెంది భార్యతో కూడా బయలుదేరి గంగాతీరానికి వెళ్ళి దేహం చాలించాలని సంకల్పించి భోజనము మానివేసి ప్రాయోపవేశం చేసినాడు. నదీతీరాన జాలరులు చేపలు తింటూ ఉండగా ఆశతో చూచి బలధరుడు ప్రాణములు విడిచినాడు. అతని భార్య శుద్ధసంకల్పముతో తపస్సుచేసి అతనిని అనుసరించింది. సంకల్పదోషంవల్ల ఆ బ్రాహ్మణుడు జాలరిఅయి పుట్టినాడు. ఆ బ్రాహ్మణి శుద్ధసంకల్పంవల్ల నీపుత్రికగా పుట్టింది. నీకూతురు నిర్దోషురాలు. తన ఆయుర్దాయములో సగము ఇస్తే బతుకుతాడు. ఈమె తపోమహిమ చేతనూ తాను పుణ్యతీర్థములో చనిపోవుట చేతనూ ఈ యువకుడు నీఅల్లుడై రాజు కూడా అవుతాడు.

దివ్యవాణి ఆనతిప్రకారముగా రాజు కుమార్తెచేత అర్ధాయువు ఇప్పించి జాలరియువకుని బతికించి బిడ్డ నతనికిచ్చి వివాహము చేసినాడు. ఈప్రకారముగా పూర్వజన్మసంబంధము ఉంటే స్త్రీపురుషులకు అన్యోన్య ప్రీతి కలుగుతుంది. ఈసందర్భములో చోరునికథ ఒకటి చెపుతాను.

## వా మ ద త్త క థ

అయోధ్యలో వీరబాహు డనేరాజు చాలా ప్రఖ్యాతి వహించిన వాడు ప్రజలను తనబిడ్డలవలె సంరక్షించేవాడు. ఇలాఉండగా ఒకనాడు కొందరుపౌరులు రాజదర్శనము చేసి 'దేవా, ప్రతీరాత్రి దొంగలువడి ఊరుదోచుకుంటున్నారు. మేము మేలుకొనిఉన్నా వాళ్ళను పట్టలేకుండా ఉన్నాము' అని విన్నపము చేశారు. రాజు వేగులవాళ్ళను నియమించి నాడు. వా రేమీ చెయ్యలేకపోయినారు. ఊళ్ళో ఉపద్రవము తగ్గ లేదు. స్వయముగా చోరులను పట్టుకొనవలె నని రాజు ఖడ్గహస్తుడై ఒంట రిగా నగరములో రాత్రివేళ సంచారము చేస్తున్నాడు. ఇలాతిరు గుతూఉండగా అతనికి ఒకానొకప్రాకారమువిూద ఒకడు కనబడ్డాడు. వాడు బెదురుతూ తేలికగా అడుగులు వేస్తున్నాడు. వాడికళ్ళు కాకి కళ్ళవలె చలిస్తున్నవి. సింహమువలె వాడు మెడవెనుకకు తిప్పిచూస్తు న్నాడు. వానిచేతిలో విచ్చుకత్తి తళతళలాడుతున్నది. రాజు వాడు చోరు డని అనుమానించి దగ్గిరికి వెళ్లినాడు. చోరుడు సంశయిస్తూ నీ వెవరు ? అన్నాడు. నేను అనేకవ్యసనాల్లో చిక్కుకొని బతుకు తెరువు కనపడక సాహసికవృత్తి అవలంబించిన చోరుడను. నీ వెవరో చెప్పు అన్నాడు రాజు. 'నేను అసహాయశూరుడను, చోరుడను, నాకు చాలా ధనమున్నది; మాయింటికి వస్తే నీకు కావలసినంత ధన మిస్తాను' అని వాడనేసరికి రాజు సరే అని వానివెంట ఊరివెలపల అడివిలో కట్టిన వాని భూగృహంలోకి వెళ్ళినాడు. దొంగ అంతర్

గృహంలోకి పోయినాడు. రాజు మొగసాలలో కూర్చున్నాడు. ఇంత లోనే నాసికన్ని ప్రత్యక్షమై 'అమ్మో! ఎందుకు వచ్చావు నాయనా, వెంటనే వెళ్లిపో. ఈదొంగవిశ్వాసఘాతకుడు; నీ రహస్యం బయటపడు తుందేమో అని చంపివేస్తాడు నిన్ను' అని ప్రబోధించింది. రాజు అక్క డను దాటి నిజభవనము చేరి సేనాపతిని పిలువనంపి భటులను రప్పించి దొంగ ఇల్లు ముట్టడివేసి ధనరాసులు చూరగొని దొంగను బంధించి తెప్పించాడు. తెల్లవారిన తర్వాత వానిని కొరత వేయవలసినది అని ఆజ్ఞాపించాడు. తలారులు వీధివెంట దొంగను వధ్యస్థానానికి తీసు కొని వెళ్ళుతున్నారు. ఒకానొక వర్తకుని పుత్రిక చోరునిచూచి మోహించి వెంటనే తండ్రి దగ్గరకు పోయి "నాయనా, డప్పుకొట్టుతూ తలారులు తీసుకొని వెళ్తూ ఉన్న చోరుడు నా భర్త కాకపోతే నేను బతకడం కల్ల" అన్నది. తండ్రి ఆశ్చర్యపడి ఎన్నివిధాలనో వద్దని చెప్పినా కూతురు పట్టినపట్టు విడవలేదు. గత్యంతరము కనబడక వర్తకుడు రాజసన్నిధికి వెళ్ళి 'దేవా, కోటిధనం సమర్పించుకొంటాను ఆచోరుని అనుగ్రహించి రక్షించవలె' అని ప్రార్థించినాడు. రాజు వర్తకుని కోప్పడి వెంటనే దొంగను కొరతవేయించినాడు. తర్వాత వామదత్త అనుకున్నట్లు ఆవర్తకునిపుత్రిక చోరునిశవం తీసుకొని దానితో అగ్ని ప్రవేశం చేసింది. కాబట్టి పూర్వజన్మసంబంధం ఉంటే ప్రాణులు ఈ ప్రకారంగా ప్రవర్తిస్తారు.

మహాప్రభూ, అవంతివర్ధన కుమారునికి ఈసురతమంజరి పూర్వ జన్మలో భార్యఅయిఉంటుంది. కానిపక్షంలో రాజపుత్రునికి మతింగ కన్యమీద మమకారం ఎందుకు కలుగుతుంది మహాప్రభూ" అన్నాను.

వెంటనే పాలకమహారాజు ఉత్పలహస్తుని దగ్గరికి దూతలను పం పించినాడు, వారు వెళ్లి కన్యను రాజకుమారునికి ఇమ్మని అడిగినారు. నాకు సమ్మతమే కాని మాయింట్లో ఈనగరంలో ఉన్న పద్దెనిమిదివేల

మంది బ్రాహ్మలకు సంతర్పణ ఎవరు చేస్తే వారికి సురతమంజరిని ఇచ్చి వివాహము చేస్తాను' అన్నారు వారు. దూతలు వెళ్లి రాజుకు ఈసంగతి విన్నవించినారు. ఇందుకేదో కారణ ముంటుందని రాజు ఊహించి నగరములో బ్రాహ్మణాన్ని సమావేశపరచి 'విప్రులారా, మాతంగ ఉత్పలహస్తుని ఇంట్లో పద్ధెనిమిదివేలమంది బ్రాహ్మణులకు భోజన సంతర్పణ జరుగుతుంది. మీరు భుజించాలి అంగీకరించకపోతే మీకు క్షేమములేదు' అని ఆజ్ఞాపించాడు. ఏమీ తోచక బ్రాహ్మణులు మహాకాళదేవుని ఆశ్రయించి తపస్సు ఆరంభించారు. రాత్రివేళ కలలో మహేశ్వరుడు కనబడి 'సంశయించవద్దు మీరు అందరూ ఉత్పలహస్తుని ఇంట భోజనం చేయవచ్చును. నిజానికి అతనూ అతని కుటుంబమూ విద్యాధరులు' అని సెలవిచ్చినాడు. బ్రాహ్మణులు ఆ వార్త రాజుకు ఎరుకపరచి 'మాలవాడెములో కాకుండా మరొకచోట ఉత్పలహస్తుడు శుద్ధాన్నము వండిస్తే మేము భుజిస్తాము' అన్నారు. రాజు వెంటనే ఉత్పలహస్తునికి వేరే యిల్లు కట్టించినాడు. వంటలు వండి వడ్డనలు చేసినారు. ఉత్పలహస్తుడు స్నానము చేసి మడికట్టుకొని వారి యెదుట నిలుచున్నాడు. పద్ధెనిమిదివేలమంది బ్రాహ్మణులు భోజనములు చేసినారు. సంతర్పణ అయినతర్వాత ఉత్పలహస్తుడు వచ్చి అందరికీ నమస్కారము చేసి రాజుకు ఇలా విన్నవించినాడు.

## సురతమంజరి పూర్వకథ

"దేవా గౌరిముండు డనే విద్యాధరప్రభువు ఉండేవాడు. ఆయన మహా ప్రబలుడు నేను ఆయన ఆశ్రితుడను నాపేరు మతంగదేవుడు. సురత మంజరి నాపుత్రిక. ఈమె పుట్టినప్పుడు గౌరిముండుడు నన్ను పిలిపించి 'వత్సేశ్వరుని కుమారుడు నరవాహనదత్తుడు మన కందరికీ చక్రవర్తి అవుతాడని దేవతలు అంటున్నారు. అతను చక్రవర్తి అయ్యేయెడల

మనకు సామాన్యశత్రువే. నీవు వెళ్ళి మాయ అవలంబించి అతనిని పడ గొట్టు' అని చాలా బలవంతి పెట్టినాడు. ఆపాపి ఇలా ప్రేరేపణ చేసిన తర్వాత నేను ఆకాశమార్గాన బయలుదేరాను. మహేశ్వరుడు ఎదుట సాక్షాత్కరించి హుంకరించి 'ఓరీ మహాపురుషునికి అపకారము తల పెట్టినావా? నీవు భార్యాపుత్రికా సమేతముగా మాతంగులలో కలిసిపో. వెళ్ళు ఉజ్జయినికి. నీకన్యాకులాన్నికి బదులుగా పద్దెనిమిదివేల బ్రాహ్మ ణులకు ఎప్పుడు నీయింట భోజన సంతర్పణ జరుగుతుందో అప్పుడు నీశాపము తీరిపోతుంది. నీకన్యను ఆ చేయించిన వాని కిచ్చి వివాహము చెయ్యి' అని ఆజ్ఞాపించి అంతర్ధానము చెందినాడు. నేను వచ్చి వీరిలో పడినాను. ఉత్పలహస్తుడని పేరువచ్చింది. వీరితో సాంకర్యము ఏమీ లేదు. ఇప్పుడు నీకుమారుని అనుగ్రహముచేత నాశాపము తీరిపోయింది. సురతమంజరిని నీకుమారునికి ఇస్తున్నాను. ఇక నరవాహనదత్త చక్ర వర్తి సేవచేయడానికి నావిద్యాధర పదవి అధిష్ఠిస్తాను."

ఇలా చెప్పి మతంగదేవుడు భార్యతోకూడా ఆకాశానికి ఎగిరి పోయి నాడు. పాలకమహారాజు అవంతివర్ధనునికి సురతమంజరికి వివాహము చేయించినాడు. రాజకుమారుడు చాలా సుఖముగా కాలము గడుపు తున్నాడు.

ఒకరాత్రి భార్యా భర్తలు మేడమీద పండుకొని నిద్రించినారు. తెల్లవారుజామున అవంతివర్ధనుడు లేచి చూచేసరికి సురతమంజరి కనబడ లేదు. కుమారుడు తండ్రి చాలా విచారపడ్డారు. 'ఆ రక్షకభటులు బహు జాగరూకులు ఈపని మానవులు చేసిందికాదు ఎవడో ఆకాశ సంచారి మహాదుర్మార్గుడు సురతమంజరిని అపహరించి ఉంటాడు' అని మేము విన్నవించాము. ఇంతలో మీసన్నిధినుంచి ధూమశిఖుడు వచ్చి పాలకప్రభువుకు సంగతు లన్నీ చెప్పి అవంతివర్ధన కుమారునీ నన్నూ ఇక్కడికి తీసుకువచ్చినాడు. సురతమంజరి ఆమె తండ్రీ ఇక్కడనే ఉన్నారు. పైన దేవరవారిచిత్తము.

ఈవిధముగా భరతరోహకుడు చెప్పి విరమించినాడు. సభా సదులు మతంగదేవుని చూచి 'నీకొమార్తెను ఎవరి కిచ్చినావయ్యా' అని ప్రశ్నించారు. 'అవంతి వర్ధన కుమారునికే ఇచ్చాను' అన్నాడు మతంగదేవుడు.

ఇత్యకునిచూచి సభ్యులు 'ఏ మయ్యా, నీవు ఈమెను ఎందుకు అపహరించి తెచ్చావు?' అని అడిగారు.

'మొదటతల్లి ఈమెను ఇస్తానని నాకు వాగ్దానము చేసింది' అన్నాడు ఇత్యకుడు.

తండ్రిఉండగా కన్యాదానము చెయ్యడానికిగాని, వాగ్దానముచెయ్య డానికిగాని తల్లికి ఏమిఅధికారమున్నది? అయినా నీకు సాక్షు లెవరు? ఇప్పు డీమె పరభార్య. పరవనితను హరించడము పాతకము' అన్నారు సభ్యులు.

ఇత్యకుడు నోరెత్తలేదు. నరవాహనదత్తుడు చాలా ఆగ్రహించి ఇత్యకునిశిక్షకు ఆజ్ఞయిచ్చినాడు. కశ్యపాదిమునులు అడ్డుపడి 'రాజా, వీని అపరాధముక్షమించు. ఎంత చెడినా నీ బావమరదికదా, పైగా మదన వేగుని కుమారుడు' అని శాంతింపజేసినారు. నరవాహనదత్తుడు ఇత్య కుని మందలించి విడిచిపెట్టి సురతమంజరిని అవంతివర్ధనునికి సమర్పించి వాయుపథుని సహాయమిచ్చి భరతరోహకునితోకూడా వారిని ఉజ్జ యినికి పంపివేసినాడు.

## తరంగము : ౧౧౩

ఈప్రకారముగా కశ్యపముని, సాధ్వి అయిన సురతమంజరిని ఇత్యకుని బారినుంచి తప్పించి ఆమెను భర్తకు సమర్పించి ఇత్యకుని బెదిరించి మునులమధ్యకూర్చున్న నరవాహనదత్తునితో ఇలా అన్నాడు "రాజన్, నీవంటిచక్రవర్తి పూర్వములేదు, భావికాలములో ఉండడు. ధర్మనిష్ఠమైన నీబుద్ధి రాగాదులకు వశముకావడములేదు. పుణ్యాత్ముడవైననీదర్శనము

చేసేవారు ధన్యాత్ములు. మహాసామ్రాజ్య మున్నప్పటికీ నీలో దోష మేమీ లేదు. పూర్వకాలములో ఋషభకాదిచక్రవర్తులు నానావిధ దోషాలపా లయి సంపదలు కోలుపోయి భ్రష్టు లయినారు. ఋషభుడు సర్వదమనుడు బంధుజీవకుడు అతిదర్పమువల్ల ఇంద్రునిచేత దెబ్బతిన్నారు. నారదమహర్షి నీ చక్రవర్తి పదప్రాప్తి కారణ మేమిటి అని అడిగితే జీమూతవాహనుడు కల్పవృక్ష, స్వశరీరదానాలు కారణాలని తన సుకృతవిషయము చెప్పి చక్రవర్తిపదవి కోలుపోయినాడు. విశ్వాంతరుడనే చక్రవర్తి కుమారుడు ఇందీవరాక్షుడు చేదిరాజు వసంతతిలకుని భార్యను చెరిచినాడు. చేదిరాజు దానిని సంహరించినాడు. తనకుమారుడు పోయినా డనేశోకము భరించ లేక ధైర్యము కోలుపోయి విశ్వాంతరుడు మరణించినాడు. మానవుడైన తారావలోకుడు మాత్రము విద్యాధరచక్రవర్తి అయి ఎటువంటి దోషానికీ లోబడక చిరకాలము రాజ్యము పరిపాలించి చివరకు వైరాగ్యమువల్ల సమస్త సంపదలూ విడిచిపెట్టి, తపోవనానికి వెళ్ళినాడు. మొత్తముమీద విద్యాధరులు చక్రవర్తి పదవి పొంది, రాగాంధులై మైమరచి ఉచితమార్గములో ఉండలేక భ్రష్టు లయినారు. కాబట్టి నీవు న్యాయమార్గము తప్పకుండా ప్రమాదములు కలగకుండా నీప్రజలనూ విద్యాధరులనూ సంరక్షిస్తూ ఉండాలి"

చక్రవర్తి ఆయనవాక్కులు శ్రద్ధతో ఆలకించి "భగవన్, తారావలోకుడు మానవు డయినప్పటికీ విద్యాధరైశ్వర్యము ఎలా పొందినాడో మాకు వివరించాలి" అని ప్రార్థించినారు. కశ్యపుడు అందరూ వినండి అని ఇలా ప్రారంభించినాడు.

## తారావలోకుని వృత్తాంతము

శిబిదేశప్రభువు చంద్రావలోకుడు. అతనికి చంద్రలేఖ అనే భార్య ఉన్నది. శత్రుసేనను మర్దించి వేయగల కువలయాపీడమనే ప్రసిద్ధగజము

ఉన్నది. అతనిరాజ్యము పౌరస్వామిక మయినప్పటికీ ఎంత బలవంతుడు గాని, అతనిని ఎదిరించ లేకపోయినాడు. ఈయేనుగుప్రభావమే దానికి కారణము. రాజుకు వార్ధకము వచ్చేసమయములో శుభలక్షణాలు కలిగిన కొడుకుపుట్టినాడు. తండ్రి శిశువుకు తారావలోకుడని పేరు పెట్టినాడు. చిన్నతనములో ఆబాలుడు సమస్తసద్గుణోపేతుడయి తల్లి దండ్రుల శుశ్రూషలో జీమూతవాహనుని మించిపోయినాడు. చక్రవర్తి లక్షణాలు కలిగిన తారావలోకునికి తండ్రి మద్రరాజు కూతురు మాద్రి అనేకన్యకను తెచ్చి వివాహము చేసినాడు. వెంటనే అతనికి యౌవరాజ్యాభిషేకము కూడా చేసినాడు.

తండ్రి ఆనతి ప్రకారము అన్నసత్రాలు మొదలయినవి పెట్టించినాడు. నిద్రలేచి కువలయాపీడము మీద ఎక్కి యోగ్యులను వెతికి తీసుకురావడానికి అన్నిదిక్కులా తిరుగుతూ ఉండేవాడు. ఎవరుఏది కోరితే అది వారికి ఇచ్చేవాడు, అది యెంత వెల కలదీ అయినాసరే. అందువల్ల అతనిపేరు అన్నిదిక్కులా వ్యాపించింది. కొంతకాలానికి అతనిభార్య మాద్రీదేవి కవలబిడ్డలను కన్నది; ఇద్దరూ మగపిల్లలు. వారికి రామలక్ష్మణులు అని పేరుపెట్టినారు. ఆశిశువులు దినదినాభివృద్ధిపొందుతూ తండ్రిదండ్రులకూ, తాతకూ అవ్వకూ ప్రాణాధికులుగా ఉన్నారు.

తారావలోకుని శత్రువులు కువలయాపీడమునూ అతనికుమారులనూ చూచి ఈర్ష్యపొంది అతనికీర్తికి మాత్సర్యము చెంది బ్రాహ్మణులను కొంతమందిని చాటుగా పిలిచి, "మీరువెళ్ళి కువలయాపీడము కావలెనని తారావలోకుని యాచించండి. ఏనుగును ఇచ్చినాడా, అతడు దుర్బలుడవుతాడు. అతనిని మేము తేలికగా ఓడించి రాజ్యము తీసుకొంటాము. ఏనుగును ఇవ్వడా మహాదాత అనే అతనికీర్తి నశిస్తుంది" అని చెప్పినారు.

సరే అని బ్రాహ్మణులు దానవీరు డయిన తారావలోకునిసన్నిధికి వెళ్ళి ఏనుగు కావలె నని యాచించినారు. "తీసుకు పోయి బ్రాహ్మణు లేమి చేసుకొంటారు! ఏ మయినా కానీ కువలయాపీడమును ఇవ్వక తప్పదు. యాచకులను ఎవరో ప్రేరేపించి ఉంటారు. అర్థులను ఊరికే వెళ్ళ మనగూడదు" అని ఆలోచించి తారావీరుడు నిశ్చలమనస్కుడై ఆగజేంద్రమును బ్రాహ్మణులకు అర్పించినాడు. కరీంద్రమును బ్రాహ్మలు తీసుకొని వెళ్ళుతుంటే పౌరులు చూచి కోపించి అతనితండ్రి చంద్రావలోకప్రభునిసద్దకు వెళ్ళి "నీకుమారుడు రాజ్యము విసర్జించి మునిధర్మము స్వీకరిస్తున్నాడు. సమస్తసంపదలకూ కారణభూతమై దానివాసన సోకినమాత్రాన ఇతరగజములు పలాయనము చేసే కువలయాపీడాన్ని యాచకులకు సమర్పించినాడు. నీకుమారుని తపోవనానికి పంప నయినా పంపించు ; ఏనుగు నయినా తెప్పించు. ఏదీ కాని పక్షములో మేము ఇంకొకరిని రాజును చేస్తాము" అని గట్టిగా పలికినారు. పౌరులవిజ్ఞాపన ప్రతీహారునిద్వారా చంద్రావలోకుడు కుమారునికి తెలియపరిచినాడు.

"ఏనుగను యాచకులకు ఇచ్చినాను. అడిగినవారికి ఇయ్యరానిది ఏదీ లేదు. పౌరస్వామ్య మున్న ఈరాజ్య మెందుకు? మెరుపుతీగవలె చంచలమై ఇతరుల కుపయోగించని సంపద యెందుకు ? అరణ్యము లో ఉండడము మంచిది. అక్కడివృక్షఫలాదులు అందరికీ అందుబాటులో ఉంటవి. నరపశువులమధ్య ఉండడముకంటె వనవాసమే మేలు" అని తారావలోకుడు పలికినాడు.

అతని భార్య మాద్రి అతనివలెనే ధీరచిత్తము కలది. తారావలోకుడు ఆమెను తీసుకొని తల్లిదండ్రులపాదాలకు మనస్సులో నమస్కరించి యాచకులకు తనధనము యావత్తూ ఇచ్చి నారబట్టలు కట్టుకొని బిడ్డలతో సహా రాజభవనము విడిచినాడు. దుఃఖిస్తూ తనవెంటవచ్చిన బ్రాహ్మణులను ఓదార్చి వెనకకు పంపి బిడ్డలకోసము బండిమాత్రము

తీసుకొని వెళ్ళుతున్నాడు. మార్గములో కొందరు బ్రాహ్మణులు వచ్చి గుర్రాలను కోరినారు. తారావలోకుడు వారికి గుర్రాలిచ్చి, భార్యతో సహా బండి యీడ్చుకు వెళుతున్నాడు. కొంతదూరము తపోవనములోకి పోయి విశ్రాంతి తీసుకొంటూ ఉండగా బ్రాహ్మణుడొకడు వచ్చి ఆ బండీ కావలెనని అడిగినాడు. తారావలోకుడు శాంత చిత్తముతో బండీ బ్రాహ్మణునికి ఇచ్చినాడు. భార్యాభర్తలు పిల్లలతో ఎలాగో కష్టముమీద తపోవనస్థానము చేరుకొన్నారు.

మాద్రి భర్తకు ఏలోపమూ లేకుండా పరిచర్యలు చేస్తున్నది. వారు చెట్టుకింద నివాసము చేస్తున్నారు. మృగములే వారికి పరివారము. ఇలా ఉండగా ఒకనాడు అతనిభార్య ఆశ్రమము దాటి ఫలపుష్పాదులు తేవడానికి వెళ్ళింది. వృద్ధబ్రాహ్మణుడు వచ్చి పర్ణశాలలో ఉన్న తారావలోకుని చూచి అతని బిడ్డలు రామలక్ష్మణులను తనకిమ్మని యాచించినాడు. 'నా ధైర్యనాశనం చెయ్యడానికి వచ్చిన అదృష్టదేవతవలె ఉన్నాడీబ్రాహ్మడు. అయినప్పటికి, యాచకుని మనోరథము పూర్తి చెయ్యకుండా పంపడ మెందుకు? బిడ్డలను ఇస్తాను' అనుకొని వారిని బ్రాహ్మణునికి అతడు సమర్పించినాడు. విప్రుడు బాలకులను నడిపించుకు వెళుతూ చేతులు తీగలతో కట్టి వాళ్ళను కొట్టినాడు. వాళ్లు కళ్ళనీళ్ళతో తిరిగిచూస్తూ రోదనము చేస్తూఉన్నప్పటికీ తారావలోకుడు క్షోభపొంద లేదు. అతనిధైర్యస్థైర్యములకు చరాచర ప్రపంచము సంక్షోభించింది.

మాద్రి పుష్పఫలాదులు సేకరించి చాలా బడలికతో ఆశ్రమానికి మరలివచ్చింది. భర్త కిందికి దృష్టి వాల్చి కూర్చుని ఉన్నాడు. బిడ్డలు కనబడలేదు. ఏదో ప్రమాదము సంభవించిందని ఆవిడ కంగారుపడి 'పిల్ల లేరీ' అని అడిగింది. 'దరిద్రబ్రాహ్మడు ఎవరో వచ్చి యాచిస్తే అతనికి రామలక్ష్మణులను ఇచ్చి వేశాను' అని తారావలోకుడు నెమ్మదిగా చెప్పినాడు. ఆ సాధ్వి అజ్ఞానవికారము విడిచిపెట్టి అయితే మంచిపని

చేసినాడు. 'యాచకుడెన్నడూ ఊరికే పోగూడదు' అన్నది. ఆదంపతుల తుల్యయోగ్యతకు భువనము కంపించి పోయింది. ఇంద్రుని పీఠము కూడా అల్లల్లాడింది. మాద్రీతారావలోకుల దాన సత్త్వప్రభావముచేత కంపించినజగత్తును ఇంద్రుడు దివ్యదృష్టివల్ల తెలుసుకొని బ్రాహ్మణ వేషము ధరించి పరీక్షచేతామని తారావలోకునివద్దకు వెళ్ళి అతని భార్యను యాచించినాడు. అరణ్యములో తనకు సహచారిణిగా ఉన్న భార్యను అతనికి ఇచ్చి వేయడానికి నిర్వికారంగా సంకల్పించి హస్తోదకము పట్టుకున్నాడు. 'ఇటువంటి భార్యనుఇచ్చి ఏమిసాధించాలనుకున్నావు, రాజర్షీ?' అని ఇంద్రుడు అన్నాడు. 'నేను సాధించవలసింది ఏమీ లేదు. అయితే బ్రాహ్మణులకు ప్రాణాలయినా సమర్పించాలని నావాంఛ' అన్నాడు తారావలోకుడు.

అప్పుడు మహేంద్రుడు నిజరూపము ధరించి 'సంతుష్టుడనయినాను; భార్యను ఇవ్వనక్కరలేదు. పరీక్షార్థమే ఇలా చేశాను. అచిరకాలములో నీవు విద్యాధరచక్రవర్తి వవుతావు' అని అంతర్ధానము పొందినాడు.

ఇంతలో వృద్ధబ్రాహ్మణుడు దక్షిణగా లభ్యమైన తారావలోకుని తనయులను వెంట బెట్టుకొని తోవ తప్పి తిరిగి తిరిగి దైవవశాత్తు చంద్రావలోకునినగరము చేరి విపణివీధిలో ఆ బాలకులను అమ్మజూపినాడు. కొంతమందిపౌరులు రాచబిడ్డలను గుర్తుపట్టి వెళ్ళి రాజుకు విన్నవించి బ్రాహ్మణునీ, బాలకులనూ రాజసన్నిధిలో నిలిపినారు. చంద్రావలోకుడు తనమనుమలను చూచి కన్నీరు పెట్టి విప్రుని అడిగి కుమారుని వృత్తాంతము తెలుసుకొన్నాడు. సుఖదుఃఖమిశ్రితమూ సత్వోత్కర్షమూ అయిన నిజకుమారునిసంగతి గురించి బాగా ఆలోచించి పౌరులు వేడుకొంటున్నప్పటికీ రాజ్యస్పృహ విడిచి, బ్రాహ్మణునికి ధన మిచ్చి బిడ్డలను తీసుకొని కొద్దిపరివారముతో తారావలోకుని ఆశ్రమానికి వెళ్ళినాడు. అక్కడ ద్విజులమధ్య జటావల్కలధారి యైన తారావలోకుడు

తండ్రిని దూరమునుండి చూచి, లేచి వచ్చి పాదాలమీద పడినాడు. తండ్రి రామలక్ష్మణులను కుమారునికి అప్పగించినాడు. ఉభయులూ అన్యోన్యవృత్తాంతాలు చెప్పుకొంటూ ఉండగా, ఆకాశమునుండి ఐరావతము, లక్ష్మీదేవి, విద్యాధరాధిపతులూ దిగినారు. లక్ష్మి పద్మహస్తముతో తారావలోకునివైపు తిరిగి 'నీవు ఈ ఏనుగు నెక్కి విద్యాధరపదమునకు వెళ్ళు. దానప్రభావమువల్ల విద్యాధరపదవి నీకు లభ్యమైనది' అని అనుగ్రహించింది.

తారావలోకుడు భార్యతో సహా తండ్రికి ప్రణామము చేసి ఆశ్రమవాసు లందరూ చూస్తూ ఉండగా ఐరావతమెక్కి విద్యాధరపరివేష్టితుడై ఆకాశమార్గాన విద్యాధరపదమునకు వెళ్ళినాడు. అక్కడ బహుకాలము సామ్రాజ్యసౌఖ్యము లన్నీ అనుభవించి కాలక్రమేణ విరక్తుడై తపోవనానికి వెళ్ళిపోయినాడు. మానవుడైన తారావలోకుడు సన్మార్గగామి కావడముచేత విద్యాధరపదవి పొందినాడు. ఇంకా ఇతరులు పొందినప్పటికీ, అపచారాలవల్ల భ్రష్టులయినారు. కాబట్టి దేవా, స్వయముగా గాని పరులవల్ల గాని అపచారము జరగకుండా నీవు రక్ష చేయవలెనుమా.

ఈప్రకారముగా కశ్యపముని చెప్పినమీదట చిత్త మని నరవాహనదత్తుడు 'విద్యాధరులారా, నేటినుంచి ధర్మాతిక్రమము చేసినవాడు ఎవ డయినా సరే వధ్యు' డని హరాచలముమీద ఉద్ఘోషణ చెయ్యడానికి ఆన తిచ్చినాడు. విద్యాధరు లందరూ ఆజ్ఞ శిరసావహించారు.

సురతమంజరిని విడిపించినతర్వాత, మునిశ్రేష్ఠుని ఆశ్రమములో మేనమామసన్నిధిలో వర్షాకాలము గడుపుతూ నరవాహనుడు సపరివారముగా నివాసము చేసినాడు.

## ప ద్మా వ తి లం బ క ము

### త రం గ ము : ౧౧౪

దేహార్ధస్మృత కాన్తో ఽపి
తపస్వీ నిర్గుణో ఽపి యః
జగత్స్తుత్యో నమ స్తస్మై
చిత్రరూపాయ శమ్భవే।
చలత్కర్ణాగ్ర విక్షిప్త
గణ్డోడ్డీనాలి మణ్డలమ్
ధున్వానం దఘ్నసఙ్ఘాత
మివ విఘ్నాన్తకం నుమః॥

తాలిచియు నర్ధదేహాన దార నెవడు
అయ్యెను తపస్వి నిర్గుణుం డయ్యు నెవడు
సకలలోక సంస్తుత్యు డాశంకరునకు
చిత్రరూపునకు నమస్సు చేయువాడ!
గండములమీద చంచరీకమ్ము లెగురు
వేళ నెవ్వడు కర్ణాగ్రచాలనముల
విఘ్నముల దోలువిధమున వెలయుచుండు,
నానమస్కృతి అట్టివినాయకునకు!

అసితగిరిమీద కశ్యపాశ్రమములో నరవాహనుడు వర్షాకాలము గడుపుతున్నాడు. అతని ఇరవై అయిదుగురు భార్యలు, మంత్రులు, విద్యాధరాధిపతులు వినోదముగా కథలు చెప్పుకుంటూ కాలక్షేపము చేస్తున్నప్పుడు ఒకనాడు మునులు, మునిభార్యలు అతనితో 'రాజా, మానసవేగుడు మదనమంచుకను మాయచేసి అపహరించినప్పుడు నీవు

విరహావస్థలో ఉన్నావుకదా నీకు ఎవరు ఏవిధంగా మనశ్శాంతి కలిగించి వినోదాలు సమకూర్చినారో మాకు సవిస్తరంగా చెప్పు' అన్నారు.

నరవాహనుడు ఈప్రకారముగా చెప్పినాడు. నేను ఆరోజులలో పడ్డ బాధ చెప్పడానికి అలవికాదు. మదనమంచుక కోసము మంత్రులూ నేనూ చాలా ప్రదేశాలు తిరిగాము. ఒకచోట చెట్టుక్రింద వెర్రిఎత్తిన వానివలె కూర్చుంటే ఈగోముఖుడు నన్ను ఓదార్చి 'దేవా, అధైర్య పడకు. తొందరలోనే దేవి లభిస్తుంది. ఆమెతోకూడా నీవు విద్యాధ రైశ్వర్యమును అనుభవిస్తావని దేవతలు సెలవిచ్చినారు కదా! వారి మాటలు ఎప్పుడూ అన్యథా కావు. పూర్వము శ్రీరాముడు, నలుడు, నీ తాతలు ఓర్పుకొని భార్యలతో పునస్సమాగమము పొందలేదా! పద్మావతీ దేవిని ఎడబాసిన ముక్తాఫలకేతుడు మళ్ళీ ఆమెను కలు సుకోలేదా! అని ఆకథ నాకు ఇలా చెప్పినాడు.

లోకప్రసిద్ధ మైన వారాణసిలో బ్రహ్మదత్తుడనే రాజుకు సోమప్రభ అనే భార్య ఉన్నది. అతడు మహామాహేశ్వరుడు, శూరుడు, దాత, క్షమాపరుడు. అతని మంత్రి సర్వశాస్త్రవేత్త, మహాబుద్ధిమంతుడు, బ్రాహ్మణోత్తముడు అయిన శివభూతి.

బ్రహ్మదత్తుడు తనచంద్రప్రాసాదములో శయనముమీద ఉండి ఆకాశమునుంచి దిగిన హంసద్వంద్వమును చూచినాడు. ఆరాజహంసలు మెరుగు పెట్టిన బంగారమువలె మెరుస్తున్నవి. వాటిచుట్టూ రాజ హంసలు అనేకము ఉన్నవి. అవిచూపుమేర దాటిపోగానే బ్రహ్మ దత్తుడు ఆశ్చర్యపడి మళ్ళీ వాటిని చూడవలెనని ఆదుర్దా పడ్డాడు. అత నికి రాత్రి నిద్ర పట్టలేదు. మంత్రి శివభూతితో మర్నాడు హంసల సంగతి చెప్పి వాటిని అనుక్షణం తృప్తితీరేటట్టు చూడకపోతే నాకీ రాజ్యమెందుకు, జీవిత మెందుకు అన్నాడు. శివభూతి రాజును ఓదార్చి ఆపక్షులు మళ్ళీ ఇక్కడికి వస్తాయి. నీవు సరోవరము తవ్వించి తామరలు

కలువలు వేసి పక్షులను ఎవరూ బాధించకుండా కావలి పెట్టి పిట్టలకు ఇష్టమయిన మేత తటాకతీరాన వేయించు. జలపక్షులు అన్నిదిక్కుల నుంచీ ఇక్కడికి వస్తవి. ఆబంగారు హంసలు కూడా వస్తవి. వాటిని నీవు నిరంతరము చూస్తూ ఉండవచ్చు. అన్నాడు. మహామంత్రిమాట ప్రకారము రాజు తటాకము త్రవ్వించి తగిన సదుపాయాలు చేసినాడు.

క్రమేణా హంసలు, సారసములు అక్కడికివచ్చినవి. ఆహంస ద్వయముకూడా వచ్చి తామరగుబురులో ప్రవేశించింది. కావలివారు ఆసంగతి రాజుకు నివేదించారు. బ్రహ్మదత్తుడు చాలా ఆనందించి సరోవరముదగ్గరికి వెళ్ళి బంగారుహంసలను చూస్తూ పాలు బియ్యము ఎదట పెట్టుకొని వాటిని మచ్చికచేసుకోడానికి ప్రయత్నించినాడు. బంగారపుశరీరము, ముత్యాలకళ్ళు, పగడాలముక్కులు, పాదాలు, గరుడ మణిరెక్కకొనలు ఉన్న ఆహంసలు మచ్చికపడి అతనిదగ్గరికి రావడము మొదలుపెట్టినవి. రాజు తటాకముఒడ్డునే మందిరము కట్టించి అందులో నుంచి ఎప్పుడూ వాటికేసి చూస్తూ కాలక్షేపము చేస్తున్నాడు.

ఒకనాడు బ్రహ్మదత్తుడు తటాకతీరాన తిరుగుతూ వాడిపోని పూజా పుష్పాలు చూసి ఇక్కడ ఎవరు పూజ చేసినారు అని కావలి వారి నడిగినాడు. 'దేవా, త్రికాలములలో ఈసువర్ణహంసలు సరస్సులో స్నానము చేసి ప్రతిదినమూ పూజచేసి ధ్యానముతో ఉంటవి ఈఅద్భుత మేమిటో మాకు తెలియడం లేదు, అని విన్నవించారు. రాజు ఆలోచించి దీని కేదో హేతువున్నదని ఊహించి హంసలరహస్యం గ్రహించడానికి తపస్సు ప్రారంభించాడు. భార్య, మంత్రి, తాను ఉపవాసవ్రతము పూని ఈశ్వరధ్యానములో పన్నెండురోజులు ఉన్నతరవాత రాత్రి అతనికి స్వప్నములో హంసలు కనపడి 'రాజా, ఇక లే. మీరంతా ఉదయము భోజనాలు కానియ్యండి. ఏకాంత ప్రదేశంలో మాసంగతి మీకు చెపుతాము అన్నవి. భోజనానంతరము రాజు భార్యతో

మంత్రితో జలగృహములో కూర్చున్న తరవాత హంసలు వచ్చినవి. రాజు వాటిని పూజించి మీవృత్తాంతము చెప్పండి అని కోరగా అవి ఇలాచెప్పినవి:

మందర పర్వతముమీద ఒకసారి మహాదేవుడు విహారముచేసి పార్వతిని వదిలిపెట్టి దేవకార్యముసాధించడానికి చప్పున అంతర్ధానము పొందినాడు. పార్వతీదేవి ఈశ్వరవియోగము భరించలేక పర్వతము మీద ఆయన క్రీడాప్రదేశా లన్నీ తిరిగి చూచింది. దేవతలామెను ఓదార్చినారు. ఇంతలో వసంతఋతువు వచ్చింది. ప్రమథగణ పరి వేష్టితురాలై పార్వతీదేవి వృక్షముక్రింద కూచొని ఈశ్వరధ్యానము చేస్తున్నది. జయకూతురు చంద్రలేఖ అనేకన్య అమ్మవారికి వింజామరతో విసురుతున్నది. మణిపుష్పేశ్వరు డనే గణోత్తముడు ఆమెను సాభి లాషంగా చూసినాడు. పింగేశ్వర గుహేశ్వర ప్రమథులు ఒకరిమొహం ఒకరు చూసి నవ్వుకొన్నారు. నిష్కారణంగా ఎందుకు వీళ్లు నవ్వు తున్నారు అని పార్వతీదేవి విసుగుతో ఇటూ అటూ చూసింది. చంద్రలేఖ, మణిపుష్పేశ్వరుడు నవ్వుముఖాలతో పరస్పరాలోకనము చేస్తున్నారు. విరహములో వివశురాలైన అమ్మవారు కోపించి 'మహా ప్రభువు ఎదట లేనప్పుడు ఈ కామాంధులు మన్మథప్రేక్షణకం ఆడారు. ఈఅవినయానికి మానవజాతిలోపడి భార్యాభర్తలై పోవాలి! నవ్వినవీళ్ళి ద్దరూ చాలాసుఖా లనుభవిస్తూ మొదట బ్రాహ్మలు, తరవాత బ్రహ్మరాక్షసులు, తరవాత పిశాచాలు, చోరులు, తోక తెగిన కుక్కలు, నానావిధపక్షులు అయిపోతారు. వీళ్లు స్వస్థచిత్తులై ఉండికూడా అప రాధం చేసినందుకు ఇది శిక్ష' అని శపించింది. ధూర్జటుడనే ప్రమథుడు 'దేవీ, చాలా అన్యాయము. స్వల్పదోషానికి ఈగణోత్తములకు ఇంత ఘోరశాపము ఇవ్వడం తగదు' అన్నాడు. దేవి అతన్నికూడా మాన వుడై పుట్టమని శపించింది. అప్పుడు ప్రతిహారి జయ అమ్మవారిపాదాల

మీద వ్రాలి 'తల్లీ రక్షించు. నాకుమార్తెకు శాపాంతము అనుగ్రహించు. అజ్ఞానవశాన అపరాధం చేసిన ఈకింకరులనుకూడా అనుగ్రహించు' అని ప్రార్థించింది. అమ్మవారు శాంతించి జ్ఞానం కలిగి క్రమంగా వీళ్ళంతా ఒకచోట కలుసుకొని బ్రహ్మాదుల తపఃక్షేత్రములో సిద్ధీశ్వర దర్శనము చేసి శాపము తీరి మళ్ళీ నాసన్నిధానానికి వస్తారు. మానవ జన్మమెత్తి ఈచంద్రరేఖ, దీని భర్త సుఖము అనుభవిస్తారు. పింగేశ్వరుడు, గుహేశ్వరుడు మాత్రం కష్టాలనుభవిస్తారు' అని సెలవిచ్చింది.

మహేశ్వరుడు అంధకుని సంహారించి తిరిగి వచ్చినాడు. దేవిచాలా ఆనందించి ప్రసంగవశాత్తు అంధకుడు రావడాన్నిగురించి చెప్పింది. 'దేవీ, వాడు నీమానసపుత్రుడు. వానిని ఇప్పుడే సంహారించి వచ్చాను. తోలు ఎముకలుమాత్రం మిగిలి భృంగి అనే పేరతో ఉంటాడు' అని ఈశ్వరుడు చెప్పినాడు.

మణిపుష్పేశ్వరాదులు అయిదుగురు భూలోకంలో అవతరించారు. రాజా, అందులో పింగళేశ్వర గుహేశ్వరుల చిత్రకథ ముందుగా చెపుతాను.

యజ్ఞస్థల మనేఅగ్రహారములో యజ్ఞసోము డనేధనికబ్రాహ్మడికి నడివయస్సులో ఇద్దరుకొడుకులు కలిగినారు. పెద్దవాడు హరసోముడు, రెండవవాడు దేవసోముడు. ఆపిల్లలు పెరిగి ఉపనయనము కాగానే ఆబ్రాహ్మడికి ఉన్నధన మంతా ఎలాగో పోయింది. తరవాత భార్య పోయింది. తరవాత అతనే పోయినాడు. ఆబాలకులు దిక్కు లేకుండా ఉంటే దాయాదులు వాళ్ళఅగ్రహారం అపహరించారు. కుర్రవాళ్ళు భిక్షాటనము తప్పదనుకొని అయినా మాతామహునిఇంటికి పోదా మని బయలుదేరి క్రమేణా తాతగారిఅగ్రహారానికి వెళ్ళేసరికి తాత, అతని భార్య చనిపోయినా రని తెలిసింది. మేనమామలు యజ్ఞదేవ, క్రతుదేవులు చాలా మంచివారు. ఈబాలకులకు కావలసిన వన్నీ ఇచ్చి

ఆదరించారు. కొన్నాళ్ళకు మేనమామలనుకూడా పేదరికం పట్టుకొన్నది. నౌకరులంతా వెళ్ళిపోయినారు. పశువులు కాచేవాళ్ళు లేకపోవడంచేత మేనళ్ళుళ్ళనే వాళ్ళు ఆపనికి నియోగించారు. ఆ బాలకులు ప్రతిదినము పశువులను అడవికి తోలుకొనిపోయి మేపి సాయంకాలము అలిసి ఇంటికి వచ్చేవాళ్ళు. వాళ్ళు ఇలా పశువులను కాస్తూ ఉంటే దేవిశాపమువల్ల ఒకానాడు పులి ఒక ఆవు నెత్తుకు పోయేది, ఒకనాడు దొంగలు ఒక జంతువును ఎత్తుకొనిపోయేవారు. మేనమామలు దిగులుపడ్డారు.

ఒకనాడు యజ్ఞార్థము ఉంచుకొన్న పాడిఆవు, మేక తప్పించుకు పోయినవి. ఆ బాలకులు కంగారుపడి మిగిలినపశువులను పెందరాళ్ళే ఇంటికి తోలుకొని వచ్చి పోయినవాటిని వెతుకుతూ అడవిలో కొంత దూరం వెళ్ళారు. పులి తిని సగం విడిచిపెట్టిన మేకకళేబరం వాళ్ళకు కనబడ్డది. వాళ్ళు ఏడ్చి ఈ మేక యజ్ఞానికి మేనమామ అట్టేపెట్టుకొన్నాడు. ఇది పోయినట్టు తెలిస్తే మామకు కోపం వస్తుంది. ఈ మిగిలినమాంసం వండుకు తిని ఎక్కడికేనా వెళ్ళిపోయి భిక్షాటనము చేసి జీవింతాము అనుకొని వాళ్ళు నిప్పు చేసి మేకను కాల్చుకొంటూ ఉండగా వెనుకనుంచి మేనమామలు వచ్చిచూచారు. బాలకులు భయపడి పరుగెట్టారు. మీరు రాక్షసులు చేసేపని చేశారు. బ్రహ్మరాక్షసులైపొండి అని వాళ్లు శాపం పెట్టారు. బ్రాహ్మణకుమారులు వెంటనే బ్రహ్మరాక్షసులై నోటినిండా కోరలు ధగధగలాడే తలవెంట్రుకలు భయంకరాకారాలు పొంది ఆ అడివిలో జంతువులమీద పడి తింటూ తిరగడం మొదలు పెట్టారు.

వాళ్ళు ఒకనాడు యోగనిష్ఠలో ఉన్న బ్రాహ్మణఋషిని మింగబోయి అతనివల్ల శాపము పొంది పిశాచాలైనారు. తరవాత కొన్నాళ్ళకు బ్రాహ్మణునిగోవును అపహరించబోయి శాపమువల్ల చండాలులైనారు. విల్లమ్ములు ధరించి ఒకసారి దొంగలకూడెముకు వెళ్ళితే చోరులు

వీళ్ళను పట్టుకొని ముక్కు చెవులు కోసి తమనాయకుని దగ్గరకు తీసుకొని వెళ్ళారు. నాయకుడు అడిగితే వీరిదట తమవృత్తాంత మంతా వివరించి చెప్పారు. నాయకుడు మీ కేమీ భయము లేదు. మాతో కలిసి ఉండండి. ఇవాళ అష్టమి. కుమారస్వామివారి జాతరరోజు. మీరు మాకు అతిథు లని ఆదరించి స్వామిపూజ అయినతరువాత వాళ్ళకు మంచిగా భోజనాలు పెట్టించి ఎక్కడికీ వెళ్ళనీక తమదండులోనే వాళ్ళను కలుపుకొన్నాడు. క్రమేణా వాళ్ళతో కలిసి చోరవృత్తిలో ఆరితేరి చివరకు మహాదొంగలైనారు. తరువాత కొన్నాళ్ళకు శివ క్షేత్రము ఉన్న పట్టణము దోచుకోవడానికి తమముఠాలతో బయలు దేరారు. అపశకునాలు అవుతూంటే లక్ష్యం చేయలేదు. దేవా లయాలతో సహా ఆ పట్టణముకూడా కొల్లగొట్టారు. పౌరులు మహేశ్వరుని ఆశ్రయించారు. వెంటనే దొంగ లందరూ వికలాంగులూ అంధులూ అయినారు. చోరులకు ఆకస్మికంగా కలిగిన ఉపద్రవము శివాజ్ఞవల్ల అని ప్రజలు ధైర్యము తెచ్చుకొని వాళ్ళను చావగొట్టినారు. ముఠానాయకులను కనిపెట్టి ప్రజలు చంపుదా మనుకొనేసరికి ఇద్దరూ తోక తెగిన కుక్కలైనారు.

పూర్వజన్మ జ్ఞానము కలిగి ఆకుక్కలు శివసాన్నిధ్యంలో నిర్భయ ముగా నృత్యము చేస్తూ ఉన్నవి. జనులు చూసి ఆశ్చర్యపడి వెళ్ళినారు. శాపము తీరడానికి కుక్కలు నిరాహార దీక్ష పూని అక్కడే తపస్సు ప్రారంభించినవి. పౌరులు వచ్చి కుక్కలను పూజించి ఆహారము తెచ్చి పెట్టారు. అవి తినలేదు. కొన్ని రోజులు ఆశునకములు నిరహార దీక్షతో తపస్సు చేయడము చూచి ప్రమథులు మహేశ్వరునితో దేవా, పింగళే శ్వర మహేశ్వరులు బహుకాలము కష్టాలనుభవించి ఇప్పుడు శునకాలై నారు. వీళ్ళను అనుగ్రహించ వలె అని విన్నవించారు. కుక్కజన్మపోయి వారు కాకులై బలులు పెట్టిన అన్నం తింటూ ప్రథమజన్మ జ్ఞానము

కలిగి శివధ్యానం చేస్తూ ఉన్నారు. కాలక్రమేణా మహేశ్వరుని అనుగ్రహమువల్ల వాళ్ళు మొదట భాసములు (కోళ్ళు) అయి తరువాత నెమళ్ళై అనంతరము హంసలు అయి తీర్థస్నాన ప్రతిధ్యానాదులు చేసి మహేశ్వరుని భక్తితో ఆరాధించి బంగారు హంసలు అయి జ్ఞానులైనారు. పింగళేశ్వర గుహేశ్వరులము మేమే. జయకుమార్తె చంద్రలేఖను వలచి శాపము పొందిన మణిపుష్పేశ్వరుడవు నీవే. జయపుత్రిక నీభార్య సోమప్రభ. ఆధూర్జటుడే నీమంత్రి శివభూతి. అంబికా దేవి అనుగ్రహించిన శాపావసానం స్మరించి రాత్రి స్వప్నములో నీకు కనిపించాము. ఈవిధముగా మనమంతా ఇక్కడ కలుసుకొన్నాము. మీకు జ్ఞానోపదేశం చేస్తాము. లేవండి మేరుపర్వతముమీద సిద్ధీశ్వరశివక్షేత్రానికి వెళదాము. అక్కడనే పూర్వము విద్యుద్ధ్వజుని వినాశార్థము దేవతలు తపస్సు చేశారు. ఆతపస్సుకు మెచ్చి శివుడు అనుగ్రహించిన విద్యాధర చక్రవర్తి ముక్తాఫలకేతువు తోడ్పాటుతో విద్యుద్ధ్వజుని సంహారము జరిగింది. ముక్తాఫలకేతువు శాపమువల్ల తనకు వచ్చిన మనుష్యజన్మ దాటి శివానుగ్రహమువల్ల మళ్ళీ పద్మావతీదేవిని కలుసుకొన్నాడు. అటువంటి పుణ్యక్షేత్రానికి వెళ్ళి శివార్చన చేసి యథాస్థానానికి వెళ్ళిపోదాము. అమ్మవారు కూడా ఈవిధానమే ఆదేశించిందికదా!

## తరంగము : ౧౧౬

ఆ దివ్యహంసలు చెప్పిన మాటలకు బ్రహ్మదత్తుడు కుతూహలము పొంది హంసలతో 'ముక్తాఫలకేతువు విద్యుద్ధ్వజుని ఎలా సంహరించాడు? మానవజన్మ తరించి పద్మావతిని ఎలా కలుసుకొన్నాడు? ముందు ఈ సంగతులు చెప్పండి. తరవాత అసలు సంగతి చూతాము' అన్నాడు. హంసలు ఈప్రకారముగా చెప్పినవి.

## మహాస్త్రాఫల కేతువు కథ

విద్యుత్ప్రభు డనే దైత్యరాజు పుత్రవాంఛతో గంగాతీరాన భార్య తోకూడా నూరేళ్ళు తపస్సుచేసి దేవతలు జయించలేని కుమారుణ్ణి పొందినాడు. ఆపుత్రవానికి విద్యుద్ధ్వజు డని పేరు పెట్టినాడు. వాడు చిన్నతనములోనే మహాబలవంతుడై ఒకనాడు నగరానికి నలుపక్కలా భటులు కాపలా ఉండడం చూచి తన ప్రక్కన ఉన్న మిత్రునితో 'మిత్రమా! ఎందుకు ఈనగరాన్ని వీరభటులు కావలి కాస్తున్నారు? ఎవరివల్ల భయము?' అన్నాడు. 'దేవేంద్రుడు మనకు శత్రువు. అందుకని ఈనగరమును పదిలక్షల ఏనుగులు, పదినాలుగులక్షల రథములు ముప్పైలక్షల గుర్రాలు పదికోట్ల భటులు సంరక్షిస్తుంటారు. ఘూముకు ఒకమాటువంతు ఈవేళవచ్చినవంతు మళ్ళీ ఏడేళ్ళకువస్తుంది' అన్నాడు మిత్రుడు.

'ఇదేమి రాజ్యము! స్వబాహుబలమువల్ల రక్షించాలి కాని యింత కావలా ఏమిటి! నేను తపస్సుచేసి శత్రువులను అందరినీ గెలిచి ఈ అపఖ్యాతి పోగొట్టుతాను' అని విద్యుద్ధ్వజుడు తల్లిదండ్రులకు చెప్పకుండా మిత్రులు వద్దంటున్నా తపోవనానికి వెళ్ళినాడు. తరవాత జననీజనకులు ఈసంగతి తెలిసికొని వెళ్ళి అరణ్యములో అతనిని కలుసుకొని 'నాయనా, చిన్నవాడవు సాహసించకు తపస్సు చేయడం అంటే మాటలా! మనకు శత్రుభయము లేదు. త్రిలోకాలలో మనకు కావలసిం దేమీ లేదు. నీవు వృథాశ్రమపడి మమ్మల్ని ఎందుకు బాధపెడతావు?' అని బోధించారు. 'మనకు శత్రుభయము ఉన్నదని కాదు; చిన్నతనములోనే తపోబలంవల్ల దివ్యాస్త్రాలు సాధిస్తాను' అని తల్లిదండ్రులను వెనక్కు పంపించి బ్రహ్మను గురించి తపస్సు చెయ్యడం మొదలు పెట్టినాడు. ఫలభక్షణము చేసి మూడువందల సంవత్సరములు, జలపానము చేసి మూడువందలు, వాయుభక్షణ చేసి మూడువందలు, నిరాహారముగా

మూడువందల సంవత్సరములు విద్యుద్ధ్వజుడు తపస్సు చేశాడు. జగత్తు అల్లల్లాడించే ఆతపస్సు చూచి బ్రహ్మ వచ్చి బ్రహ్మాస్త్రాదులు అతనికి అనుగ్రహించి 'ఇది బ్రహ్మాస్త్రము. మాకెవరికీ అందుబాటులో లేని మహేశ్వరుని పాశుపతాస్త్రానికి తప్ప మరిదేనికీ ఇది లొంగదు. జయము కోరినట్టయితే దీనిని నీవు అకాలములో ప్రయోగించకూడదు' అని ఆదేశించి వెళ్ళిపోయినాడు. బాలుడు ఇంటికి మరలి వచ్చినాడు. ఉత్స వానికి వచ్చిన సైన్యములను వెంటబెట్టుకొని తండ్రితో సహా విద్యుద్ధ్వజుడు ఇంద్రుని మీదికి బయలుదేరినాడు. ఇంద్రుడు ఈసంగతి తెలుసుకొని అమరావతికి తగిన రక్షకులను నియమించి తనమిత్రులైన విద్యాధరాధీశ్వర చంద్రకేతును గంధర్వాధీశ్వర పద్మశేఖరుని లోకపాలకులను దేవతలను వెంటబెట్టుకొని యుద్ధానికి వచ్చినాడు.

దైత్యబాలుడు క్రమంగా వచ్చి ఇంద్రునితో తలపడ్డాడు. ఉభయ సైన్యాలకు ఘోరయుద్ధం ఆరంభమయింది. దేవాసురులకు ద్వంద్వ యుద్ధం ప్రారంభ మయింది. ఇంద్రునిమీదికి విద్యుద్ధ్వజుడు వచ్చినాడు. కొంతసేపు పోరాడి ఇంద్రుడు వజ్రాయుధముతో దైత్యుని ఖండించి నాడు. విద్యుద్ధ్వజుడు కోపముతో అసమయములో బ్రహ్మాస్త్రము ఇంద్రునిపైన ప్రయోగించినాడు. ఇంద్రుడు పాశుపతాస్త్రమును ధ్యానించి, అదివచ్చి ఎదుటనిలవగా దానినిపూజించి శత్రుసైన్యముమీద విసిరినాడు. పాశుపతాస్త్రఅగ్నికి అసురసైన్యము లన్నీ భగ్గున మండి పోయినవి. విద్యుద్ధ్వజుడు మాత్రము దాని వేడికి సొమ్మసిల్లి పడిపోయి నాడు. పాశుపతము పారిపోయే వాళ్ళను బాలకులను సంహరించదు. దేవతలకు విజయము లభించింది.

విద్యుద్ధ్వజుడు కొంత సేపటికి మూర్ఛదేరి విచారపడుతూ పారిపోయి వచ్చికలుసుకున్న సైనికులతో "వీరులారా, మనము జయించి, చివరలో ఓడిపోయినాము. బ్రహ్మాస్త్రము సాధించికూడా పరాజయము పొంది

నాము. ఇక జీవించి ఉండడం ఎందుకు? పోయి ఇంద్రునితో యుద్ధము చేసి ప్రాణాలు విడుస్తాను. మానాయన పోయినతరవాత ఇంకా ఆరాజధానికి ఎందుకు నేవెళ్ళడం?'' అన్నాడు. వృద్ధమంత్రి బాలునితో 'నీబ్రహ్మాస్త్రము ప్రాణభయము లేకుండానే అకాలములో ప్రయోగించావు. అందుచేత దానిశక్తి మందగించింది. పాశుపతాస్త్రము దాన్ని అణిచివేసింది. జయము పొందిన శత్రువుతో అసమయంలో తలపడడం తగదు. అటువంటివేళ అతనికి జయమూ, మనకు నాశమూ కలుగుతేది. ధీరుడు తరుణము కనిపెట్టి శక్తి సమకూర్చుకొని శత్రువును జయించి కీర్తి పొందాలి, అని హితోపదేశము చేసినాడు. 'అయితే మీరు వెళ్ళి రాజ్యం సంరక్షించండి. నేను పోయి శివుని ఆరాధిస్తాను' అని విద్యుద్ధ్వజుడు వాళ్ళను బలవంతాన వెనకకు పంపి ఐదుగురు దైత్యకుమారులను మాత్రము వెంటపెట్టుకొని పోయి కైలాసమూలములో గంగా తీరాన తపస్సు చేసినాడు. వేసవికాలములో పంచాగ్ని హోత్రమధ్యంలోను, చలికాలములో నీళ్ళలోను, శివుని ధ్యానిస్తూ ఫలభక్షణతో వెయ్యిసంవత్సరాలు, కందమూలములు తింటూ వెయ్యిసంవత్సరాలు జలపానము చేస్తూ వెయ్యిసంవత్సరాలు, నిరాహారముగా వెయ్యిసంవత్సరాలు తపస్సు చేసినాడు. బ్రహ్మ వచ్చి నీ కేమి వరము కావాలి' అని అడిగినాడు. 'నీవరప్రభావం నాకు తెలుసు. చాలు! పదు' అని బాలుడు మళ్ళీ అన్నిసంవత్సరాలు నిరాహారదీక్షతో తపస్సు చేసినాడు. అతనిశిరస్సులోనుంచి ధూమము బయలుదేరింది. అప్పుడు మహేశ్వరుడు వచ్చి నీ కేమికావాలి అని అడిగినాడు. 'దేవా, నీఅనుగ్రహమువల్ల యుద్ధములో ఇంద్రుని సంహరించవలెను. అని వరము వేడినాడు. 'లే. చనిపోయినవానికీ ఓడినవానికీ భేదము లేదు. కాబట్టి ఇంద్రుని నీవు ఓడిస్తావు. అతనిపదవి నీకులభిస్తుంది.' అని అనుగ్రహించి అంతర్ధానము పొందినాడు. దైత్యుడు సంతోషించి భోజనముచేసి రాజధానికివేరాడు.

పౌరులూ, వృద్ధమంత్రీ ఎదురు వచ్చి అతనిని ఆదరించి తీసుకువెళ్ళి ఉత్సవం చేసినారు. అక్కడికి వచ్చిన అసురసైన్యా లన్నిటినీ యుద్ధానికి సిద్ధముచేసి, నీమీదికి వస్తున్నాము అని ఇంద్రునిదగ్గిరికి దూతను పంపి విద్యాధర్రాజుడు బయలుదేరినాడు. ఇంద్రుడు కొంచెము బెదిరి బృహస్పతితో ఆలోచించి దేవసైన్యాలను రప్పించినాడు. ఇంతలో శత్రుసైన్యము వచ్చిపడ్డది. ఎవరు ఏపక్షమువారో గ్రహించలేనంత సంకుల సమరం జరిగింది. సుబాహువు మొదలయినదైత్యులు వాయువులతోను, పింగాక్షాదులు కులభేరులతోను, మహామాయాదులుఅగ్నులతోను, అయఃకాయాదులు సూర్యులతోను, ఆకంపనాదులు సిద్ధులతోను కొందరు దైత్యాధిపతులు విద్యాధరులతోను మరికొందరు గంధర్వులతోను ద్వంద్వయుద్ధము ప్రారంభించినారు. ఈవిధముగా ఇరవైరోజులు ఘోరయుద్ధము జరిగింది. ఇరవైఒకటవనాడు దేవతలు వెనకకు తగ్గి స్వర్గానికి పరుగెత్తినారు. ఇంద్రుడు ఐరావతం ఎక్కి స్వయముగా పోరాటానికి బయలుదేరినాడు. అతనిచుట్టూ కొంతసైన్యమూ, చంద్రకేతు మొదలయినవిద్యాధరప్రభువులు నడిచినారు. విద్యాధర్రాజునివిల్లు ఇంద్రుడు బహుపర్యాయములు బాణాలతో తెగకొట్టినాడు. వాడు ఇనపగద తీసుకొని ఐరావతముదంతాలమీదకాళ్ళు ఉంచి కుంభస్థలము మీదికి ఎక్కి ఎక్కి మావటివానిని సంహరించినాడు. ఇంద్రుడు ఇనుపగదమీద ముసలముతో కొట్టినాడు. దైత్యుడు రెండవపర్యాయము విసిరినప్పుడు గద తగిలి ఇంద్రుడు మూర్ఛపోయి వాయుదేవునిరథములో పడిపోయినాడు. ఇది సమయము కాదు. యుద్ధక్షేత్రములోనుంచి ఇంద్రుని వెంటనే దూరముగా తీసుకొనిపొండి' అని ఆకాశవాణి పలికింది. వాయుదేవుడు ఇంద్రుని తీసుకొని పోతూఉంటే దైత్యుడు వెంటపడ్డాడు. ఐరావతము తన కడ్డవడ్డ భటుల నందరినీ తొక్కివేసి ఇంద్రునిదగ్గిరికి వెళ్ళింది. దేవతలు యుద్ధము మానివేసి ఇంద్రునివెంట వెళ్ళినారు.

బృహస్పతి శచీదేవిని బ్రహ్మదేవునిఇంట్లో ఉంచినాడు. దైత్యుడు విజయము పొంది, దేవతలు విడిచిపోయిన అమరావతిలో సైన్యములతో ప్రవేశించినాడు.

ఇంద్రుడు మూర్ఛతేరి దేవతలతో కలిసి బ్రహ్మమందిరానికి వెళ్ళినాడు. బ్రహ్మ అతనిని ఓదార్చి, విచారపడకు, శివవరప్రభావమువల్ల వాడు గెలిచాడు. నీపదవి మళ్ళీ నీకు లభిస్తుంది అని, బ్రహ్మలోకములో సమాధిస్థలమనే ప్రదేశములో అన్ని వసతులూ ఉన్న నివాసము ఏర్పాటు చేసినాడు. దేవేంద్రుడు శచీదేవితోను ఐరావతముతోను అక్కడే ఉంటున్నాడు. ఇంద్రుని ఆజ్ఞాప్రకారము విద్యాధరప్రభువులు వాయులోకానికి, గంధర్వనాయకులు సోమలోకానికి, తక్కినవారు ఇతరలోకాలకూ వెళ్ళినారు. విద్యుద్ధ్వజుడు దేవభూము లన్నిటిలో తన విజయము చాటించి అడ్డులేకుండా రాజ్యము చేయడం మొదలు పెట్టినాడు.

చంద్రకేతువు వాయులోకంలో చాలాకాలము ఉండి విసిగి ఈవిధముగా ఆలోచించినాడు: 'నాపదవి కోలుపోయి ఎన్నాళ్ళు ఇక్కడ ఉండను! విద్యుద్ధ్వజునితపస్సు ఇంకా క్షయము కాలేదు. నామిత్రుడు గంధర్వరాజు పద్మశేఖరుడు సోమలోకంనుంచి తపస్సుకోసము శివపురము వెళ్ళినట్లు విన్నాను. అతనిని పరమేశ్వరుడు అనుగ్రహించినాడో లేదో తెలియదు. ముందు ఆసంగతి తెలిస్తే తరవాత కర్తవ్యము ఊహిస్తాను; ఇలా అనుకొంటూ ఉండగా అతనిదగ్గిరికి శివునివరము పొందినగంధర్వరాజు వచ్చినాడు. చంద్రకేతువు మిత్రుని కౌగిలించుకొని స్వాగతము పలికి విశేషా లేమి టని అడిగినాడు. గంధర్వరాజు మిత్రునితో 'నేను శివపురం వెళ్ళి తపస్సు చేశాను. శివుడు సుప్రీతుడై నన్ను అనుగ్రహించినాడు. నీకు ఉత్తమపుత్రుడు కలుగుతాడు. మళ్ళీ రాజ్యము లభిస్తుంది. విద్యుద్ధ్వజాంతకునికి సర్వోత్తమురాలైన కన్య కలుగుతుంది అని నాకు వరము లిచ్చినాడు. ఈవృత్తాంతము నీకు తెలుపుదా మనే ఇక్కడికి వచ్చాను.'

‘ఈదుస్థితి తొలిగేందుకు మహేశ్వరారాధన చెయ్యబోతున్నాను. శివపూజ చెయ్యకుండా కోరికలు సిద్ధిస్తవా!’ అని చంద్రశేఖరుడు భార్య ముక్తావళిని తీసుకొని తపస్సుకోసం ఆదివ్యక్షేత్రం వెళ్ళినాడు. పద్మశేఖరుడు ఇంద్రునికి ఈవృత్తాంతము విన్నవించి సోమలోకానికి వెళ్ళినాడు. సమాధిస్థలములో ఉన్న ఇంద్రుడు శత్రువు నశించిపోతాడని నమ్మకం కలిగి బృహస్పతిని స్మరించినాడు. ఆయన రాగానే ఇంద్రుడు ఆయనకు నమస్కరించి సత్కారాలు చేసి, ‘గురుదేవా, పద్మశేఖరుని తపస్సుకు సంప్రీతుడై శివుడు దైత్యుని సంహరించేవాడు పుట్టుతాడని వరమిచ్చినాడు. మనకష్టాలు తీరిపోయినట్టే. కాని బహుకాలము ఇక్కడ ఉన్నాను. ఏమీ తోచటం లేదు. త్వరలో పని నెరవేరేటట్టు ఉపాయం ఆలోచించండి’ అని ప్రార్థించినాడు. ‘దైత్యుడు చేసేదుష్కార్యాలవల్ల వానితపస్సు క్షయమయ్యేరోజు వచ్చింది. మనము జాగ్రత్తగా ఉండవలసినసమయము ఇది. బ్రహ్మదేవునిసన్నిధికే వెళ్ళి ఆయననే ఉపాయం అడుగుదాము’ అన్నాడు బృహస్పతి. తరవాత ఉభయులు బ్రహ్మసన్నిధికివెళ్ళి సంగతులు విన్నవించారు. ‘నాకుమాత్రం ఈ విచారం లేదనుకొన్నారా? మహేశ్వరుడు ఇచ్చినదానిని తప్పించడానికి ఎవరితరమూ కాదు. ఇప్పుడు శ్రీహరిదగ్గరికి పోదాము. ఆయన ఉపాయము చెపుతాడు’ అన్నాడు చతుర్ముఖుడు.

బ్రహ్మేంద్రబృహస్పతులు హంసయానములో శ్వేతద్వీపానికి వెళ్ళినారు. అక్కడిజను లంతా చతుర్భుజులై, శంఖచక్రగదాధరులై బాహ్యాకారములోనే కాక అంతరంగములోకూడా భగవన్మయులై ఉంటారు. మణిగృహములో శేషశయనముమీద శ్రీహరి పవ్వళించి ఉన్నాడు. లక్ష్మి ఆయనపాదాలు మెల్లిగా ఒత్తుతున్నది. భగవంతుడు కుశల మడిగినమీదట వారు ‘దేవా, విద్యుద్ధ్వజుడుండగా మాకు కుశలమెక్కడిది! వాడు చేసేఅపకారాలు, పెట్టేబాధలు దేవరవారికి తెలిసినవే. ఆ సంగ

కలును నష్టపించడానికే ఇప్పుడు వచ్చాము. పిరనాలీ 'దేవచరిత్రము' అని విజ్ఞాపన చేశారు. శ్రీహరి అందుకు ఇలా సెలవిచ్చినాడు: 'తెలుసును. నే నేమీ చేయడానికి వీలు లేదు. త్రిపురాంతకునివల్లనే ఆపాపాత్ముడికి వినాశనము కలుగుతుంది. త్వరలో కార్యసిద్ధి కావలె నంటే ఒకమార్గమా ఉన్నది. సిద్ధీశ్వర మనేశివక్షేత్రములో శివుడు నిరంతరము సుగముడై ఉంటాడు. మహేశ్వరుడు పూర్వము మాకూ ఆనాటి బ్రహ్మకు జ్వాలాలింగరూపము చూపించి ఈరహస్యము అనుగ్రహించినాడు. కాబట్టి అందరమూపోయి మహేశ్వరునే ప్రార్థించి లోకోపద్రవము తొలగింతాము.'

అందరూ బయలుదేరి సిద్ధీశ్వరానికి వెళ్ళినారు. అక్కడ జరామరణ రోగాలు లేవు, ఎప్పుడూ సౌఖ్యమే. అక్కడి మృగాలు, పిట్టలు, చెట్లు, సుఖ్యసంతోషయుతాలు. అటువంటి క్షేత్రములో ఒక్కొక్కరికి క్షణక్షణానికీ వేరువేరు రూపాలతో కనపడుతున్న మహేశ్వరుని వివిధ మణిబింబాలతో పూజించి ఏకధ్యానములో హరి, బ్రహ్మ, ఇంద్ర బృహస్పతులు తపస్సు చేసినారు.

ఇంతలోగా చంద్రకేతు చేసిన తపస్సుకు సంప్రీతుడై మహేశ్వరుడు 'రాజా, ఇకలే. నీకు మహావీరుడైన పుత్రుడు పుట్టి దైత్యుణ్ణి సంహరిస్తాడు. శాపవశాన మానవలోకములో పుట్టి దేవకార్యము సాధించి గంధర్వరాజు కుమార్తె పద్మావతీదేవి చేసిన తపోబలమువల్ల మళ్ళీ తన పదవిని పొంది ఆమె భార్యగా లభించిన మీదట విద్యాధర సామ్రాజ్యం పదికల్పాలపాటు అనుభవిస్తాడు' అని వరమిచ్చినాడు. చంద్రకేతు భార్యతోసహా వాయులోకానికి వెళ్ళిపోయినాడు.

పరమేశ్వరుడు సంతృప్తి చెంది లింగరూపములో కనపడి హరి బ్రహ్మాదులతో 'లేవండి విద్యాధర చంద్రకేతువు చేసిన తపస్సుకు సంప్రీతి చెందినాను. నాఅంశాన అతనికి మహావీరుడైన కుమారుడు కలుగు

తాడు. త్వరలోనే వాడు యుద్ధములో విద్యాధరరాజుని సంహరిస్తాడు. తరవాత దేవకార్యము సాధించడానికే మానవజన్మ ఎత్తుతాడు. పద్మశేఖరగంధర్వుని కూతురు పద్మావతి అతనిని ఉద్ధరిస్తుంది. గౌరీదేవి అంశాంశ పుట్టిన పద్మావతిని వాడు వివాహము చేసుకొని విద్యాధర సామ్రాజ్యము పరిపాలించి నన్ను కలుసుకొంటాడు. కాబట్టి మీరంతా ఓపిక పట్టండి. మీ కోరిక ఈడేరినట్టే' అని వివరించి అంతర్ధానమైనాడు. అంతట సంతోషించి హరిబ్రహ్మాదులు నిజనివాసాలకు వెళ్ళిపోయినారు.

ఇంతలో చంద్రకేతు భార్య ముక్తావళి పుత్రుని కన్నది. బిడ్డను పుట్టగానే ఆకాశవాణి 'చంద్రకేతూ, నీకుమారుడు విద్యాధరరాజుని సంహరిస్తాడు. వీనికి ముక్తాఫలకేతువు అని పేరు పెట్టు' అని పలికింది. దేవలోకంనుంచి పుష్పవృష్టి కురిసింది. వృత్తాంతము తెలిసిన పద్మశేఖరుడు ఇంద్రుడు తక్కిన దేవతలు అక్కడికి వచ్చి మహేశ్వరుని అనుగ్రహానికి ఆనందించి ఉత్సవం చేసి యథాస్థానాలకు వెళ్ళినారు. ముక్తాఫలకేతుడు వర్ధిల్లుతున్నాడు.

పద్మశేఖరునికి పుత్రిక పుట్టినప్పుడు ఆకాశవాణి 'గంధర్వరాజా, నీబిడ్డకు పద్మావతి అని నామధేయము. విద్యాధరరాజుని సంహరించే విద్యాధర చక్రవర్తికీమె భార్య అవుతుంది' అని పలికింది. పద్మావతి క్రమేణా పెరుగుతున్నది. ముక్తాఫలకేతువు బాలుడైనా నిరంతరము శివధ్యానము చేస్తూ వ్రతోపవాసాదులు అవలంబించి తపస్సు చేస్తున్నాడు.

ఆబాలుడు ఒకసారి పన్నెండు రోజులు ఉపవాసముచేసి ధ్యాననిష్ఠలో ఉండగా శివుడు ప్రత్యక్షమయి 'వత్సా, నీభక్తికి మెచ్చినాను. నా అనుగ్రహమువల్ల నీకు సకలాస్త్రములు, సమస్తవిద్యలు, అన్నికళలు అవిర్భవిస్తవి. అపరాజితము అనే ఈ ఖడ్గము తీసుకో. ఇది ఉంటే శత్రువులవల్ల పరాజయము ఉండదు. సామ్రాజ్యము ఏలుతావు' అని ఆనతిచ్చి అంతర్ధానమైనాడు.

ఒకనాడు విద్యుద్ధ్వజుడు ఆకాశగంగలో జలవిహారము చేస్తున్నాడు. ఇంతలో అందులో తరంగాలు బయలుదేరినవి. పచ్చనినీరు ప్రవహించింది. ఏనుగమదము వాసనకొట్టింది. దైత్యుడు సేవకులను పిలిపించి 'ఎవడురా పైభాగాన స్నానము చేస్తున్నాడు. వెళ్ళి చూడిరండి' అని ఆజ్ఞాపించాడు. వాళ్ళు నీటి ఎగువభాగానికి వెళ్ళి చూస్తే మహేశ్వరుని వాహనము వృషభేశ్వరుడు ఇంద్రుని వాహనము ఐరావతము నీళ్ళలో ఈదుతున్నవి. వాళ్ళువచ్చి ఈసంగతి చెప్పి వృషభము మెడలో వ్రేలాడదే పుష్పాదివల్ల నీరు పచ్చబడ్డదనీ ఏనుగు మదము చేత వాసన కొట్టినదనీ విన్నవించినారు. దైత్యుడు మదమువల్ల మహేశ్వరునిసైనికము లెక్కచేయక కోపోద్దీపితుడై ఆఎద్దును ఏనుగును తాళ్ళు పెట్టికట్టి తీసుకొని రమ్మన్నాడు. కొంతమందిభటులు వెళ్ళి వాటిని పట్టుకోబోతే వృషభము ఏనుగు వాళ్ళను తొక్కి చంపినవి. చావగా మిగిలినవారు పరిగెత్తుకు పోయి ఆసంగతి విన్నవించారు. వాడు సైన్యం పంపాడు. దేవతావాహనాలు రెండూ ఆసైన్యాన్ని నాశనము చేసినవి. వృషభము హరునిసన్నిధానానికీ, ఐరావతము ఇంద్రునిదగ్గిరికీ పోయినవి. ఈవిషయములు తెలుసుకొని ఇంద్రుడు సంతోషించి గౌరీనాథుని తిరస్కరించడంచేత దైత్యుడికి వినాశకాలము వచ్చిందని నిశ్చయించి బ్రహ్మకు తెలియజేసి, విద్యాధరగంధర్వప్రముఖులను దేవసైన్యాలను తీసుకొని ఐరావత మెక్కి శచీదేవి విజయమంగళోత్సవము చెయ్యగానే యుద్ధానికి బయలుదేరినాడు.

## తరంగము : ౧౧౭

శివానుగ్రహమువల్ల దేవతాబలాలకు మహోత్సాహం కలిగింది. ఇంద్రుడు స్వర్గాన్ని ముట్టడి వేసినాడు. విద్యుద్ధ్వజుడు సైన్యసమేతముగా బయలుదేరినాడు. అపశకునాలైనా వాడు లక్ష్యము చేయలేదు.

వానికెక్కువ మీఁద పిడుగులు పడ్డవి. గద్దలు పైన గుండ్రముగా తిరిగి నవి. నక్కలు కూతపెట్టినవి. ముక్తాఫలకేతువు ఇంకా రాలేదేమి అని అడిగితే, చంద్రకేతువు 'దేవేంద్రా, నేను తోడుకొని వస్తూ అతనితో చెప్పడము మరచిపోయినాను. అయినా తెలుసుకొని అతనే వస్తాడు సందేహించ నక్కరలేదు' అని బదులు చెప్పినాడు. ఇంద్రుడు ముక్తాఫలకేతువును తీసుకురావడానికి వాయుసారథిని పైన రథము పంపినాడు. చంద్రకేతువు కుమారుని రక్షించడానికి సైన్యముతో సహా ప్రతీహారుల్ని ఆరథమువెంట పంపినాడు. ఇంతలో ముక్తాఫలకేతువుకు యుద్ధవృత్తాంతము తెలిసి జయగజము నెక్కి తల్లి జయమంగళోత్సవము చెయ్యగానే, ఈశ్వరుడు అనుగ్రహించి ఇచ్చిన అపరాజితఖడ్గము చేత పట్టుకొని బయలుదేరినాడు. పుష్పవృష్టి కురిసింది. దేవదుందుభులు మోగినవి. చల్లనిగాలి విసిరింది. వాయులోకమునుంచి ముక్తాఫలకేతువు బయలుదేరి మార్గమధ్యములో మేఘవన మనే పేరు గల గౌరీనిలయము కనబడేసరికి ఏనుగుదిగి దివ్యకుసుమాలు కోసి దేవిని పూజ చేయడము ఆరంభించినాడు.

ఇంతలో గంధర్వపతి పద్మశేఖరునిపుత్రిక పద్మావతి చెలికత్తెతో కూడా తల్లిఅనుజ్ఞ తీసుకొని విమానములో చంద్రలోకమునుంచి బయలుదేరి తనతండ్రికీ, వరునికీ యుద్ధములో జయము కలగడానికి తపస్సు చేసే నిమిత్తము ఆగౌరీమందిరానికే వచ్చింది. 'సఖీ, నీకు వరుడింకా నిశ్చయము కాలేదు. అటువంటప్పుడు యుద్ధములో అతనికి జయమేమిటి? మీనాయన విజయంకోసము మీఅమ్మ తపస్సు చేస్తూనేఉన్నది. నీవు ఎందుకు తపస్సుచేయడం?' అని ప్రయాణములో చెలికత్తె అన్నది.

అందుకు పద్మావతి ఇలా చెప్పింది. 'కులకన్యలకు తండ్రిదైవతము. నావరుడు ఎవరో ఇదివరకే నిశ్చయ మైంది. విద్యుద్ధ్వజుని సంహరించడానికి జన్మించిన ముక్తాఫలకేతువు నాకు భర్త అని మహేశ్వరుడు ఇది

ఇదివరలోనే అనుగ్రహించినాడు. నాయనకీ సేవకుల సంభాషణలో ఈసంగతి తెలిసింది. ముక్తాఫలకేతువు యుద్ధానికి వెళ్ళిఉండవచ్చును. వెళ్ళకపోతే వెళ్ళేప్రయత్నములో ఉండవచ్చును. అందుచేత ఆయనకు, నాయనకు జయము కలిగేటందుకు గౌరీదేవి సమక్షములో తపస్సు చేస్తాను' అన్నది. చెలికత్తె విని 'సరే, జయము తప్పదు అని తెలిసినప్పటికీ నీప్రయత్నం మంచిదే; నీకోరిక నెరవేరుతుంది' అని ఆమోదించింది.

పద్మావతి గౌరీమందిరముపక్కనున్న సరస్సువద్దికి వెళ్ళి విమానమునుంచి దిగి, అమ్మవారిపూజకోసము పద్మములు కోసి స్నానానికి నీళ్ళలోదిగబోతూఉంటే రాక్షసులు కొందరు ఆదోవన పోతున్నారు. అందులో ఇద్దరుస్త్రీలు వచ్చి పద్మావతి నెత్తుకొని ఆకాశానికి ఎగిరినారు. విమానసారథి వాళ్ళను అడ్డగించేలోగానే ఆమెపరిజనము కేకలువేసింది. అప్పుడే దేవీపూజ ముగించి ఇవతలకు వచ్చిన ముక్తాఫలకేతువు కేక విని ఆకాశముకేసి చూసి చప్పున పైకి ఎగిరి చేతిదెబ్బతో ఆ ఇద్దరు రాక్షసస్త్రీలను పడగొట్టి పద్మావతిని విడిపించినాడు. వారు అన్యోన్యము చూచుకొన్నారు. పద్మావతి సిగ్గుతో తలవంచుకొని చెలికత్తెతో 'ఈమహావీరునికి మేలు కలుగుగాక! పరపురుషుని దగ్గరనుంచి వెళ్ళుదాము' అన్నది. ముక్తాఫలకేతువు 'మీసఖి ఏమన్నది' అని చెలికత్తెను అడిగినాడు. 'ఈమె సత్కులీన. ప్రాణదాతకు శుభము కలగవలెనని కోరింది. పరపురుషునిదగ్గర నుంచి వెళుదాము అన్నది' అని చెప్పింది. అతడు సంభ్రమముతో 'ఈ కన్యామణి ఎవరికూతురు? ఏ పుణ్యాత్మునికి ఈమె నిచ్చినారు?' అని మళ్ళీ ప్రశ్న వేసినాడు. 'మహాశయా, ఈమె గంధర్వరాజు పద్మశేఖరునికూతురు పద్మావతి, చంద్రకేతుని కుమారుడు, విద్యుద్ధ్వజసంహారకుడు అయిన ముక్తాఫలకేతువు భర్త అవుతాడని శివాజ్ఞ అయింది. యుద్ధములో తన భర్తకూ తండ్రికీ విజయము కలగాలని గౌరీదేవిసన్నిధానములో ఈమె తపస్సుకు వచ్చింది'

అని చెలికత్తె చెప్పింది. ముక్తాఫలకేతుని అనుచరులు పద్మావతితో 'ఆనందము ఆనందము. దేవి, ఈయనే మీ భర్త' అని విన్నవించారు.

కన్యాకుమారులు మహానందముతో పరస్పరాలోకనము చేస్తూ ఉండగా వాద్యఘోష వినపడ్డది. వెంటనే సైన్యము కనపడ్డది. వాయు సారథిగా దైవ రథము వచ్చింది. దానివెంట చంద్రకేతుని ప్రతీహారుడు వచ్చాడు. వాయు ప్రతీహారు లిద్దరూ వాహనాలు దిగి ముక్తాఫలకేతువును సమీపించి వినయముతో 'మహావీరా, నిన్ను దేవేంద్రుడు ఆహ్వానిస్తున్నాడు. యుద్ధములో మీ నాయన నీకోసము ఎదురు చూస్తున్నాడు. వెంటనే ఈరథమెక్కి బయలుదేరాలి' అని చెప్పినారు. ఇంద్రుడు పంపిన దివ్యకవచము తొడుగుకొని పద్మావతిని తిరిగి తిరిగి చూస్తూ అతడు బయలుదేరినాడు. ప్రాణవల్లభుడు తనకు కనబడేటంత వరకు పద్మావతి అతనిని చూచి, తరవాత స్నానముచేసి పార్వతీపరమేశ్వరులను అర్చించి తండ్రికీ వరునికీ జయముకోరి తపస్సు మొదలుపెట్టింది.

ముక్తాఫలకేతువు పద్మావతిని తలచుకొంటూ యుద్ధరంగము చేరినాడు. ఉభయసైన్యములు పోరుకు తలపడ్డవి. ముక్తాఫలకేతువు శత్రుసైన్యమును చీల్చి చెండాడుతుంటే విద్యుద్ధ్వజుడు కోపోద్దీప్తుడై అతని మీదికి వెళ్ళినాడు. అతడు దైత్యనాయకుణ్ణి నిండుగా బాణవర్షములో ముంచినాడు. అసురసైన్యము ముక్తాఫలుని చుట్టుముట్టింది. ఇంద్రుడు చూచి సిద్ధ, గంధర్వ, విద్యాధర, సుర సైన్యములతో అసురసైన్యాన్ని ఎదుర్కొన్నాడు. ఘోరయుద్ధము జరిగింది. ఇరవైనాలుగు రోజులు నడచిన ఆసమరములో జయలక్ష్మి ఒకమాటు ఇటు, ఒకమాటు అటు ఒరగడం ప్రారంభించింది. ఇరువదిఐదో రోజున రెండు సేనలు పల్చబడ్డవి. ప్రధాననాయకులకు ద్వంద్వయుద్ధము ప్రారంభమయింది. చాలాసేపు శస్త్రాస్త్రప్రయోగాలు జరిగినవి. కొంతసేపు చిత్రయుద్ధము నడచింది. ముక్తాఫలకేతువు చివరకు శత్రువుమీద బ్రహ్మాస్త్రము

ప్రయోగించినాడు. దానితో విద్యుద్ధ్వజుడు సైన్యసహితుడై ఆకాశము నుంచి కిందపడి ప్రాణాలువదలినాడు. అతని కొడుకులు సూత్రకుడు వజ్రదంష్ట్రాదులతో కలిసి పరిగెత్తి పాతాళలోకం ప్రవేశించినారు.

దేవతలు నాందీవాదనము చేసి ముక్తాఫలకేతువు మీద పుష్ప వర్షము కురిపించినారు. ఇంద్రుడు అమరావతీ నగరము ప్రవేశించినాడు. త్రిలోకములలో ఉత్సవములు జరిగినవి. బ్రహ్మ శచీదేవిని తీసుకొని వచ్చి ఆమెచేత ముక్తాఫలకేతువుకు చూడారత్నము కట్టించినాడు. తనమెడలో ఉన్న హారము తీసి దేవేంద్రుడు అతని కంఠాన వేసినాడు. తనపీఠముతో సమానమైన పీఠముపైన అతనిని కూర్చోబెట్టినాడు. ఇంద్రుడు విద్యుద్ధ్వజుని ప్రదేశానికి ప్రతిహారస్త్రీని పంపి దానిని స్వాధీనము చేసుకొన్నాడు. దేవతలందరూ ముక్తాఫలకేతువుకు ఆశీర్వదించారు.

పద్మశేఖరుడు తన పుత్రిక పద్మావతిని ముక్తాఫలకేతువుకు ఈయ దలచి బ్రహ్మదేవునికేసి సాభిప్రాయముగా చూచినాడు. కొంచెము ఆగు. ఇంకా పని ఉన్నది అని బ్రహ్మ అతనిని వారించినాడు. విజయోత్సవము అయినతరువాత దేవేంద్రుడు సముచితసత్కారాలు చేసి ఎవరిని వారిలోకానికి వెళ్ళవచ్చు నని అనుజ్ఞ ఇచ్చినాడు.

ముక్తాఫలకేతువు తండ్రితోకూడా తమ రాజధానికి వెళ్ళినాడు. అతని తండ్రి విజయోత్సవము చేసి మేఘుడు వర్షించినట్టు బంధువులకు, పరివారానికి కనకవర్షము కురిపించినాడు. అఖండకీర్తి అఖండఐశ్వర్యము లభించినప్పటికీ ముక్తాఫలకేతువుకు ఏమాత్రమూ మనశ్శాంతి లేదు. అతడు నిరంతరము పద్మావతినే ధ్యానము చేస్తున్నాడు. సంయతకుడు అనే మిత్రుడు మంచిమాటలు చెపుతూ మహేశ్వరవరమును మాటి మాటికీ జ్ఞాపకము చేస్తూ అతనిని ఓదారుస్తున్నాడు. ముక్తాఫలకేతువు రోజులు ఎలాగో గడుపుతున్నాడు.

## తరంగము: ౧౧౭

గంధర్వరాజు పద్మశేఖరుడు రాజధానికి పోయి వివాహోత్సవము చేసినాడు: గౌరీమందిరములో పద్మావతి తపస్సు చేస్తున్న సంగతి భార్యవల్ల తెలుసుకొని ఆమెను ఇంటికి రప్పించినాడు. తపస్సు చేతను, విరహముచేతను కృశించిపోయిన కూతురు వచ్చి తండ్రిపాదాలమీద వాలింది. 'అమ్మా, నాకోసము చాలా శ్రమపడ్డావు. త్వరలో ముక్తాఫలకేతువును వివాహ మాడుతావు' అని తండ్రి పలికినాడు. పద్మావతి తల వంచుకొన్నది. తల్లి ముక్తావళి భర్తతో 'త్రిలోకభయంకరుడైన ఆ అసురుణ్ణి ముక్తాఫలకేతువు ఎలా సంహరించినాడో చెప్పండి' అన్నది. పద్మశేఖరుడు యుద్ధములో అతనిపరాక్రమము వర్ణించి చెప్పినాడు. పద్మావతి చెలికత్తె మనోహారిక ఆరాజకుమారుడు ఇద్దరురాక్షసస్త్రీలను ఒక్కదెబ్బతో పడగొట్టిన సంగతి చెప్పింది. పద్మావతికీ ముక్తాఫలకేతువుకూ పరస్పరదర్శనము అనురాగమూ కలిగినట్లు విని గంధర్వరాజు చాలా ఆనందించినాడు.

పద్మావతికి విరహతాపము హెచ్చింది. అక్కడ ఉద్యానము చూసి తాపశాంతి కోసమై అందులోకి పోదా మనుకొన్నది. ఆమె నడక ప్రారంభించి ఏదో ఆలోచించేసరికి పక్షులు వచ్చి ఆమెను ఆ ఉద్యానానికి తీసుకుపోయినవి. ఆమె కొంతసేపు అరటిచెట్లనడుమ పుష్పశయ్యమీద కూర్చున్నది. ఏమీ మనశ్శాంతి కలగలేదు. ప్రియుని ఆకారము చిత్రఫలకముమీద చిత్రించడము ప్రారంభించింది.

ఆమెకోసం వెతుకుతూ బయలుదేరిన మనోహారిక వెనకనుంచి వచ్చి చూచింది. పద్మావతి చిత్తరువు పూర్తిచేసి తనప్రియుని గురించి ఏమేమో పలికి కన్నీళ్ళు విడిచింది. మనోహారిక ఆమెఎదటికి వెళ్ళేసరికి పద్మావతి చిత్రఫలకము దాచింది. తరవాత ఇద్దరూ ముక్తాఫలకేతువునుగురించి చర్చచేశారు. చెలికత్తె ఆమెకు ధైర్యం చెప్పింది.

పద్మావతి గద్గదకంఠంతో నీవు పోయి ఆమహాపురుషుని ఇక్కడకి తీసుకురావాలి. మానాయన కోపపడడు. వెంటనే వివాహంచేస్తాడన్నది. మనోహారిక వెళ్ళేటప్పుడు తనప్రియునికి సందేశం పద్మావతి చెప్పిపంపింది.

మనోహారిక విద్యాధరేంద్రరాజధాని అయిన చంద్రపురానికివెళ్ళింది. ముక్తాఫలకేతువు కనబడలేదు. అంతట పక్షివాహనమువిూద ఆమె ఉద్యానవనానికి వెళ్ళింది. పక్షిరూపాలలో ఉన్న ఉద్యానపాలకులు ఆమెకు అతిథిసత్కారాలు చేశారు. తరవాత ఆమెను ముక్తాఫల కేతువుకు కొంతదూరములో నిలిపి వెళ్ళినారు. ఆయన ఏమిచేస్తున్నాడో చూతా మనే కుతూహలమువల్ల ఆమె చాటున నుంచుని చూస్తున్నది.

సంయతకునితో ముక్తాఫలకేతువు తనప్రియురాలు పద్మావతినిగురించి బహువిధాలవర్ణించి గౌరీమందిరానికి వెళ్ళి తపస్సుచేస్తాను అని లేచినాడు.

మనోహారిక సంతోషంతో అతనిసన్నిధికి వచ్చింది. సంయతకుడు ముక్తాఫలునితో 'మిత్రమా, నీకోరిక ఈడేరింది. నీప్రియురాలి చెలికత్తె వచ్చింది' అన్నాడు. ముక్తాఫలుడు వివిధభావాలతో చిత్రమైనఅవస్థ పొంది మనోహారికను దగ్గిర కూర్చోబెట్టుకొని పద్మావతి యోగక్షేమం అడిగినాడు. ఆమె సమస్తమూ వివరించి చెప్పింది. 'కళ్యాణీ, నీవు వెంటనే వెళ్ళి ప్రియురాలిని ఓదార్చి మొదట మాకు సమాగమము జరిగిన గౌరీమందిరానికి తీసుకొనిరా, నేనుకూడా అక్కడికే వస్తాను. ఇదిగో ఈచూడామణి బ్రహ్మదేవుడు నాకు అనుగ్రహించినాడు. ఇది సర్వదుఃఖహరము. దీనిని నాప్రాణేశ్వరి కియ్యి. ఈహారము ఇంద్రుడు నాకు దయచేసినాడు. ఇది నీకు బహుమానము.' అని ముక్తాఫలుడు ఆమె కిచ్చినాడు. మనోహారిక అతనికి నమస్కారము చేసి సెలవు తీసుకొని పక్షివాహన మెక్కి పద్మావతీ మందిరానికి వెళ్ళింది.

మనోహారిక ముక్తాఫలకేతునిస్థితి వర్ణించి శిరోభూషణము ఆమెకిచ్చి తనకు బహుమానము చేసిన హారము చూపించింది. పద్మావతి సఖిని

కౌగలించుకొని మనశ్శాంతి పొందింది. మనోహారికి చూడామణిని ఆమెశిఖకు కట్టి గౌరీమందిరానికి వెళ్ళే సన్నాహం చేసింది.

ఇంతలో దైవవశాత్తు తపోధను డనే దృఢవ్రతుడు గౌరీమందిరానికి శిష్యునితో వచ్చి 'నేను ఈ దివ్యోద్యానములో కొంతసేపు సమాధిలో ఉంటాను. లేచినతరువాత అమ్మవారిని అర్చిస్తాను. నీవు ద్వారము దగ్గర ఉండి ఎవ్వరినీ లోనికి రానీయకు' అని చెప్పి లోపలికిపోయి పారిజాతవృక్షముకింద సమాధిని ఆశ్రయించి కొంతసేపటికి లేచి అమ్మవారిని అర్చించబోయినాడు. శిష్యుడికి ఆసంగతి తెలియదు. ఇంతలో ముక్తాఫలకేతువు సంయతకునితో కూడా దివ్యగజం ఎక్కి వచ్చి ఉద్యానములోకి వెళ్ళబోయినాడు. వద్దు వద్దు మాగురువు ఇక్కడ సమాధిలో ఉన్నాడు. అని శిష్యుడు వారిని వారించినాడు. 'ముని ఉద్యానములో ఎక్కడో ఒక మూల ఉంటాడు. ఇది చాలా విశాలమైనతోట పద్మావతి ఇందులో ఎక్కడైనా ఉండవచ్చును' అని ఆలోచించి ముని శిష్యునికి కనబడకుండా మరోఎక్కడకు వెళ్ళి ముక్తాఫలుడు మిత్రునితో ఆకాశమార్గాన ఉద్యానములో దిగినాడు. ఇంతలో ముని శిష్యుడు లోపలికి పోయి చూస్తే గురువు కనబడలేదు. రాజకుమారుడు అతని మిత్రుడూ కనబడ్డారు. కోపంవచ్చి శిష్యుడు 'సమాధి భంగము చేసి మా గురువును తరిమివేసిన అపచారానికి మీఇద్దరూ మానవజన్మ ఎత్తండి' అని శాపం పెట్టినాడు. తన కోరిక ఈడేరబోయే క్షణములో పిడుగువలె తగిలిన శాపానికి ముక్తాఫలకేతువు చాలా మనోవ్యథ చెందినాడు.

పద్మావతి పక్షివాహనంమీద చెలికత్తెతో వచ్చి అపశకునాలకు కొంచెం భయపడి తన ప్రియుని చూచి సవినయముగా అతని దగ్గరికి వెళ్ళింది. 'ప్రియా, మన మనోరథము సిద్ధమయ్యే క్షణములో విధి అడ్డువచ్చింది' అన్నాడు ముక్తాఫలుడు. ఎలా భంగమయింది అని పద్మావతి తత్తరపాటుతో అతనిని అడిగి శాపము సంగతి తెలుసు

కొన్నడి. అప్పుడు అందరూ కలిసి వెతికి గురువును దేవాలయములో చూచి అతని పాదాలమీద వాలినారు. ఆముని ప్రీతితో ఇలాఅన్నాడు 'రాజకుమారా, ఈమూర్ఖుడు నాసందర్భం తెలుసుకోకుండానీకు శాపము పెట్టినాడు. నీవు నాకేమి అపకారము చేయలేదు. నేను సమాధి ముగించుకొని స్వయముగానే లేచివచ్చాను. నీ భవితవ్య మిలా ఉన్నది. ఈశిష్యుడు కారణమాత్రుడు. నీవు మానవజన్మ ఎత్తి నిర్వహించవలసిన గొప్పదేవకార్య మున్నది. దైవయోగమువల్ల ఈ పద్మావతినే నీవు చూచి మానవశరీరం విడిచి త్వరలోనే శాపవిముక్తి పొందుతావు. ఈశరీరముతోనే నీప్రాణేశ్వరిని మళ్ళీ రక్షిస్తావు. విశ్వరక్షకుడ వైన నీకు బహుకాలము శాపదోషము ఉండకూడదు. నీ బ్రహ్మాస్త్ర ప్రయోగమువల్ల దైత్య బాలవృద్ధాదులు నశించినారు. ఆ దోషలేశమువల్లనే ఈశాపం తగిలింది'.

పద్మావతి కన్నీళ్ళతో 'స్వామీ, నాప్రియునికి ఏమి జరుగుతుందో నాకూ అదే కలిగేలా అనుగ్రహించు. ఈయనను విడిచి ఒక్కక్షణమైనా ఉండలేను' అని పద్మావతి ప్రార్థించింది. త్రికాలజ్ఞానము గల ఆ ముని 'అమ్మా, అలా జరగడానికి వీలులేదు. నీవు ఇక్కడే తపస్సు చేస్తూఉండు. అందువల్ల ఇతడు త్వరగా శాపవిముక్తి పొంది నిన్ను వివాహమాడు తాడు. తరవాత నీవు ఇతనితో కూడా పదికల్పములపాటు విద్యాధర సామ్రాజ్యము పరిపాలిస్తావు. బ్రహ్మకమండలవులోనుంచి పుట్టి మహా ప్రభావముకలిగిన ఈశిరోరత్నము తపస్సుసమయములోనిన్నురక్షిస్తుంది' అని చెప్పినాడు. ముక్తాఫలకేతువు ఆయనకు ప్రమాణముచేసి 'స్వామీ, మానవజన్మలో నాకు మహేశ్వరునిమీద నిశ్చలభక్తి, పద్మావతిమీద నిశ్చలప్రేమ ఉండేలాగున అనుగ్రహించు' అంటే అలాగే అని ముని ప్రసాదించినాడు. పద్మావతి దుఃఖావేశములో ముని శిష్యుణ్ణి చూచి 'నీవు మూర్ఖతవల్ల శాపము ఇచ్చినందుకు నాప్రియునికి మానవజన్మలో

కామగమనము కామచరము అయిన వాహనం అవుతావు' అని శపించింది. శాపానికి కంగారుపడ్డ శిష్యునితో సహా ముని అంతర్ధానమైనాడు.

ముక్తాఫలకేతువు పద్మావతితో 'ప్రియా, ఇక నేను వెడతాను. తరువాత ఏమవుతుందో చూస్తాను' అన్నాడు. పద్మావతి దుఃఖముతో నేలమీద వాలింది. ఆమెను ఓదార్చి ముక్తాఫలుడు వెనకకు తిరిగి చూస్తూ మిత్ర సహితముగా వెళ్ళినాడు.

పద్మావతి చెలికత్తెతో 'సఖి, ఈవేళ పార్వతీదేవి స్వప్నములో కనపడి ఉత్పలమాల నామెడలో వేయబోయి, ఇప్పుడు కాదులే తరవాత ఇస్తాను' అని మానివేసింది. అందువల్ల ఏదో విఘ్నము ఉంటుందని తోస్తున్నది. అని విచారపడ్డది.

'స్వప్నములో దేవి సాక్షాత్కరించడం నిన్ను ఓదార్చడానికే మునికూడా ఆశావాక్కులు పలికినాడు కదా? శివుని ఆదేశముకూడా అటువంటిదే కదా? కాబట్టి శీఘ్రకాలములోనే ప్రియునితో సమాగమము అవుతుంది. శాంతించు' అని మనోహారిక ఆమెను ఓదార్చింది. చెలికత్తె చెప్పిన మాటలవల్లను చూడామణి ప్రభావమువల్లను పద్మావతి ధైర్యము తెచ్చుకొని గౌరీమందిరములోనే ఉండి త్రికాలములలో పార్వతీపరమేశ్వరులను పూజిస్తూ ప్రియుని చిత్రఫలకము తెప్పించి దేవతాబుద్ధితో చూస్తూ తపస్సు చేస్తున్నది. ఈమెసంగతి తెలుసుకొని తల్లిదండ్రులు వచ్చి 'అమ్మా, ఎందుకు వృథాగా తపస్సువల్ల శరీరాన్ని ఆయాస పెట్టుకుంటావు? ఎలాగూ నీకోరిక ఈడేరుతుం దామెను' అని చెప్పినప్పటికీ వినక 'కులస్త్రీలకు భర్తే పరదైవతము. తపస్సువల్ల పాపము క్షాళన మాతుంది. మహేశ్వరుడు సంప్రీతుడౌతాడు. త్వరలోనే నాకు పతితో సమాగమము' అని పద్మావతి ప్రత్యుత్తరమిచ్చింది.

అప్పుడు ఆమెతల్లి కువలయావళి ఏమో ఆలోచించి భర్తతో ఇలా అన్నది. 'దేవా, అమ్మాయిని తపస్సు చెయ్యనివ్వండి. భర్తకోసము

పద్మ తపస్సు చేయకతప్పదు. దీనికి తగినకారణము కూడా ఉన్నది. కొంతకాలము కిందట దేవప్రభ అనే సిద్ధరాజకన్య తన కిష్టుడైన భర్త కోసం శివపురములో తపస్సు చేస్తూఉన్నది. ఒకసారి అక్కడికి నేనూ పద్మావతీ వెళ్ళినాము. అమ్మాయి దేవప్రభను చూచి భర్తకోసము తపస్సు చేస్తున్నావు సిగ్గుగాలేదా? అని పరిహాసము చేసింది సిద్ధరాజ కన్య కోపముతో 'నీవుకూడా భర్తకోసము కఠినతపస్సు చేస్తావులే' అన్నది. ఆశాపము పద్మావతి అనుభవించక తప్పదుకదా! చెయ్యి నియ్యండి తపస్సు' తల్లిదండ్రులు తమనగరానికి వెళ్ళిపోయినారు.

స్వప్నములో పద్మావతికి శివసాక్షాత్కారము అయింది. ఆమె సిద్ధీశ్వరక్షేత్రానికి గగనమార్గాన వెళ్ళి నియమ పూర్వకముగా ప్రతి దినమూ హారారాధన చేస్తున్నది.

## తరంగము : ౧౧౮

ముక్తాఫలకేతువు తన నగరానికి వెళ్ళి బ్రాహ్మణశాపానికి జంకి శివపూజ చేస్తూ ఉన్న సమయములో గర్భగృహములోనుంచి ఈవిధ ముగా వినబడ్డది: 'భయపడకు గర్భవాసక్లేశము నీకు సంభవించదు. మానవజన్మ ఎక్కువకాలము ఉండదు. నీ కేమీ కష్టాలు కలుగవు. రాజకుమారుడవై తపోధనునివల్ల అస్త్రవిద్య పొందుతావు. కింకరు డనే ప్రమథుడు నీకు తమ్ముడై శత్రువిజయములో తోడ్పడుతాడు. దేవ కార్యము సాధించినమీదట పద్మావతితో కలిసి విద్యాధరైశ్వర్యము అనుభవిస్తావు' ఆవాక్కులకు ముక్తాఫలుడు ధైర్యము తెచ్చుకొని శాప ఫలితానికి ఎదురు చూస్తున్నాడు.

తూర్పుదిక్కున దేవసభ మనే నగరమును మేరుధ్వజుడు అనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆయన సమస్తసద్గుణోపేతుడు. మేరుధ్వజునికి రెండు చింతలు మాత్రము ఉన్నవి. ఆయనకు సంతానములేదు. పూర్వము దేవాసురసంగ్రామమునకు ముందు తాను వధించగా హతశేషులై పారి

పోయిన అసురులు పాతాళలోకంలో దాక్కొన్నారు. వాళ్ళు మధ్య మధ్య చాటుగావచ్చి ఆయన రాజధానికి దూరములోఉన్న పుణ్యతీర్థాలనూ ఆశ్రమాలనూ పాడుచేసి పోతూ ఉంటారు. వాళ్ళను పట్టడానికి రాజుఎంతో ప్రయత్నముచేసినాడు అసురులు దొరకలేదనేది రెండవచింత.

ఒకనాడు ఇంద్రుడు పంపినరథమెక్కి మేరుధ్వజుడు చైత్రశుక్ల పాడ్యమి నాడు దేవసభకు వెళ్లినాడు. సంవత్సరాదినాడు దేవతలంతా మహేంద్రునిసభకు వెళ్ళడము ఆచారము. మేరుధ్వజమహారాజు కూడా ఇంద్రుని రథములోనే అక్కడికి వెళ్ళడము అలవాటు. ఇంద్రుడు అతనిని సర్వవిధములా సన్మానము చేసినప్పటికీ మహారాజు నిట్టూర్పులు విడిచినాడు. ఇంద్రుడు అతని హృదయము గ్రహించి 'రాజా, నీవిచారము నాకు తెలుసును. శివాంశలో ముక్తాఫలధ్వజు డనే కుమారుడు, ప్రమథాంశవల్ల మలయధ్వజు డనే కుమారుడూ కలుగుతారు. పెద్దవాడు తమ్మునితోసహా తపోధనమునివల్ల విద్యలు, కామరూప వాహనమూ అస్త్రములూ పొందుతాడు. పాశుపతాస్త్రముకూడా అతనికిలభిస్తుంది. అతడు ప్రపంచ మంతా జయించి అసురులను సంహరించి పాతాళము కూడా వశపరుచుకుంటాడు. కాంచనగిరి, కాంచనశేఖరము అనే దివ్యగజములు నీకు ఇస్తాను' అని అస్త్రములు ఏనుగులు ఇచ్చినాడు. మేరుధ్వజుడు భూలోకములో నిజరాజధానికి వెళ్ళినాడు.

ఆదివ్యగజమువల్ల రాజుకు ఆకాశగమనము లభించినప్పటికీ ధూర్తులైనఅసురులు దొరకలేదు. తపోధనమునిఆశ్రమానికి మేరుధ్వజుడు భార్యతోసహా వెళ్ళి ఉపదేశముపొంది శివారాధన చేసినాడు. పరమేశ్వరుడు సంప్రీతుడై స్వప్నములో 'రాజా, లే. నీకు ఇద్దరు కుమారులు కలుగుతారు. వాళ్ళు అసురుల నందర్నీ హతమారుస్తారు' అని అనుగ్రహించినాడు. తెల్లవారగానే మునితో ఈవిషయము చెప్పి రాజు భార్యతోసహా భోజనముచేసి రాజధానికి వెళ్ళినాడు.

ముక్తాఫలకేతువు చంద్రపురములో బంధువుల కావలిపెట్టి తన విద్యాధరదేహము అక్కడ విడిచి మేరుధ్వజునిభార్య గర్భములో ప్రవేశించినాడు. ఆమె గర్భము ధరించి క్రమేణా కుమారుని ప్రసవించింది. దివ్యదృష్టిద్వారా ఈసంగతి తెలిసిన తపోధనముని రాజుదగ్గిరికి వచ్చినాడు. రాజు మహోత్సవము చేసి ముని ఆశీర్వచనముతో బాలకునికి ముక్తాఫలధ్వజుడు అని పేరు పెట్టినాడు.

క్రమేణా రాజుకు రెండవకుమారుడు కలిగినాడు. అతనికి తండ్రి మలయధ్వజు డని పేరు పెట్టినాడు. సంయతకుడు శాపమువల్ల మేరుధ్వజుని మంత్రికి కుమారుడై పుట్టినాడు. వానికి మహాబుద్ధి అని పేరు పెట్టినారు. రాజకుమారులకు సకాలములో ఉపనయనము చేయించి తపోధనముని ఎనిమిది ఏళ్ళపాటు మంత్రిపుత్రునితోసహా వారికి సమస్తవిద్యలూ, కళలూ, అస్త్రశస్త్రప్రయోగములూ నేర్పినాడు.

తపోధనుడు ఆశ్రమానికి వెళ్ళబోతుంటే రాజు దక్షిణ స్వీకరించమని అతనిని వేడుకొన్నాడు. 'రాజా, యజ్ఞము చేస్తాను. నీవు పుత్రులతోసహా వచ్చి యాగభంగము చేసే అసురులను సంహరించు. అదే నాకు దక్షిణ' అన్నాడు ముని. 'స్వామీ, యాగము ప్రారంభించండి. ఇదివరలో జరిగినట్టు అసురులఆటలు సాగవు. ఇంద్రు డిచ్చినఏనుగు లున్నవి. వాటిసాయముతో వాళ్ళను పట్టివేస్తాను' అన్నాడు రాజు. 'రాజా, యజ్ఞానికి కావలసిన సంభారా లన్నీ సిద్ధము చేయించు. యజ్ఞవిషయము అందరికీ తెలియబరుస్తాను. మాశిష్యుడు దృఢవ్రతుడు నీదగ్గిరికి పక్షిరూపములో వస్తాడు. ముక్తాఫలధ్వజునికి వాడే వాహనము అవుతాడు. మీ రంతా నాఆశ్రమానికి రండి' అని ముని వెళ్ళిపోయినాడు.

యజ్ఞానికి దేవఋషులు వచ్చినారు. శిష్యుడు వచ్చి పిలవగానే మేరుధ్వజుడు కాంచనగిరిమీద తా నెక్కి, మలయధ్వజునికి కాంచనశేఖర మిచ్చినాడు. ముక్తాఫలధ్వజుడు దివ్యాస్త్రములు తీసుకొని దృఢవ్రత

వాహనముమీద ఎక్కి బ్రాహ్మణఆశీర్వచనము పొంది సైన్య
మును ముందు పంపించి తరవాత వారిఆశ్రమము చేరాడు. ముని
'మీకు ఏఆయుధభయమూ ఉండదు' అని వర మిచ్చినాడు.

యజ్ఞభంగము చేయడానికి అసురసైన్యము వచ్చింది. వరులకూ అసురులకూ యుద్ధం ప్రారంభ మయింది. అసురులు ఆకాశములో నుంచి నేలమీదివారిని బాధ పెట్టారు. ముక్తాఫలధ్వజుడు పక్షివాహనముమీద పైకి పోయి బాణవర్షములో అసురులను ముంచెత్తినాడు. గరుడవాహనముమీద నారాయణుడు వచ్చినా డని భయపడి పాతాళలోకానికి పరుగెత్తి హతశేషు లైనఅసురులు తమప్రభువు త్రైలోక్యమాలికి విన్నవించారు. వాడు గూఢచారులను పంపి అతడు నారాయణుడు కాదనీ మానవుడే ననీ తెలుసుకొని మహాసైన్యము తీసుకొని అపశకునాలను లక్ష్యము చేయక ఆశ్రమానికి వెళ్ళినాడు.

అదివరకే అప్రమత్తులై ఉన్నముక్తాఫలధ్వజాదులు సైన్యసమేతంగా ఆఅసురనాయకునితో డీకొన్నారు. ఘోరయుద్ధము ప్రారంభ మయినది. రుద్రయింద్రాదిదేవతలు చూడడానికి విమానాలలో వచ్చినారు. మహాపాశుపతాస్త్రము వచ్చి ముక్తాఫలునిఎదుటనిలిచింది. దానికి మూడు కన్నులు, నాలుగుముఖములు, ఒంటికాలు, ఎనిమిదిహస్తములూ ఉన్నవి. అతనివిజయముకోసము శివాజ్ఞవల్ల తాను వచ్చినట్టు పాశుపతాస్త్రము చెప్పింది. ముక్తాఫలుడు అస్త్రమును పూజించి తీసుకొన్నాడు. అస్త్రప్రత్యస్త్రప్రయోగముతో యుద్ధము నడిచింది. ఒకసారి అసురులది పైచెయ్యి అయింది. మేరుధ్వజాదులు దానికి ప్రతిక్రియ చేశారు. చివరకు అసురులు లక్షలకొద్దీ నిహతు లయినారు. పాశుపతాస్త్రమును చూసి తక్కినఅస్త్రము లన్నీ దూరంగా పోయినవి. మిగిలిన శత్రువులమీద ముక్తాఫలుడు సమ్మోహనాస్త్రము ప్రయోగించినాడు. అసురు లంతా మూర్ఛపోయినారు. వారుణాస్త్రము ప్రయోగించి,

వాళ్ళను పాశబద్ధులను చేసినారు. అప్పుడు దేవతలు పుష్పవృష్టి కురిసినారు.

మేరుధ్వజునితో తపోధనుడు 'ఇక వీళ్ళను చంపవద్దు. త్రైలోక్యమాలిని, ఇతని పుత్రులను, మంత్రులను, ప్రధానపురుషులను తీసుకుపోయి దేవసభపురము దగ్గర శ్వేతశైలగుహలో బంధించి ఉంచు' అని చెప్పినాడు. 'మీకు భయములేదు. మిమ్మల్ని సంహరించము. ముక్తాఫలధ్వజ మలయధ్వజుల శాసనము మీరంతా శిరసా వహించండి. శ్వేతశైలగుహలో మీకు నివాసము' అని చెప్పి మేరుధ్వజుడు ఆప్రకారముగా వాళ్ళకు ఏర్పాటు చేసి, తనపుత్రులతో ఇలా అన్నాడు: "యజ్ఞరక్షార్థము నేనుఇక్కడనే ఉంటాను. మీరు విమానాలలో పాతాళలోకానికి వెళ్ళి, అక్కడివారిని మంచిమాటలతో వశపరుచుకొని, ప్రధానులను నియమించి, మావెంటబడిలోకి తెచ్చుకొని ఇక్కడికి రండి."

అన్నదమ్ములిద్దరూ తండ్రిమాటప్రకారము సప్తపాతాళములు స్వాధీనము చేసుకొని, ప్రజలకు అభయమిచ్చి, అక్కడిసమస్తభోగములూ అనుభవిస్తున్నారు. త్రైలోక్యమాలిభార్య స్వయంప్రభ చెరలో ఉన్నతనభర్తకు శుభము కలగడముకోసము తపస్సు ప్రారంభించింది. ఆమెపుత్రికలు త్రైలోక్యప్రభ, త్రిభువనప్రభకూడా తపస్సు మొదలు పెట్టినారు.

పాతాళవాసులు శాంతించినమీదట సంగ్రామసింహాదులను వాళ్ళమీద పాలకులనుగా నియమించి అన్నదమ్ములు తపోధనాశ్రమములో ఉన్నతండ్రిసన్నిధికి వెళ్ళినారు.

యజ్ఞము సమాప్తమయింది. దేవతలు, ఋషులు నిజనివాసాలకు వెళ్ళినారు. ప్రార్థిస్తే మహేంద్రుడు దేవసభపురానికి వెళ్ళినప్పుడు మేరుధ్వజుడు చేయించిన దివ్యోపచారాలకు దేవనాయకుడు స్వర్గసుఖాన్ని కూడా విస్మరించినాడు. తర్వాత దేవేంద్రుడు తండ్రినీ పుత్రులనూ

అమరావతికి తీసుకుపోయి రంభానారదాదుల గానము వినిపించి, పారిజాత దామములూ, దివ్యకిరీటాలూ ఇచ్చి సమ్మానించి పంపినాడు. వారు భూలోక పాతాళలోకాలకు రాకపోకలుచేస్తూ పరిపాలన చేస్తున్నారు.

తండ్రి, కొడుకులతో ఒకనాడు ఇలా చెప్పినాడు: 'మనకు శత్రువులు లేరు. మీ ఇద్దరూ యుక్తవయస్కులు అయినారు. ఎందరో రాజకన్యలున్నారు. నేనుకూడా మీకోసము కన్యలను వెతికినాను. ఇక మీ ఉభయులూ వివాహము చేసుకోవడము యుక్తము' అనగా ముక్తాఫలుడు 'నాయనా, నాకు వివాహ వాంఛ లేదు. మహేశ్వరుని గురించి తపస్సు చెయ్యడానికి వెళ్తున్నాను. తమ్ముడికి వివాహము చేయవచ్చు' అన్నాడు. అప్పుడు మలయధ్వజుడు 'అన్నా, నీకు వివాహము కాకుండా నేను వివాహము చేసుకుంటానా? నీవు రాజ్యమువిడిచి వెళ్ళితే నేను రాజ్యములో ఉంటానా? నేనుకూడా నీమార్గము అనుసరించేవాడినే' అన్నాడు.

'తమ్ముడిమాటలు బాగున్నవి. నీమాటలు నాకు నచ్చలేదు. యౌవనములో భోగములు అనుభవించాలి. శ్రమపడి తపస్సు చెయ్య వలసిన కాలముకాదిది' అని తండ్రి ఎన్నివిధాల చెప్పినా కొమారుడు వినలేదు. పుత్రునిమనస్సు మారడానికై తండ్రి ఎదురు చూస్తున్నాడు.

పాతాళలోకములో తపస్సు చేస్తున్న త్రైలోక్యమాలిపుత్రికలు స్వయంప్రభతో ఒకనాడు 'అమ్మా, ఎనిమిదియేళ్ళనుంచీ నాయన చెర సాలలో ఉన్నాడు. మేము తపస్సుచేస్తూ ఉన్నప్పటికీ శివానుగ్రహము కలగలేదు. శత్రువులవల్ల మాకు పరాభవము జరగకముందు ఈ శరీరాలు అగ్నికి ఆహుతి చేస్తాము' అన్నారు. అందుకు తల్లి ఇలా చెప్పింది: 'తొందరపడవద్దు, త్వరలో మనకు మంచిరోజులు వస్తున్నవి. స్వప్నములో శివుడు సాక్షాత్కరించి 'అమ్మాయీ, ధైర్యము వహించు, నీభర్తకు మళ్ళీ రాజ్యము వస్తుంది. ముక్తాఫలకేతువు, మలయధ్వజుడు

సికుమార్తెలను వివాహమాడుతారు. వారు సామాన్యులు కారు. ప్రథముడు విద్యాధరుడు, ద్వితీయుడు ప్రమథుడు, అని అనుగ్రహించి నాడు. అందువల్లనే ఇన్నాళ్ళూ కష్టాలు సహిస్తున్నాను. ఈసంగతులు మీనాయనగారికి తెలిపి, ఆయనఅంగీకారముపొంది, మీా వివాహ ప్రయత్నంచేస్తాను.'

ఇందుమతి అనే వృద్ధ పరిచారికను పిలిచి, శ్వేతశైలగుహకు వెళ్ళి స్వప్నవృత్తాంతము విన్నవించి అంగీకారము పొంది రావలసిన దని స్వయంప్రభ పంపించింది. పరిచారిక బయలుదేరి శ్వేతశైల గుహారక్షకు లను ప్రార్థించి లోపలికి వెళ్ళి త్రైలోక్యమాలి పాదాలకు ప్రణామము చేసి, సందేశము విన్నవించింది. అసురనాయకుడు తనవారు కుశలముగా ఉన్నందుకు శాంతించి 'మహేశ్వరాజ్ఞవల్ల మాకు మళ్ళీ రాజ్యము వస్తుంది, సరే కాని నేను చెరసాలలో ఉండి, మానవులకు మాబిడ్డలను ఇచ్చి వివాహము జరుపడానికి సమ్మతించడము వట్టిది. ఇక్కడే పడి ఉండి ప్రాణా లయినా విడుస్తాను' అని చెప్పి పంపివేసినాడు.

త్రైలోక్యమాలి నిశ్చయము తెలుసుకొని కుమార్తెలు 'అమ్మా, ఇక అగ్నిప్రవేశమే గతి. ఈ చతుర్దశినాడు అగ్నిలో ప్రవేశిస్తాము' అని స్పష్టంగా విన్నవించారు. స్వయంప్రభకూడా సపరివారముగా అగ్నిప్రవేశము చెయ్యడానికి నిశ్చయించుకొన్నది. అందరూ చతుర్దశి నాడు బయలుదేరి పాపరిపు అనే తీర్థక్షేత్రములో హాటకేశ్వరస్వామి దర్శనము చేసి, చితులు పేర్చినారు.

భార్యాపుత్రసమేతముగా మేరుధ్వజుడు హాటకేశ్వర దర్శనార్థము పాపరిపుక్షేత్రానికి వచ్చి, అనుచరులతో స్నానానికి వెళుతూఉంటే సమీాపవనములో ధూమము కనబడ్డది; ఏమిటో చూచి రమ్మని సంగ్రామసింహాదులకు ఆనతిచ్చినాడు. చూచి వచ్చి 'దేవా, త్రైలోక్య మాలిభార్య స్వయంప్రభాదేవి పుత్రికలతోసహా ఇక్కడ తపస్సు

చేస్తున్నది. ఇప్పు డామెచేసేది అగ్నికార్యమో, అగ్నిప్రవేశమో' అని విన్నవించారు.

తక్కిన పరివారజనాన్ని అక్కడే ఉండమని, భార్యతో కుమారులతో మేరుధ్వజుడు బయలుదేరినాడు. అధికారులు ఆయనవెంట నడచినారు. వారంతా వెళ్ళి చూచేసరికి తల్లీ, కుమార్తెలూ చితాగ్నిని పూజిస్తున్నారు. త్రైలోక్యప్రభ అగ్నిని ఉద్దేశించి 'దేవా, మాఅమ్మ స్వప్నవృత్తాంతము చెప్పినప్పటినుంచీ నేను ముక్తాఫలధ్వజుని భర్తగా భావిస్తున్నాను. వచ్చేజన్మలోనైనా ఆయననాకు పతి అయ్యేలాగున అనుగ్రహించు. మానధను డైన మానాయన చెరలో ఉన్నాడు. మాఅమ్మ వివాహానికి అంగీకరించినా ఆయన అంగీకరించడు.' అన్నది. ఆమెచెల్లెలు త్రిభువనప్రభ మలయధ్వజుడు తనభర్త కావలె నని కోరింది. ఈమాటలు విని మహారాజు భార్యతో సంప్రతించి, వారి దగ్గిరికి పోయి మరణము వారించినాడు. ఆయనను చూచి ముగ్గురూ నమస్కారాలు చేసినారు.

స్వయంప్రభ ఇలా విన్నవించింది. 'అతడు రెండు లోకములకూ ప్రభువు లయిన దేవరవారి దర్శనము పూర్వమే చేశాము. అయితే మేము తిరస్కరిణీ విద్యాప్రభావమువల్ల మీకు కనబడకుండా ఉన్నాము. ఇప్పుడు ఏలినవారికి నేత్రగోచర మయినాము. తమ దర్శనభాగ్యము వల్ల మా కష్టాలన్నీ త్వరలోనే గట్టెక్కుతవి. దేవరవారే స్వయముగా మామనోరథము పూర్తిచేస్తామని సెల విచ్చినారు. ఇక మాకు లోపమేమిటి! ఇది మాఆశ్రమము. దేవర పీఠము అలంకరించి అర్ఘ్యపాద్యాదులు స్వీకరించ వలె నని మాప్రార్థన. ఏలినవారు జగద్వంద్యులు.'

మహారాజు మందహాసము చేసి 'సీ అల్లుళ్ళకు ఉభయులకూ పాద్యము ఇయ్యి' అన్నాడు. 'శ్రీవృషభధ్వజుడు వీరికి పాద్యాదులు

ఇప్పిస్తాను. ప్రస్తుతం తమరు స్వీకరించండి' అన్నది స్వయంప్రభ.

'అన్నీ స్వీకరించినట్టే. మీ దేశాన అనుకూలమైన నగరానికి వెళ్ళండి. తర్వాత మీకు సమస్తసదుపాయాలూ చేయిస్తాను' అన్నాడు రాజు.

'దేవరవారి వాక్యాన్ని బట్టి మరణప్రయత్నము మానుకొన్నాము. మా యజమాని బందిగములో ఉండగా మేము పట్నవాసము ఎలా చేస్తాము? ఏలినవారు అనుగ్రహించిన పరప్రకారముగా మా యజమానిని పుత్రామాత్యసమేతముగా విడిపించేవరకూ మేము ఈ ఆశ్రమములోనే ఉంటాము. విముక్తుడయినతర్వాత మా ప్రభువు మీ రాజ్యము మీకే సమర్పించవచ్చును; మీ అధికారానికి లోబడి మీ పక్షాన రాజ్యం చెయ్యవచ్చును. ఆయన మీతో ఒడంబడిక చేసుకొంటాను. అందుకు మేమూ, పాతాళవాసులూ హామీ. పాతాళమునుంచి మారత్నాలు దేవరవారు స్వీకరించండి' అని స్వయంప్రభ విన్నపము చేసింది.

సరే అని మేరుధ్వజుడు బయలుదేరి, స్నానముచేసి, హాటకేశ్వర స్వామిని పూజించినాడు.

రసాతలవాసు లంతా మేరుధ్వజునికి ప్రణామము చేశారు; చేసి త్రైలోక్యమాలిని విడుదల చెయ్యవలసిం దని ఆయనను ప్రార్థించినారు. మేరుధ్వజుడు భార్యాపుత్రసమేతముగా అసురలోకములోనుంచి తన రాజధానికి బయలుదేరి వెళ్ళినాడు.

మలయధ్వజుడు త్రిభువనప్రభను ధ్యానిస్తూ మదనబాధకు లోనయి నాడు. త్రైలోక్యప్రభ తనను వరించినప్పటికీ ముక్తాఫలధ్వజుడు నిర్వి కారముగా ఉన్నాడు. చిన్నకొడుకు పెండ్లికి తొందరపడడమూ, పెద్దకుమారుడు పెళ్ళికి విముఖుడుగా ఉండడమూ, త్రైలోక్యమాలి కన్యాదానము సమ్మతించకపోవడమూ – ఇవి అన్నీ ఆలోచిస్తూ మేరు ధ్వజుడు ఉపాయము ఊహిస్తున్నాడు.

మేరుధ్వజుడు మదనబాధకు లోనయిన కుమారుని చూచి భార్యతో ఇలా అన్నాడు: "పాతాళలోకములో మనము త్రైలోక్యమాలి కుమార్తెలను చూచినాము. మనకుమారులకు వారు భార్యలు కాక పోతే నేను ఏమిచెయ్యను! ఆకన్యలలో కడసారపుదానిమీద మన కుమారుడు, మలయధ్వజుడు మక్కువపడి సిగ్గువల్ల ఎవరికీ చెప్పక లోలోపల బాధపడుతున్నాడు. అందువల్ల పూర్వము నేను స్వయం ప్రభకు వాగ్దానము చేసినప్పటికీ ఇప్పుడు త్రైలోక్యమాలిని విడుదల చేయ దలుచుకోలేదు. అతన్ని మనము వదిలివేస్తే అతడు రాక్షసాభి మానమువల్ల తన కుమార్తెలను మానవులైన మన కుమారులకు ఇవ్వడు. ఈసంగతి అతనితో శాంతంగా ప్రస్తావించాలి."

మేరుధ్వజుడుప్రతీహారుని పిలిపించి, శ్వేతశైల గుహకు వెళ్ళి బంధనంలో ఉన్న త్రైలోక్య మాలితో ప్రీతిపూర్వకంగా, తనమాటగా తెలియజేయ మని పలికినాడు: "రాక్షసరాజా, విధివశాన నీవు చిరకాలక్లేశము అనుభవిస్తున్నావు. నామాట పాటించి స్వేచ్ఛ అనుభ వించు. నాకుమారులకు నీకుమార్తెలను ఇచ్చి వివాహము చేస్తే బంధ ముక్తుడవు అవుతావు. యథాప్రకారంగా నీరాజ్యము ఏలుకో." ప్రతీహారుడు రాక్షసేంద్రునకు రాజసందేశము తెలియచేసినాడు. త్రైలోక్యమాలి తన కుమార్తెలను మేరుధ్వజుని కుమారులకు ఇవ్వనని సమాధానము ఇచ్చినాడు. ప్రతీహారుడు రాక్షసవచనము రాజుకు మనవి చేసినాడు.

మేరుధ్వజుడు కర్తవ్యము ఆలోచన చేస్తున్నాడు. రోజులు గడుస్తూఉండగా స్వయంప్రభ సంగతి తెలుసుకొని పాతాళలోకము నుంచి ఇందుమతి అనే వృద్ధదాసిని దూతిగా మేరుధ్వజుని దేవేరికి ఇలా సందేశము పంపింది: దేవీ! స్వయంప్రభాదేవి మీకు విన్న

విస్తున్నది, ప్రళయకాలంలో సముద్రాలు, కులపర్వతాలు మాసిపోవచ్చు. మీమాట మాత్రము మారదు గదా! మాప్రభువు కారాగారములో ఉండగా కన్యలను ఎలా ఇస్తాను? మీరు ఆయనను విడిచిపెడితే ఆయన తప్పకుండా కన్యాదానము చేస్తాడు. మీరు అలా చేయని పక్షములో స్వయంప్రభ తక్కిన కన్యలతో పాటు చనిపోతుంది. దేవీ! మాప్రభువును బంధముక్తుని చేయండి.

స్వయంప్రభ పంపిన ఖేచరత్వ సిద్ధిదాయకము, రత్నఖచితము ఆభరణాన్ని ఇందుమతికి ఇచ్చింది. "ఈపగ నేను ఎలా తీసుకోను!" అని దేవేరి పలికింది. ఇందుమతి "దేవీ, మీరు ఈఆభరణము తీసుకోకపోతే స్వయంప్రభ చాలా బాధ పడుతుంది" అని సమాధాన మిచ్చింది. దేవేరి ఆభరణము పుచ్చుకొన్నది.

ఈలోగా మేరుధ్వజుడు రాగా ఇందుమతి ఆయనతో పరిచయము చేసుకొని ప్రణామము చేసింది. మహారాజు వృద్ధదాసిని ఆదరించినాడు. ఆయన విష జరా రోగహర మయిన చూడామణిని ఇందుమతి దగ్గిర స్వీకరించినాడు. దాసి "దేవా, మీరు చూడామణి స్వీకరించారు. మారాణి స్వయంప్రభ స్వస్థచిత్త అవుతుంది" అన్నది. మహారాజు చూడామణి దేవేరికి ఇచ్చినాడు. ఆమె శిరోమణిని ధరించింది. ఇందుమతి స్వయంప్రభాదేవి సందేశాన్ని మహారాజుకు మనవి చేసింది. మేరుధ్వజుడు సందేశానికి ప్రతిసందేశము మరునాడు పంపుతా నని అన్నాడు.

మరునాడు ఉదయము మహారాజు కొలువు తీర్చి ఇందుమతిని పిలిపించి ఇలా పలికినాడు: "నేను మంత్రులను నీవెంట పంపుతాను. నీవు త్రైలోక్యమాలికి తెలిపి పాతాళలోకమునుంచి స్వయంప్రభ మొదలయినవారినీ, పాతాళవాసులలో మరీ ముఖ్యులను హాటకేశ్వర సంబంధమయిన ముద్రాసహిత అనే వారికోశము తీసుకు రావాలి.

త్రైలోక్యమాలి బంధుపరివారసమేతంగా పాతాళములో ఉండవలె. నాగులు సస్యక్షేత్రాలు నాశనం చెయ్యకూడదు, ఈవిషయమై స్వయంప్రభాప్రభృతులు మా హాటకేశ్వర సన్నిధానములో భర్తపాదాలు స్పృశించి ప్రతిజ్ఞచేసి హామీగా ఉండాలి, తమ నాయకులతో సహా పాతాళవాసులు హామీగా ఉండాలి. వారి బిడ్డలను మాకు అప్పగించాలి. అంతా వ్రాతమూలకంగా ఉండాలి. హాటకేశ్వరస్వామివారి సర్వాంగ కోశ జలము తాగవలె, అందరూ. తర్వాత త్రైలోక్యమాలిని విడిచి పెట్టుతాను.'

ఇందుమతి మంత్రులతో సహా బయలుదేరి ఈవిషయా లన్నీ త్రైలోక్యమాలికి విన్నవించింది. ఆయన సమ్మతించినమీదట ఇందుమతి పాతాళానికి వెళ్ళి స్వయంప్రభాదులనూ కోశ జలమునూ తీసుకు వచ్చి మంత్రిసమేతుడైన మేరుధ్వజుని సమక్షములో అందరిచేతనూ శపథాలు చేయించింది. త్రైలోక్యమాలిని, అతని పరివారాన్నీ చెరలోనుంచి మేరుధ్వజుడు విడుదల చేయించి అతను వచ్చినతర్వాత చాలా ఆదరించి రత్నసంచయము స్వీకరించి అతనిని నిజరాజ్యానికి పంపివేసినాడు. త్రైలోక్యమాలి పాతాళానికి వెళ్ళి, తనవారి నందరినీ కలుసుకొని చాలా ఆనందము పొందినాడు.

తర్వాత అసురనాయకుడు స్వయంప్రభతో సంప్రతించి తనపుత్రికలను మేరుధ్వజుని పుత్రులకుఇచ్చి వివాహము చెయ్యడానికి సంకల్పించి మేరుధ్వజునిసన్నిధికి పోయి 'దేవా, వెనక పాతాళానికి వెళ్ళినపుడు తగినంత సంతృప్తి నీకు కలిగి ఉండదు. ఇప్పుడు పుత్రబాంధవ సమేతముగా పాతాళానికి దయచేసి మాసపర్యలు అందుకొని, నా కొమార్తెలను కోడళ్ళుగా స్వీకరించాలి' అని విన్నవించినాడు. మేరుధ్వజుడు భార్యను కుమారులనూ పిలిపించి యావద్వృత్తాంతమూ తెలిపినాడు.

అప్పుడు పెద్దకొడుకు ముక్తాఫలధ్వజుడు తండ్రితో 'మహేశ్వరుని గురించి తపస్సు చెయ్యకుండా నేను వివాహము చేసుకోను. మీతో ఇదివరకే చెప్పినాను. క్షమించాలి. నేను తపస్సుకు వెళ్ళిపోతాను. తమ్ముడు వివాహము చేసుకోవచ్చు.' 'పాతాళకన్యలేకుండా ఇతనికి సౌఖ్యము లేదుకదా' అన్నాడు. 'అన్నా, నీవు లేకుండా అటువంటి అధర్మము నేను చేస్తానా? నాకు వివాహము వద్దు' అని తమ్ముడు పట్టుపట్టినాడు. మేరుధ్వజుడు చాలా విచారపడ్డాడు. త్రైలోక్యమాలి రాజువద్ద సెలవు తీసుకొని పరివారసమేతముగా పాతాళానికి వెళ్ళిపోయినాడు. పోయి భార్యతోనూ కుమారునితోనూ జరిగినవిషయము చెప్పి 'మనకు విధివల్ల అవమానమే జరుగుతున్నది. వాళ్ళు అడిగినప్పుడు నేను పిల్లలను ఇవ్వనన్నాను. ఇప్పుడు నేనే వెళ్ళి బతిమాలితే వాళ్లు పెళ్ళి చేసుకోనన్నారు' అని వివరించినాడు.

'విధివిధానము ఇలా ఉన్నది. శివాజ్ఞ తప్పుతుందా' అని వాళ్లు అన్నారు. ఇంతలో కన్య లిద్దరూ వచ్చి సంగతి తెలుసుకొని 'మేము పన్నెండురోజులు నిరాహారవ్రతము అవలంబిస్తాము. అప్పటికీ శివానుగ్రహము కలగకపోతే ఉభయులమూ అగ్నిప్రవేశము చేస్తాము. అవమానము భరించి ఊరికే జీవించి ఉండడముకంటె ఈపాడు శరీరాలు విసర్జిస్తాము' అని ప్రతిజ్ఞ చేసి శివసాన్నిధ్యములో దీక్ష పట్టి నిరాహారవ్రతముల ప్రారంభించారు. ఆ విషయము విని తల్లిదండ్రులు కూడా వెళ్లి అక్కడే నిరాహారులై జపము! ఆరంభించారు. అప్పుడే స్వయంప్రభాదేవి ఇందుమతిని పిలిపించి ఈవృత్తాంతము మేరుధ్వజమహారాజుగారి పట్టపుదేవికి తెలియపరిచింది. అంతా విని రాజు, రాణీ కూడా నిరాహారవ్రతము పూనినారు. ఈసంగతి తెలిసి కుమారు లిద్దరూ ఆహారము విసర్జించారు.

ఈ ప్రకారముగా ఉభయలోకాలలో ప్రభువుల గృహాలలో చిక్కు సంప్రాప్తించింది. ముక్తాఫలధ్వజుడు మహేశ్వరుని శరణువేడి ఆరు

రోజులు అనుభవించవలసి ప్రాప్తకాలమున మిత్రుడు మహాబుద్ధితో 'మిత్రమా, ఎంతో స్వప్నం వచ్చింది. తపోధనముని అనుగ్రహించిన వాహనాన్ని ఎక్కి మిత్రునితోసహా మేరుతటాన గౌరీశాలయానికి వెళ్ళినాను. దివ్యసుందరి స్త్రీరూపమైన కన్య అక్కడ కనిపించింది. ఒకజడ దారి నన్ను చూచి నవ్వి: 'బాబా నీవు ఒకకన్య అక్కర లే దని ఇక్కడికి తప్పించుకొని వస్తే, ఇక్కడ నీకు మరోకన్య తటస్థించింది. చూశావా! అన్నాడు. నేను ఆకన్యాసౌందర్యాన్ని కనులు తీర చూడడము ప్రారంభించాను. ఇంతలో మెలకువ వచ్చింది. ఆ దివ్యకన్య ఉన్న ప్రదేశము వెతుక్కుంటూ వెళ్తాను. ఆమె లభించనిపక్షాన ఈశరీరము అగ్నిలో విసర్జిస్తాను. నాకు, దైవస్వామికి మనస్సు పోలేదు. స్వప్నములో కనిపించిన కన్యకూనికి మనస్సు దూకుతున్నది. మిత్రవిలాసము! అక్కడికి నేను వెళ్ళితే తప్పక శుభము కలుగుతుం దని విశ్వాసము' అన్నాడు.

ఈ మాటలు చెప్పి ముక్తాఫలుడు తన వాహనాన్ని స్మరించినాడు. అది విమానరూపాన దగ్గిరికి వచ్చి నిలిచింది. ముక్తాఫలుడు మిత్రునితోసహా అందులో ఎక్కి మేరుపర్వతతటాన గౌరీశాలయానికి వెళ్ళినాడు. కలలో కనబడినవిధానికి అక్కడ సమస్తమూ సరిపోయింది. అతడు ఆనందించి సిద్ధోదకపుణ్యతీర్థములో స్నానము చేసినాడు. వెంట వచ్చినమిత్రుడే అతనికి ఉపచారాలు చేస్తున్నాడు.

కుమారుడు చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయినా డని మేరుధ్వజుడు మొదలయినవారు పడినక్షోభ వర్ణనాతీతము. ఉపవాసక్లేశములో ఉన్నప్పటికీ త్రైలోక్యమాలి మేరుధ్వజునిసన్నిధికి భార్యాపుత్రికలలో వెళ్ళి 'ఈవేళ చతుర్దశి. కుమారుడు హరారాధనకై ఎక్కడికో వెళ్ళి ఉంటాడు. తెల్లవారేవరకూ చూతాము. రాకపోతే, అతను ఎక్కడ ఉంటాడో తెలుసుకొని పోదాము. తర్వాత ఏమి కావలసిఉంటే అదే అవుతుంది' అన్నాడు. అందరూ అంగీకరించారు.

ఈలోపల మేఘవనములో గౌరీపూజనముతో ఉంటున్న పద్మావతి ఆనాడు చెలికత్తెలతో ఇలా చెప్పింది: 'సఖులారా, రాత్రి కలకన్నాను. ఒకజడదారి సిద్ధేశ్వరదేవాలయములోనుంచి వచ్చి, బిడ్డా, నీకష్టాలు తీరి పోయినవి, భర్తతో నీకు సమాగమము ఇప్పుడే అవుతుంది. అని వెళ్ళిపోయినాడు. వెంటనే నాకు మెళుకువ వచ్చింది. తెల్లవారింది. ఇక మనము సిద్ధీశ్వరానికే వెళ్ళుదాము. లేవండి.'

పద్మావతి చెలికత్తెలతోసహా బయలుదేరి మేరుపర్వతపార్శ్వములో ఉన్నసిద్ధీశ్వరముచేరింది. అక్కడ సిద్ధోదకతీర్థములో స్నానము చేస్తున్న ముక్తాఫలధ్వజుని దూరమునుంచే చూచి 'సఖులారా' ఆశ్చర్యము! ఆస్నానము చేసేపురుషుడు నాప్రియునిలాగే కనిపిస్తున్నాడు. ఆయనే అవుతాడా? కాక, ఆయనను పోలినమరోమానవుడా?' అని ఆశ్చర్యముతో పలికింది. వాళ్ళు బాగా పరికించి చూచి ఇలా అన్నారు. 'సఖీ ఆయన నీప్రియునివలె ఉండడమే కాదు. ఆయనచెలికాడు నీప్రియుని మిత్రుడైన సంయతకునివలె కనిపిస్తున్నాడు. నీ స్వప్నవృత్తాంతాన్ని బట్టి మాకు తోచేవిషయాలు చెప్తాము. వీరు శాపభ్రష్టులై మానవులై పుట్టినారు. దైవయోగమువల్ల ఇక్కడికి వచ్చారు. అలా కాకపోతే ఈదేవభూమిలో మానవులు అడుగు పెట్టగలరా? సంశయము లేదు. వాళ్ళే'. ఈమాటలువిని పద్మావతి ఈశ్వరార్చనచేసి ఆపురుషుని సంగతి కనిపెట్టడానికి ఆప్రాంతాలలోనే గూఢముగా ఉన్నది.

ముక్తాఫలధ్వజుడు స్నానముచేసి శివార్చనకు ఆలయములోనికి వచ్చి అంతా పరీక్షించి చూచి తనమిత్రుడు మహాబుద్ధితో 'వయస్యా, కలలో నాకు కనబడ్డదేవాలయము ఇదే. లింగాంతరములో కనిపించే గౌరీనాథమూర్తి ఇదే. అంతా రత్నమయము. దివ్యవిహంగాలతో, రత్నాలతో ప్రకాశించేవృక్షరాజములు ఉన్నదివ్యభూమి ఇదే. కలలో కనిపించినకన్య మాత్రము ఇప్పుడు కనబడడం లేదు. ఆకన్యామణి లభించకపోతే ప్రాణ

ములు విడవడము నిశ్చయము' అని దేవళములోనికి వెళ్ళి, శివార్చన చేసి ఇవతలికి వచ్చి మూడుసార్లు ప్రదక్షిణము చేసినాడు. వెంటనే అతనికీ అతనిమిత్రునికీ పూర్వజన్మజ్ఞానము కలిగింది. ఆసంతోషములో మునిగి వారు వెనుకటివృత్తాంతాలు చెప్పుకొంటూ ఉండగా పద్మావతి వారికి కనిపించింది. ముక్తాఫలధ్వజుడు పూర్వజన్మవృత్తాంతము స్మరించి ఆనందముతో ఆమెను చూచి చెలికానితో 'మిత్రమా, రాత్రి స్వప్నములో నేను చూచింది పద్మావతీదేవినే. దైవానుగ్రహమువల్ల ఇప్పుడు నిజంగానే కనిపించింది. ప్రాణేశ్వరిని వెంటనే ఆదరిస్తాను' అని ఆమెసన్నిధికి వెళ్ళి 'దేవీ, వెళ్ళకు. నేను ముక్తాఫలకేతువును, నీవల్ల భుడను, దృఢవ్రతునిశాపముచేత నాకు మానవజన్మ వచ్చింది. ఇప్పుడు పూర్వజన్మ స్మరించాను' అని ఆమెను ఆలింగనము చేసుకోబోయినాడు.

పద్మావతి ఏమీ తోచక అంతర్ధానమయి అక్కడే నిలిచి చూస్తున్నది. అతని వయస్యుడు ఆకాశముకేసి చూస్తూ 'పద్మావతీదేవీ, నీవు ఎవనికోసము మహాతపోవ్రతము అవలంబించి క్లేశములు సహించావో అతనే నీయెదటికి వచ్చి పలకరిస్తే ఉపేక్ష చేశావేమి? నేను సంయతకుడను, నీ చెలికాడను. మీ ఉభయులకోసమూ నేను శాపము పొందాను. నన్ను పలకరించవేమి?' అని మిత్రునితో 'నీకోసమువచ్చిన దైత్యరాజకన్యను నిరాకరించినందులకు ఇది ప్రతిఫలము' అన్నాడు.

పద్మావతి చెలికత్తెలతో 'విన్నారా? ఈయన దైత్యకన్యను స్వీకరించలేదట' అన్నది. 'అవునమ్మా, అంతా సరిపోతున్నది. శాపకాలములో తనమనస్సు నిన్ను విడిచి మరొక యువతిమీదికి పోకుండా ఉండాలని నీప్రియుడు తపోధనమునిని వరము వేడడము నీకు జ్ఞాపకము లేదా? అందుచేతనే ఈమహాశయుడు అన్యకన్యలను అనురాగముతో చూచినట్టు లేదు' అన్నారు చెలికత్తెలు. వారిపలుకులకు ఆమె చాలా సంశయాపన్నురాలయింది.

ముక్తాఫలధ్వజుడు ప్రియురాలు అంతర్ధానము అయినతర్వాత చాలా విచారపడి 'అయ్యో, ప్రాణప్రియా, పద్మావతీ, విద్యాధరదశలో నీకోసము శాపగ్రస్తుణ్ణి అయినాను. ఇప్పుడు నీకోసము నిజంగా ప్రాణాలు విడుస్తున్నాను!' అని దుఃఖించినాడు.

పద్మావతి చెలులతో 'అన్ని గుర్తులూ సరిపోతున్నవి. ఒకవేళ ఈయన ఈసంగతు లన్నీ జనపరంపరవల్ల విన్నా రేమో అనే సంశయము వన్నూ బాధిస్తున్నది. ఈయన దీనవాక్కులు వినలేను. గౌరీమంది రములోకే పోయి అమ్మవారిని అర్చింతాము.' అని పద్మావతి వారితో కూడా అంబికాశ్రమానికి వెళ్ళి దేవీపూజచేసి 'భగవతీ, సిద్ధీశ్వరములో నాకు కనబడ్డపురుషుడు నాపూర్వవల్లభుడే అయినట్టయితే మాకిద్దరికీ వెంటనే సమాగమము అయ్యేలాగున అనుగ్రహించు తల్లీ!' అని ప్రార్థించింది.

సిద్ధీశ్వరములో ఉన్న ముక్తాఫలధ్వజుడు పూర్వసఖుడైన సంయత కుని అవతార మైన మహాబుద్ధితో 'మిత్రమా, పద్మావతి గౌరీ మందిరానికే వెళ్ళిం దనుకొంటాను. మనముకూడా అక్కడికే పోదాము' అని తన విమానమెక్కి అంబికాశ్రమానికే వెళ్ళినాడు. ఆకాశాన విమానములో వచ్చి దిగుతున్న ముక్తాఫలుని పద్మావతి చెలులు దూరానే చూచి 'దేవీ, ఆశ్చర్యము! దివ్యవిమానములో ఆయన ఇక్కడికి వచ్చినాడు. మానవునికి ఇటువంటి ప్రభావ మేలా కలిగింది!' అన్నారు.

'సఖులారా, జ్ఞాపకము చేసుకోండి. ఈయనకు శాపమిచ్చిన దృఢవ్రతుణ్ణి నేను శపించాను. మానవజన్మలో నావల్లభునికి నీవు కామరూపవాహనముకావాలి అన్నాను. కాబట్టి నాప్రాణేశ్వరుడు కామచర విమానరూపము ధరించిన మునిశిష్యునిమీద ఎక్కి స్వేచ్ఛగా సమస్త ప్రదేశాలలో విహారము చేస్తున్నాడు' అని పద్మావతి చెప్పేసరికి

చెలికత్తెలు 'సఖీ, మరి నీకు అంతా తెలిస్తే ఈయనను ఎందుకు ఆదరించవు?' అన్నారు.

'నేను చెప్పినట్లే కావచ్చును. కాని ఇంకా నాకు నమ్మకము కలగ లేదు. నిజంగా ఈయన నాహృదయేశ్వరుడే అయినప్పటికీ నిజ దేహముతో లేడు, అన్యదేహముతో ఉన్నవానిని ఎలా దగ్గిరికి రానివ్వడము? ఇక్కడ చాటుగా ఉండి ఈయనవ్యవహారము కనిపెట్టు దాము' అని పద్మావతి సఖులతోసహా అదృశ్యురాలై అక్కడే ఉన్నది.

ముక్తాఫలుడు విమానము దిగి వయస్యునితో 'మిత్రమా ఈప్రదేశ ములో ప్రియురాలు రాక్షసాంగనల చేతులలోబడి బాధపడ్డది. ఉద్యానములో నాకోసము వెతికి వెతికి వచ్చిన ప్రియురాలిని ఇక్కడ చూచాను. శాపగ్రస్తుడనైన తర్వాత నన్ను అనుసరిస్తున్న ప్రియను తపోధనముని ఇక్కడ వెనకకు మరలించాడు. అటువంటిహృదయేశ్వరి ఇప్పుడు దృష్టిగోచర కాకుండా తప్పించుకొంటున్నది' అని ఆర్తితో పలికినాడు.

చెలులారా, నిజంగా ఈయనే ప్రాణవల్లభుడు. అయినప్పటికీ పూర్వశరీరము ధరించనివానితో కలియడము ఎలాగు? విషమస్థితిలో ఆసిద్ధీశ్వరుడే దిక్కు! స్వప్నములో ఆభగవానుడే సాక్షాత్కరించినాడు. ఆయనే దీనికి ఉపాయము అనుగ్రహించాలి! అని పద్మావతి సఖులతో సహా సిద్ధీశ్వరక్షేత్రానికి వెళ్ళి అక్కడ శివార్చన చేసి 'స్వామీ, పూర్వ శరీరగతుడైననాభర్తను నాకు అనుగ్రహించు. కాదా మరణమైనా అనుగ్రహించు. మూడోమార్గము నాకు తోచడం లేదు' అని ప్రార్థించి ఆలయప్రాంగణములోనే కూర్చున్నది.

ముక్తాఫలుడు గౌరీమందిరములో పద్మావతిని వెతికి వేసారి విచార ముతో 'మిత్రమా, ప్రియురాలు ఇక్కడ లభించలేదు. శివక్షేత్రానికే పోదాము. అక్కడకూడా దొరకకపోతే అగ్నిప్రవేశము చేస్తాను' అని దృఢముగా పలికినాడు.

'నీకు త్వరలోనే శుభముకలుగుతుంది. మునివాక్యమూ, స్వప్నములో మహేశ్వరుని ఆదేశమూ వృథాగా పోతవా ?' అన్నాడు అతనిసఖుడు. అతనితో కూడా విమాన మెక్కి ముక్తాఫలధ్వజుడు సిద్ధీశ్వరము చేరి స్వామి సన్నిధానానికి వెళ్ళి చూచి 'మిత్రమా, ఎవరో పూజ చేసి వెళ్ళినారు. నాప్రియురాలే కావచ్చును. ఆమె ఈప్రాంతాలలో ఎక్కడో ఉంటుంది' అన్నాడు. తర్వాత వారు ఆమెకోసము చాలా వెతికినారు. ముక్తాఫలధ్వజుడు చాలా విలపించినాడు. మిత్రుడు అతనిని ఓదార్చి ఇలా చెప్పినాడు: ఉపవాసాలు చేసి చాలా చిక్కిపోయినావు. భూలోకమూ, పాతాళమూ జయించినవాడవు. ఇలా అధైర్యపడతావేమి? నీవు కనబడకపోతే నీతండ్రి మేరుధ్వజుడు, నీమామ త్రైలోక్యమాలి, నిన్ను వరించిన త్రైలోక్యప్రభ, నీతల్లి వినయవతి, నీతమ్ముడు మలయధ్వజుడూ నీకు ఏదో హాని కలిగిం దని దుఃఖించి ప్రాణాలు విడుస్తారు. వారంతా ఉపవాసాలు చేస్తున్నారుకదా? వెళ్ళి వారిని ఊరడింతాము. సాయంకాల మయినది.'

'నావిమాన మెక్కి నీవు పోయి, వారి నందరినీ ఓదార్చు' అని ముక్తాఫలు డంటే సఖుడు 'నీవిమానము నా కెలా సిద్ధిస్తుంది' శాపవశాన మునిశిష్యుడు వాహన మైనాడు కదా!' అన్నాడు. 'అయితే నీవు కూడా ఇక్కడే ఉండు. ఏమి జరుగుతుందో చూతాము' అన్నాడు రాజకుమారుడు.

సఖులతో కూడా అదృశ్యురాలై ఈమాటలు విన్నపద్మావతి 'చెలులారా, అన్నిగుర్తులూ సరిపోవడముచేత ఈయన నాపూర్వవల్లభుడే. కాని శాపమువల్ల మానవదేహములో ఉండి చాలా శ్రమపడుతున్నాడు. సిద్ధకన్యను పరిహాసించినందుకు నాకు కగిలినశాపఫల మిది!' అని చింతించింది. ఇంతలో చంద్రోదయ మయి, క్రమక్రమంగా వెన్నెలలు వ్యాపించినవి. రాజకుమారుడు విరహవ్యథ భరించలేక బిగ్గరగా

రోదనము చేశాడు. పద్మావతి అదృశ్యురాలుగానే ఉండి 'రాజ కుమారా, నీవు నాప్రాణవల్లభుడవే అయినప్పటికీ పరదేహములో ఉండడముచేత నాకు పరపురుషుడవు కదా? ఈస్థితిలో నీకు నేను పర స్త్రీని. అదు గడుగుకూ ఎందుకు దుఃఖిస్తావు? ఆమునీశ్వరుని వాక్యము సత్యమే అయితే దీని కేదో ఉపాయము కనబడుతుంది' అని బోధించింది.

'నీమాటలు సత్యములే. పూర్వజన్మ స్మరించి మొదటి శరీరము తోనే ఉన్న నిన్ను గుర్తించాను. నీవో నన్ను విద్యాధరశరీరములో చూచావు. మానవాకారములో ప్రస్తుతము కనబడుతున్న నన్ను ఎలా తెలుసు కొంటావు? కాబట్టి వెంటనే నేను ఈపాడు దేహము విసర్జించాలి' అని రాజకుమారుడు మౌనము వహించినాడు. బాగా పొద్దు పోనిచ్చి మిత్రుడు మహాబుద్ధి నిద్ర పోయినతర్వాత ముక్తాఫలుడు నెమ్మదిగా బయలుదేరి శివసాన్నిధ్యానికి వెళ్ళి 'స్వామీ, నీఅనుగ్రహముచేత నాకు వెంటనే పూర్వశరీరము వచ్చి నేను పద్మావతిని కలుసుకొందునుగాక!' అని లింగమూర్తికి ప్రణామము చేసి, అదివరకే పేర్చిఉంచిన చితికి నిప్పు ముట్టించి అగ్నిలో దేహము ఆహుతి చేసినాడు. తర్వాత కొంతసేప టికి సఖుడు మేలుకొని వెతికితే ముక్తాఫలుడు కనబడలేదు. జాజ్వల్య మాన మైనఅగ్నిహోత్రము కనబడ్డది. తనమిత్రుడు అందులో ప్రవే శించి నా డని చాలా దుఃఖించి అతనుకూడా అగ్నిలో దుమికినాడు.

అది చూచిన పద్మావతి చెలికత్తెలతో 'ఛీఛీ! స్త్రీహృదయము వజ్రముకంటెనూ నిష్ఠురము! ఈదుఃఖదాయకఘటన చూచినప్పటికీ నాగుండె అలిసిపోకపోవడమే దీనికి ఉదాహరణము. ఇంకా ఎంత కాలము ఈపాడుశరీరము ధరించి ఉండను! నాకష్టాలు ఇప్పటికీ గట్టెక్కినవి కావు, నా పాపభారమువల్ల ఆముని చెప్పినమాటలుకూడా వృథాఅయిపోయినవి! ఇక మరణమే మంగళము. పరపురుషులమధ్య

అగ్నిలో ప్రవేశించడము అనుచితము. ఉరి పోసుకోవడమే ఉత్తమము' అని శివసాన్నిధ్యములో అశోకవృక్షానికి తీగలతో ఉరి కట్టుకోవడం ప్రారంభించింది. ఇంతలో అక్కడికి తపోధనముని వచ్చి, 'అమ్మా! ఎందుకింత సాహసము? నావాక్కులు వృథా పోవు. శాన్త ధైర్యము అవలంబించు, ఇప్పుడే నీవల్లభుడు ఇక్కడికివస్తాడు. నీవు చేసిన గాఢ తపస్సువల్ల అతనికి శీఘ్రంగా శాపక్షయ మయింది. తపస్సుమీద నీకు ఆసక్తి తగ్గిం దేమి? విషాదం విడిచిపెట్టు. వివాహకాలము సమీపించింది. ధ్యానదృష్టివల్ల అన్ని సంగతులూ గ్రహించి నీదగ్గిరికి వచ్చాను' అని ఆమెను ఓదార్చినాడు. పద్మావతి మునికి మొక్కి ఆందోళనతో ఉన్నది.

తన మానవదేహము దగ్ధ మయినతర్వాత విద్యాధరదేహముతో ముక్తాఫలకేతువు మిత్రునితోసహా అక్కడికి వచ్చినాడు. పరస్పర సందర్శనమువల్ల ఆప్రియులు పరమానందభరితులై మునిపాదాలకు ప్రణామము చేశారు. 'శాపావసానములో మీ కుభయులకూ ఇక్కడ సమ్మేళనము కావడము సంతోషదాయకము' అని ముని వారిని అభినందించాడు.

మేరుధ్వజ మహారాజు ప్రాతఃకాలము అయ్యేసరికి భార్యతో చిన్న కుమారునితో అక్కడికి వచ్చినాడు. త్రైలోక్యమాలి తన పెద్ద కొమార్తెతో పరివారముతో అక్కడికే వచ్చినాడు. ముక్తాఫల కేతువును వారికి చూపి దేవకార్యార్థము శాపవశాన అతను ఎల్లా మానవజన్మ ఎత్తినాడో, ఇప్పుడు విద్యాధరత్వము ఎల్లాపొందినాడో ముని వర్ణించినాడు. ఆవృత్తాంతము వినగానే మేరుధ్వజాదులు అగ్ని ప్రవేశము చేస్తామన్నారు. మునివారికి జ్ఞానబోధ చేసినాడు. తర్వాత వారందరూ ముని ఉపదేశప్రకారము సిద్ధోదకస్నానము శివారాధన చేసి విగతశోకు లయినారు.

త్రైలోక్యప్రభ పూర్వజన్మ స్మరించి 'ఆహా, నేను సిద్ధరాజుపుత్రిక దేవప్రభనుకదా? విద్యాధరాధిపతి నాకు భర్త కావలెనని తపస్సు చేస్తూ, పద్మావతి పరిహసించేసరికి అగ్నిప్రవేశము చేశానుగదా! తర్వాత దైత్యకులములో పుట్టి ఈ రాజకుమారుని వరించాను. ఇప్పు డీయన నిజ విద్యాధరరూపము ధరించినాడు. కాబట్టి నేను ఈ అసుర రూపము విడిచి విద్యాధర దేహము పొందుతాను' అనుకొని తల్లిదండ్రు లకు తన మనో నిశ్చయము తెలియపరచి అగ్నిప్రవేశము చేసింది. నూతన శరీరము పొందిన ఆమెను అగ్నిదేవుడు తీసుకొనివచ్చి 'ముక్తా ఫలకేతూ, ఈమె నాలో పూర్వదేహము విడిచింది. ఈసిద్ధరాజకన్య దేవప్రభను నీవు పత్నిగా స్వీకరించు' అని సెలవిచ్చి అంతర్ధాన మయినాడు.

ఇంతలో ఇంద్రాది దేవతలతో బ్రహ్మ అక్కడికి దయచేసినాడు. విద్యాధరప్రభువు చంద్రకేతుడూ, గంధర్వరాజు పద్మశేఖరుడూ వచ్చినారు. ముక్తాఫలకేతువు అందరికీ వినయపూర్వకంగా నమస్క రించాడు. అతనికి గంధర్వరాజు తనకుమార్తె పద్మావతిని యథావిధిగా ఇచ్చి వివాహము చేసినాడు. సిద్ధరాజు తనపుత్రిక దేవప్రభను అతని కిచ్చి పెండ్లి చేసినాడు.

త్రైలోక్యమాలి త్రిభువనప్రభను మలయధ్వజుని కిచ్చి వివాహము చేసి సపరివారముగా తనరాజధానికి వెళ్లినాడు. మేరుధ్వజుడు మలయ ధ్వజునికి రాజ్యాభిషేకము చేసి భార్యతోకూడా తపోవనానికి వెళ్ళి పోయినాడు. ఇంద్రుడు విద్యుద్ధ్వజుని రాజ్యము ముక్తాఫలకేతువుకు ఇచ్చినాడు. 'ఈముక్తాఫలకేతువు విద్యాధరరాజ్యమూ, అసుర రాజ్యమూ, ఏలుతాడు. దేవతలు నిజస్థానాలకు వెళ్ళవచ్చును' అని ఆకాశవాణి వినబడ్డది. సంతోషించి బ్రహ్మేంద్రాదులు వెడలిపోయి నారు. శాపవిముక్తు డయిన శిష్యునితో తపోధనముని వెళ్ళినాడు.

ఇద్దరుకోడళ్ళనూ కుమారునీ తీసుకొని చంద్రకేతువు విద్యాధర రాజ్యానికి వెళ్ళి కొంతకాలానికి కుమారునిమీద రాజ్యభారము మోపి భార్యతో తపోవనానికి వెళ్ళిపోయినాడు. ముక్తాఫలుడు పూర్వము దేవేంద్రునివల్ల అసురరాజ్యమూ ఇప్పుడు తండ్రివల్ల విద్యాధర రాజ్యమూ పొంది పద్మావతీదేవితో సహా పదికల్పములపాటు ఉభయ సామ్రాజ్యాల మహైశ్వర్యము అనుభవించినాడు. చివరకు సమస్త భోగములూ నిస్సారము లని గ్రహించి ముక్తాఫలుడు వనానికి పోయి తపస్సు చేసి పరమేశ్వర సాయుజ్యము పొందినాడు.

దివ్యహంసలు చెప్పిన ఈయద్భుతకథ విని బ్రహ్మదత్తుడు ఆనందించి వాటివల్ల జ్ఞానోపదేశము పొంది దివ్యగతికి చేరినాడు. అందరూ సిద్ధీశ్వరానికి వెళ్ళి శాపగ్రస్తదేహాలు విసర్జించి, పూర్వమువలెనే మహేశ్వరుని అనుచరు లయినారు.

మునీశ్వరులారా, గోముఖుడు చెప్పిన ఈకథ విని మదనమంచుకా వియోగము సహిస్తూ మనస్సు కొంతవరకు కుదుట పరుచుకొన్నాను.

నరవాహనదత్తచక్రవర్తి చెప్పినఈకథ ఆకర్ణించి గోపాలకుడూ మునులూ సంతోషించినారు.

## విషమశీల లంబకము

### తరంగము : ౧-౨౦

చన్ద్రార్ధనార్ధ దేహాయ
చన్ద్రాంశు సితభూతయే
చన్ద్రార్కానల నేత్రాయ
చన్ద్రార్ధశిరసే నమః!

కరేణ కుఞ్చితాగ్రేణ
లీల యోన్నమితేన యః
భాతి సిద్ధీరివ దద
త్స పాయా ద్వో గజాననః!

అంజలి చంద్రానార్ధదేహునకు,
అంజలి చంద్రాంశుచ్ఛవిభూతి,
కంజలి చంద్రానలార్క నేత్రునకు,
అంజలి చంద్రార్ధమంజుశీర్షునకు !

కరముతో, కుంచితాగ్రంబుతో, లీల
నున్నమితంబుతో నొప్పుచు సిద్ధు
లిచ్చుచున్నవిధాన నెవ్వఁడు తోఁచు,
ఆగజాస్యుడు మిమ్ము నవచును గాక !

## విక్రమాదిత్యుని కథ

తరువాత కశ్యపాశ్రమములో మునులతో నరవాహనదత్తుడు ఈప్రకారముగా చెప్పినాడు: నన్ను వేగవతి తీసుకుపోయి విద్యాహస్తాలలో ఉంచివెళ్ళింది. నూతనప్రదేశములో ఏమీ తోచక ప్రాణాలు విడుతామని అరణ్యములో తిరుగుతూ ఉండగా కణ్వమహాముని కనిపిస్తే నమస్కారము చేశాను. నన్ను చూడగానే ఆయన యోగదృష్టివల్ల నావృత్తాంతము తెలుసుకొని, తనఆశ్రమానికి తీసుకుపోయి కరుణతో 'చంద్రవంశసంభూతుడ వయినప్పటికీ, మహావీరుడ వయినప్పటికీ నీవు మోహాన పడిపోయినావే! దైవనిర్దిష్టమయి అనివార్యమయిన భార్యాసంయోగముమీద నీకు ఆసక్తి పోయిం దేమి! అసంభావ్యసమాగమాలుకూడా నరులకు సంభవిస్తూ ఉంటవే. విక్రమాదిత్యునికథ విను అని ఇలా చెప్పినాడు:

శివక్షేత్ర మయిన ఉజ్జయినీనగరాన్ని మహేంద్రాదిత్యుడు పరిపాలిస్తున్నాడు. ఆయనభార్య సౌమ్యదర్శన, మంత్రి సుమతి, కులక్రమాగత ప్రతీహారుడు వజ్రాయుధుడు. సంతానము లేకపోవడమువల్ల మహారాజు మహేశ్వరుణ్ణి ఆరాధిస్తూ నానావిధవ్రతాలు ఆచరిస్తున్నాడు.

మ్లేచ్ఛోపద్రవమువల్ల ఖిన్నత పొందినఇంద్రాది దేవతలు కైలాసానికి వెళ్ళి పరమేశ్వరునికి నమస్కరించి ఇలా విన్నవించారు: 'దేవదేవా, నీవూ, విష్ణువూ సంహరించిన అసురులు భూలోకములో మ్లేచ్ఛులై పుట్టి బ్రాహ్మణులను సంహరిస్తున్నారు, యజ్ఞయాగాదులు భగ్నము చేస్తున్నారు. మునికన్యలను అపహరిస్తున్నారు. మ్లేచ్ఛులు చెయ్యని దుష్కార్యాలు ఏమున్నవి? భూలోకమువల్ల దేవలోకము సౌఖ్యము పొందుతూ ఉంటుంది. భూమి మ్లేచ్ఛాక్రాంతము కావడమువల్ల దేవలోకము క్షీణిస్తున్నది. కాబట్టి బ్రాహ్మణకార్యాలకు భంగము లేకుండా దేవతాప్రీతి కలిగేటట్టుగా దేవర ఉపాయము యోచించాలి. మ్లేచ్ఛులను రూపు మాపగలిగిన మహావీరుణ్ణి భూలోకానికి పంపాలి.'

ఈప్రార్థన ఆలకించి త్రిపురాంతకుడు వారితో 'మీరు వెళ్ళండి. నేను ఆలోచించి త్వరలోనే ప్రతిక్రియ చేస్తాను' అని వారిని పంపించి మాల్యవంతు డనేగణోత్తముని పిలిచి 'వత్సా, నీవు భూలోకములో ఉజ్జయినీ నగరాధిపతి మహేంద్రాదిత్యనృపాలునికి పుత్రుడవుగా పుట్టవలె. అతడు నా అంశాన జన్మించినాడు. అతనిరాణి అంబికాదేవి అంశాన పుట్టింది. నీవు వారిబిడ్డడవై దేవకార్యము నిర్వహించవలె. నావరమువల్ల నీవు సమస్త భూమండలానికీ చక్రవర్తి వవుతావు. యక్షరాక్షసబేతాళులు నీకు వశవర్తులై ఉంటారు. దేవకార్యము నెరవేర్చినతర్వాత నీవు మళ్ళీ నాసన్నిధానానికి వత్తువుగాని' అని ఆన తిచ్చినాడు.

'దేవా, ఆజ్ఞ మీరలేను. కాని మానవజన్మలో సుఖమెక్కడిది? దుఃఖాలు చాలా మెండు, బంధుమిత్ర భృత్యాదుల వియోగాలు దుస్సహా

ములు. పైగా ధనాభావము, రోగము, వార్ధకము ఇలాటివాటిమాట వేరే చెప్పడమెందుకు? అని మాల్యవంతుడు విన్నవిస్తే 'వో, నీకు భయము లేదు. సిద్ధోపికి దుఃఖాలు సంప్రాప్తము కావు. నా అను గ్రహమువల్ల నీకు నిరంతరమూ సౌఖ్యమే ఉంటుంది' అని మహేశ్వ రుడు మందలించినాడు.

మాల్యవంతుడు అదృశ్యుడై ఉజ్జయినికి వెళ్ళి బుకుమతి అయిన రాణిగర్భములో ప్రవేశించినాడు. మహేశ్వరుడు రాజుకు స్వప్నములో దర్శన మిచ్చి 'రాజన్, నీభక్తికి సంతోషించాను. మహావీరుడూ సార్వ భౌముడూ అయ్యేకుమారుడు నీకు కలుగుతాడు. వాడు ఆకాశభూపా తాళాలలో ఉండేయక్షరాక్షసపిశాచాదులను వశవర్తులను చేసుకొని మ్లేచ్ఛసమూహాలను సంహరిస్తాడు. అందువల్ల విక్రమాదిత్యుడనేనామ ధేయమూ, శత్రువులలో వాడు చేసేవైషమ్యమువల్ల విషమశీలు డనే నామాంతరమూ ఉంటవి' అని అనుగ్రహించి అంతర్థాన మయినాడు. తెల్లవారినతర్వాత రాజు మంత్రులకు స్వప్నవృత్తాంతము చెప్పినాడు. వారు చాలా సంతోషించి పుత్రుడు తప్పకుండా కలుగుతా డన్నారు.

ఇంతలో అంతఃపురములోనుంచి చేటిక వచ్చి పండుచూపి ఈఫలము రాణికి స్వప్నములో మహేశ్వరుడు అనుగ్రహించినాడు' అని విన్న వించింది. మంత్రులు అధిపతిని అభినందించారు. ఈశ్వరానుగ్రహము వల్ల తనకు కుమారుడు కలుగుతా డని రాజు చాలాసార్లు అనుకొంటూ ఆనందించాడు.

మాసములు నిండగానే రాణి కొడుకును కన్నది. శివాజ్ఞనుబట్టి మహేంద్రాదిత్యుడు పుత్రునికి విక్రమాదిత్యుడు అనీ విషమశీలుడు అనీ పేర్లు పెట్టినాడు.

తర్వాత కొద్దిరోజులకు మంత్రిసుమతికి కుమారుడు కలిగితే మహా మతి అని పేరు పెట్టినారు. క్రమేణ ప్రతీహారుడు వజ్రాయుధునికి భద్రా

యుధుడూ, పౌరోహితుడు మహీధరునికి శ్రీధరుడూ, పుత్రులు పుట్టినారు.

పెరిగి పెద్దవాడయినతర్వాత విక్రమాదిత్యునికి తండ్రి యౌవరాజ్యాభిషేకము చేసి, భార్యాసచివాదులతో వారణాసికి వెళ్ళి విశ్వేశ్వరుని శరణుజొచ్చినాడు. విక్రమాదిత్యుడు సమస్తసద్గుణోపేతుడై మహావీరుడై, ప్రపంచము జయించి ప్రజలను తండ్రివలె రక్షిస్తూ రాజ్యము చేస్తున్నాడు.

ఒకనాడు విక్రమాదిత్యుడు కొలువు తీర్చిఉన్నప్పుడు ప్రతీహారుడు భద్రాయుధుడు వచ్చి 'దేవా, దక్షిణాపథము జయించడానికి సేనాసమేతముగా వెళ్ళినవిక్రమశక్తివద్దకు దేవరవారు పంపినదూత అనంగదేవుడు ఎవనినో వెంట బెట్టుకొని వచ్చి ద్వారముదగ్గర ప్రతీక్షిస్తున్నాడు. ఆనందపూర్ణమైన ఆయనముఖము చూస్తే శుభవార్త తెచ్చినా డనిపిస్తున్నది' అని విన్నవించినాడు. రాజాజ్ఞ పొంది భద్రాయుధుడు వారిని కొలువుకూటములో ప్రవేశపెట్టినాడు. ఇద్దరూ రాజుకు ప్రణామము చేసి జయశబ్దము పలికి అనుమతిమీద కూర్చున్నారు. రాజు దూతను చూచి 'సేనాపతి విక్రమశక్తికి కుశలమేనా? వ్యాఘ్రబలాదిరాజులూ, సేనలో రాజపుత్రు లందరూ, సుఖంగా ఉన్నారా? భటులకూ ఏనుగులకూ గుర్రాలకూ క్షేమమేనా?' అని అడిగినాడు. అనంగదేవుడు ప్రభువుతో 'దేవా, విక్రమశక్తికీ సమస్తసైన్యానికీ క్షేమమే. పశ్చిమదిక్కుతో సహా దక్షిణదిక్కును దేవర జయించారు. సౌరాష్ట్రములో కలిపి మధ్యదేశమూ, అంగవంగములతో సహా తూర్పుదిక్కూ, కాశ్మీరముతోపాటు ఉత్తరదిక్కూ దేవరవారికి కప్పము కట్టుతవి. మ్లేచ్ఛసమూహాలు హతమారి పోయినవి. ఓడిపోయినవా రంతా విక్రమశక్తిపరివారములో ప్రవేశించారు. దేవా, విక్రమశక్తి వా రందరితోనూ దేవరదర్శనము త్వరలోనే చేస్తాడు' అని విజ్ఞాపన చేసినాడు. రాజు అతనికి వస్త్రాలంకారగ్రామములు బహూక

రించి, 'అనంగ దేవా, నీవు ఏయే దేశాలు చూచినావో, ఎక్కడెక్కడ ఏయేవిచిత్రాలు చూచావో వివరించు!' అనిఅడిగినాడు. అనంగదేవుడు ఇలా చెప్పినాడు :

దేవా, ఇక్కడ బయలుదేరి విక్రమశక్తివద్దకు వెళ్ళినాను. అతడు నన్ను సత్కరించినాడు. నేనను పరీక్షిస్తూ కలిగినజయములనుగురించి పరామర్శ చేస్తూ ఉన్నాను. అక్కడికి సింహళప్రభువుదూత వచ్చి విక్రమశక్తితో, 'ఆర్యా, మహారాజుగారికి అంతరంగికుడైనఅనంగ దేవుడు నీవద్దకు వచ్చినట్టు తెలిసి ఆయనతో ముఖ్యముగా మాటాడ వలసినసంగతి ఉండముచేత శ్రీఅనంగదేవుని నావద్దకు పంపవేడుతాను అని మాప్రభువు నీకు విన్నవించడానికి నన్ను పంపినాడు' అని సందేశము చెప్పినాడు. విక్రమశక్తి వెంటనే నాకు ప్రయాణము ఏర్పాటు చేసినాడు.

ఆదూతతో నేను సముద్రమార్గాన ఓడలో సింహళ ద్వీపము చేరి, రాజధానిలో ప్రవేశించి సింహళప్రభువు వీరసేనుని దర్శనము చేసినాను. మర్యాదలన్నీ జరిగినమర్నాడు రాజు నన్ను తనఆస్థానానికి పిలిపించి 'ఆర్యా, నాకుమార్తె మహాసుందరి. నామము మదనలేఖ. మీప్రభువుకు నాబిడ్డ తగినది. మీస్వామికి మా మదనలేఖను సమర్పించడానికే నిన్ను ఇక్కడికి పిలిపించాను. దూతతో సహా వెళ్ళి ఈవృత్తాంతము మీమహారాజుకు విన్నవించు. త్వరలోనే నాపుత్రికను అక్కడికి పంపుతాను' అని చెప్పి మదనలేఖను ఆస్థానములోకి రప్పించి ఒడిలో కూర్చోబెట్టుకొని 'మీ మహారాజుకు మా మదనలేఖను సమ ర్పిస్తున్నాను' అని నాతో అన్నాడు. 'మాప్రభువుకోసము ఈమెను స్వీకరిస్తున్నాను' అన్నాను నేను.

రాజు నన్ను సత్కరించి దూత ధవళసేనుని నావెంట పంపినాడు. మేము ఓడ యెక్కి ప్రయాణముచేస్తూ ఉండగా సముద్రములో గొప్ప యిసుకదిబ్బ కనబడ్డది. దానిమీద ఇద్దరు మహాసౌందర్యవతులు

గోచరించారు. ఒకతె క్రీడాంకురితవలె శ్యామాంగి, రెండో ఆమె చంద్రకాంతివలె సకలకళలు. వారు పక్షుల్ని పెట్టుతూ పెంపుడులేడి పిల్లను ఆడిస్తున్నారు. ఆ లేడిపిల్లశరీరమునిండా రత్నాలు ఉన్నవి, దేహము సువర్ణమయము. అయినప్పటికీ అది సజీవముగా గంతులు వేస్తున్నది. మేము ఆశ్చర్యముతో చూస్తున్నాము. ఇంతలో గాలి చెలరేగింది. ఓడ అటూ ఇటూఅయి మునిగిపోయింది. చాలామంది జలములో మునిగి ప్రాణాలు కోలుపోయినారు. ఆ కన్యలు వచ్చి మా యిద్దరినీ ఇసుకదిబ్బమీదికి చేర్చి తర్వాత ఏదోగుహలోకి తీసుకు వెళ్ళినారు. అక్కడ మహావనమూ అందులో సరోవరమూ కనిపించినవి. సపరివారముగా స్నానార్థము సరస్సుకు ఎవరో స్త్రీరత్నము వచ్చింది. ఆమె మేనాలోనుంచి దిగి కమలాలు కోసి స్నానముచేసి, మహేశ్వర స్తుతి చేసింది. శివుడు లింగాకారముతో సరస్సులోనుంచి ఆవిర్భవించి ఆమెవద్దకు వచ్చినాడు. ఆమె మహావైభవంగా శివార్చన చేసి వీణ వాయించ సాగింది. ఆగానానికి ఆకాశమార్గాన వచ్చిన సిద్ధాదులు కూడా నిశ్చేష్టు లయినారు. గానానంతరము ఆస్త్రీరత్నము లింగ మూర్తిని ఉద్వాసన చేసింది. లింగము సరస్సులోకి అంతర్ధానమయింది. తర్వాత ఆమె పరివారముతో బయలుదేరింది. ఆమె ఎవ రని నేను ఎంత అడిగినా పరిజనులు బదులుచెప్పలేదు. అప్పుడు నేను బిగ్గరగా 'కల్యాణీ, నీవు ఎవరో చెప్పకుండా వెళ్ళిపోతే నేను శ్రీ విక్రమాదిత్య సార్వభౌముని పాదము ముట్టి శాపమిస్తాను సుమా!' అన్నాను. వెంటనే ఆమె పరివారాన్ని పక్కకు పంపి శిబిక దిగి వచ్చి 'ఆర్యా, శ్రీవిక్రమాదిత్యదేవునకు కుశలమా! అనంగదేవా, నిన్ను అడగడ మెందుకు! ఆయనపనికోసమే నిన్ను ఇక్కడికి రప్పించాను మాయపన్ని. ఆ పూజ్యుడు నన్ను మహాభయమునుంచి రక్షించినాడు. మామందిరానికి రావలె. అక్కడ సమస్తమూ నీకు వివరిస్తాను' అని ఆమె కాలి నడకను మమ్మలిని నిజనివాసానికి తీసుకు వెళ్లింది.

## త రం గ ము : ౧౨.

## మ ద న మం జ రి క థ

అనంగదేవుడు ఆస్థానానికి వచ్చిన విక్రమాదిత్యునితో ఇలా పలికినాడు:

భోజనానంతరము ఆమె సభామధ్యములో ఉండి నాతో అన్నది "అనంగదేవా, సంగతి పూర్తిగా చెపుతున్నాను. కుబేరసోదరు డైన మణిభద్రుని భార్యను, యక్షరా జైన దుందుభికుమార్తెను, మదనమంజరిని. నేను భర్తతో మందిరోద్యాన కాసారాలలో విహరిస్తూ ఉండగా ఒకవిశేషం జరిగింది. మకరందోద్యానంలో ప్రియునితో నే నుండగా తెల్లవారుజామున కాపాలికుడు విహారంలో అలిసిపోయి విశ్రాంతి తీసుకొన్న నన్ను చూచి కామించినాడు. నేనతనిభార్య కావా లని మంత్రపూర్వకంగా హోమకర్మ ఆరంభించినాడు. సంగతి కనిపెట్టి భర్తకు తెలియచేశాను. ఆయన కుబేరునితో మనవి చేసుకొన్నాడు. కుబేరుడు బ్రహ్మతో చెప్పినాడు. బ్రహ్మ కొంతసేపు ధ్యానం చేసి ఇలా ఉపాయము చెప్పినాడు: "కుబేరా! నీ తమ్ముడిభార్యను కాపాలికుడు ఎత్తుకొని పోదా మనుకొంటున్నాడు. మంత్రప్రభావము అలాంటిదే కదా! మంత్రము ఆమెను ఈడ్చుకు పోతూవుంటే విక్రమాదిత్యుణ్ణి రక్షించమని ఆమె వేడుకోవలె. అతను ఆమెను తప్పకుండా రక్షిస్తాడు." కుబేరుడు బ్రహ్మ చెప్పినఉపాయము సోదరునితో చెప్పినాడు. శ్మశానములో కాపాలికుడు మంత్రాన్ని సాధించి నామీద ప్రయోగించినాడు. మంత్రాకర్షణ వల్ల నేను శ్మశానంలో ప్రవేశించాను. శవంమీద కూర్చుని కాపాలికుడు హోమం చేయగా కళ్ళారా చూచినాను. అతను గర్వంవల్ల కన్నూ మిన్నూ తెలియక నన్ను చూచి మంత్రసిద్ధి అయిందని తలచినాడు. దైవవశాన వాడు

దాహము తీర్చుకోడానికి దగ్గరే ఉన్న సెలయేటికి వెళ్ళినాడు. బ్రహ్మ చెప్పిన ఉపాయము స్మరించి 'హా విక్రమాదిత్య మహారాజా! లోకరత్నా మణీ! నన్ను రక్షించవా' అని ఆక్రందించాను. వెంటనే అగ్నిహోత్రం జ్వలించినరీతిగా విక్రమాదిత్యభూపాలుడు నాదగ్గిరికి వచ్చి అభయ మిచ్చినాడు : "కల్యాణీ! భయపడకు. నిన్ను రక్షిస్తాను. నారాజ్యంలో అధర్మము నిలవదు.' మహారాజు అలా అని వెంటనే బేతాళుని పిలిచి నాడు. తక్షణం బేతాళుడు రాజసన్నిధికి వచ్చినాడు. అతనికళ్ళు నిప్పుకణికలవలె ఉన్నవి. అతను రాజుకు నమస్కారం చేసి "రాజేంద్రా, నావల్ల మీకు ఏసహాయం కావాలి? ఆజ్ఞ ఇవ్వండి" అన్నాడు. రాజు "బేతాళా! పరదారను అపహరించాలని ఈకాపాలికుడు దుర్బుద్ధితో ఉన్నాడు. వీణ్ణి చంపి భక్షించు" మని ఆజ్ఞ చేసినాడు.

బేతాళుడు పూజామండలములో ఉన్నశవదేహములో ప్రవేశించి నాడు. కాలికుడు మంచినీళ్ళు తాగి తిరిగి రాగానే బేతాళుడు అతన్ని తరిమి పిక్కలు పట్టుకొని నేలమీద కొట్టినాడు. వెంటనే కాపాలికుడు చనిపోయినాడు. భూతములు అతనిమాంసము తినవలె నని వచ్చినవి. ఆభూతాల్లో యమశిఖు డనేబేతాళుడు పోగరుబోతుతనంకొద్దీ వచ్చి కాపాలికకళేబరము పుచ్చుకొన్నాడు. కాపాలికుణ్ణి చంపిన అగ్నిశిఖు డనేబేతాళుడు యమశిఖునితో "ఎవడవురా నువ్వు? విక్రమాదిత్య మహారాజు ఇచ్చినఆజ్ఞాప్రకారం కాపాలికుణ్ణి వధించాను. ఈకళేబరము నీ కెందుకు?" అని గద్దించినాడు. యమశిఖుడు "మీమహారాజు అంత గొప్పవాడా? ఆయనగొప్పతనం ఏమిటి కాస్త చెప్పు" అనిఅడిగినాడు.

అగ్నిశిఖుడు ఇలా సమాధాన మిచ్చినాడు: 'ఆయన ప్రభావము వింటావా! ఈనగరంలో డాకినేయు డనేజూదగాడు ఉన్నాడు. ఒక సారి జూదగాళ్ళు అతన్ని పూర్తిగా ఓడించి అతనిఇల్లు గుల్లచేశారు. డాకినేయుడు పూర్తిగా బాకీతీర్చుకపోవడంవల్ల తక్కినవాళ్ళు అతన్ని

కట్టివేసి చావచితక కొట్టినారు. డాకినేయుడు చనిపోయినవాడివలె కొయ్యబారినట్టున్నాడు. వాడు జీవిస్తే తమకు అపకారం జరుగుతుందని భయపడి జూదగాళ్ళు వాణ్ణి మోసుకొనిపోయి కన్ను పొడుచుకొన్నా కానరానిచీకట్లో, పాడునూతిలో పడేశారు. డాకినేయుడు లోతైననూతిలో ఇద్దరుభీకరాకారులైనపురుషులను చూచినాడు. వాళ్ళు "ఎవరు నువ్వు? ఎందుకిలానూతిలో పడ్డావు? అని అడిగినారు. ఆజూదగాడు తనసంగతి యావత్తూ వారికి చెప్పి, వారివృత్తాంతము అడిగినాడు. ఆఇద్దరూ ఇలా చెప్పినారు: 'మేము ఈనగరశ్మశానంలో బ్రహ్మరాక్షసులము. ఇక్కడే మంత్రికుమార్తెను, వర్తకునిపుత్రికను పట్టుకొన్నాము. ఎటువంటి మంత్రవేత్తకూడా ఆకన్యలను విడిపించలేడు. తండ్రులమైత్రివల్ల కన్యలిద్దరూ ఒక తావునే ఉన్నారు. విక్రమాదిత్య మహారాజు మంత్రిమీదా, వర్తకునిమీదా ప్రీతివల్ల కన్యల్ని రక్షించాలని వచ్చినాడు. ఆరాజేంద్రుని చూచి మేము భయపడి పారిపోయాము. కొంతమేర పరిగెత్తినాము. రాజేంద్రుని మంత్రప్రభావంవల్ల కట్టుబడిపోయినాము. మాఅవస్థచూచి రాజు "పాపాత్ములారా! మీరు సంవత్సరం పాటు ఈపాడునూతిలో ఉండండి. విడుదలయినతర్వాత తిరిగి మీరు పాడుపనులు చేస్తే దండనతప్పదు" అని ఆజ్ఞచేసి మమ్మల్ని నూతిలోనికి తోసివేసినాడు. ఆయన దయ తలిచి మమ్మల్ని చంపను మాత్రం చంపలేదు. మాకు ఇంకా ఎనిమిదిరోజులు నూతిలో నివాసం. ఆకలితో అటమటించి పోతున్న మాకు అన్నం పెడితే నిన్ను నూతిలోనుంచి ఉద్ధరిస్తాము. మమ్మల్ని మోసం చేస్తే పైకి వచ్చి ప్రాణాలు తీస్తాము, నిన్ను భక్షిస్తాము."

బ్రహ్మరాక్షసులకు డాకినేయుడు భోజనము పెట్టడానికి అంగీకరించినాడు. ఒడంబడికప్రకారం రాక్షసులు అతన్ని నూతిలోనుంచి ఉద్ధరించారు. రాక్షసులకోరిక తీర్చేఉపాయాంతరం తోచక డాకినేయుడు

రాత్రి శ్మశానంలో 'మహామాంసము విక్రయిస్తున్నాను. ఎవరికైనా కావాలా?' అని కేకలుపెట్టినాను. అప్పుడు నే నా కేకలు విని 'సరే, మాంసముకొంటాను. ఎంత కమ్ముతావు?" అని అడిగినాను. డాకినేయుడు "నీరూపప్రభావాలు నా కియ్యి" అని అడిగినాడు. "అవి నీ కెందుకయ్యా వీరుడా!" అని ప్రశ్నించినాను. "నీరూపప్రభావాల వల్ల నాశత్రువులైనజూదగాళ్ళను ఆకర్షించి నూతిలోకి తోస్తాను. ఆజూదగాళ్లే బ్రహ్మరాక్షసులకు ఆహారంకావాలి." డాకినేయుడు కోరినప్రకారం నారూపప్రభావాలు ఇచ్చివేసినాను. నామంత్రాకర్షణ వల్ల వారంరోజులపాటు డాకినేయుడు జూదగాళ్ళను నూతిలోకి తోసినాడు. బ్రహ్మరాక్షసులకు పుష్కలంగా ఆహారం లభించింది. తర్వాత నేను నారూపప్రభావాలను డాకినేయునిదగ్గరనుంచి పుచ్చుకొన్నాను. డాకినేయుడు అది చూచి భయపడ్డాడు. "ఈఎనిమిదోనాడు బ్రహ్మరాక్షసులకు తిండి పెట్టలేకపోయినాను. వాళ్ళు నూతిలోనుంచి పైకి వచ్చి నన్ను భక్షిస్తారు. నామిత్రుడివి కనుక అపాయము ఎలా తప్పించుకోవాలో చెప్పు" అని డాకినేయుడు నన్ను అడిగినాడు. "ఆజూదగాళ్ళను రాక్షసులకు ఆహారముగా ఇచ్చావు. నీకోసము ఆరాక్షసులను నేను భక్షిస్తాను. చూపవయ్యా వాళ్ళను!" అన్నాను నేను. డాకినేయుడు వెంటనే నన్ను రాక్షసుల నూతివద్దకు తీసుకు వెళ్లినాడు. నేను తలవంచి, నూతిలోకి చూస్తూ ఉండేసరికి ఆ జూదగాడు నన్ను మెడ పట్టి నూతిలోనికి తోసివేసినాడు. రాక్షసులు నన్ను పట్టుకొన్నారు. మాకు ముష్టియుద్ధము జరిగింది. నాదెబ్బలకు తట్టుకోలేక వాళ్ళు 'నీ వెవరు?' అని ప్రశ్నించారు. నేను డాకినేయుని వృత్తాంతము చెప్పిన మీదట మాకు వైరము పోయి మైత్రి యేర్పడ్డది. "నీకూ, మాకూ, ఆజూదరులకూ డాకినేయునివల్లనే ఈ అవస్థ పట్టింది.' స్నేహము, దయ కృతజ్ఞత మొదలైనవి జూదగాళ్ళకు ఉండవు. వాళ్ళను నమ్మరాదు.

మోసమే వాళ్ళ ప్రవృత్తి. సాహసము, పరపీడనము వాళ్ళకు సహజము. దృష్టాంతంగా ఈకథ వినండి" అని వాళ్లు ఇలా ప్రారంభించారు.

## ఠింఠాకరాళుని కథ

ఈఉజ్జయినిలోనే పూర్వము ఠింఠాకరాళు డనే ద్యూతకారుడు ఉండేవాడు. వాడు రోజూ జూదంలో కొందరిని గెలిపించేవాడు, కొంద రిని ఓడించేవాడు. గెలిచినవాళ్లు రోజూ వాడికి నూరుగవ్వలు ఇచ్చి వెళ్ళేవారు. వాడు రాత్రి గోధుమపిండికొనితెచ్చుకొని, కుండపెంకులో వేసి, నీరుకలిపి మర్దించి, శ్మశానానికి వెళ్లి చితాగ్నిలోరొట్టెలు కాల్చు కొని, మహాకాళీదేవాలయానికి వచ్చి, అక్కడ అఖండదీపంలో ఉన్న నెయ్యి తీసి రొట్టెలకు రాచుకొని తిని, ఆలయప్రాంగణంలోనే తల కింద చెయ్యిపెట్టుకొని పడుకొని నిద్రపోయేవాడు. ఒకరాత్రి వాడికి నిద్ర పట్టలేదు. అక్కడ మంత్రప్రభావమువల్ల మాతృమండల యక్షాది ప్రతిమలు కదలడము వానికంటపడ్డది. ఠింఠాకరాళునికి ఆలోచన తట్టింది. ఇక్కడ ధనము సంపాదించే ఉపాయము ఎందుకు చెయ్య కూడదు? లాభిస్తే మంచిదే, లాభించదూ? నష్టం లేదు" అనుకొనివాడు "దేవతలారా, రండి, జూదానికి. ఆడించేదీ నేనే, ఆడేదీనేనే. గెలవగానే ధనం ఇచ్చివెయ్యాలి. ఇదే షరతు" అన్నాడు. వాడు ఆహ్వానించి నప్పటికీ దేవతలు ప్రత్యుత్తర మియ్యలేదు. కరాళుడు పందెము ఏర్పాటుచేసి, రంగురంగులగవ్వలు ముందుకు వేసినాడు. గవ్వలు వేసేటప్పుడు అవతలవాళ్లు వద్దు అనకపోతే జూద మాడడానికి అంగీక రించినట్టే అని ద్యూతకారుల నిర్ణయము. అందుచేత వాడు ఆట ఆడి, చాలా ధనము గెలిచి సువర్ణము ఇమ్మని దేవతలను అడిగితే ఆప్రతి మలు మాటాడలేదు. ఎన్నిపర్యాయాలు అడిగినా ప్రతిమలు మౌనము వహించి ఉండడముచేత ఠింఠాకరాళుడు మండిపడి, "సరే, అలాగే

ఉండండి. జూదంలో ఓడిన ధనము ఇవ్వక, బిల్లంగోట్లున్న రాయివలె ఉంటే జూదగాళ్ళకు చేసేమర్యాద మీకు చేస్తాను. యముని కోరలవలె తీక్ష్ణమైనరంపములతో మీశరీరాలు కోసివేస్తాను. నాకు దయాదాక్షిణ్యాలు లేవు" అని వెళ్ళి రంపము తెచ్చినాడు. మాతృదేవతలు వాడికి ధనము ఇచ్చివేశారు.

ఠింఠాకరాళుడు పగటివేళ ద్యూతశాలలో ఆధనమంతా పందెము వేసి ఓడిపోయి, రాత్రివేళ వెనకటి విధాన మాతృదేవతలవద్ద ధనము సంపాదించి, ఓడిపోతూ ఉన్నాడు. మాతృదేవతలు దీనవదనాలతో ఉండడము చూచి ఒకరాత్రి చాముండాదేవి "మాతృదేవతలారా, మీసంగతి తెలిసింది. ఆటకు వాడు పిలిచినప్పుడు 'మేము రాము' అంటే మిమ్మలిని వాడు విడిచిపెట్టి తీరాలి. అలా చేసి వాడి ఉపద్రవము తప్పించుకోండి" అని చెప్పింది. మాతృదేవతలు అలాగే చేశారు. వారు నిరాకరించినతర్వాత ఠింఠాకరాళుడు మహాకాళస్వామినే జూదానికి ఆహ్వానించినాడు. "ఆటలోనుంచి నేను తొలిగిపోయాను. రాను" అని స్వామి ఆన తిచ్చినాడు. దేవతలకు ద్యూత మర్యాద తెలిసిందని గ్రహించి, మహాదేవునే ఆశ్రయిస్తే మంచిదనిభావించి వాడు ఈశ్వరుని బహువిధాల స్తోత్రము చేసి సంప్రీతుని చేసి, భైరవాజ్ఞా ప్రకారము సమస్తభోగములూ పొంది ఆలయములో ఉంటున్నాడు.

ఒకరాత్రి దేవతలు మహాకాళ పుష్కరిణిలో స్నానము చేస్తూ ఉండగా, భైరవునిఆజ్ఞాప్రకారము ఠింఠాకరాళుడు గట్టున ఉన్న దేవాంగనలచీరలు అపహరించి తెచ్చినాడు. ఆడవాళ్ళందరూ "మమ్మల్ని దిగంబరలను చెయ్యకండి" అంటూ అతనిని వేడుకొన్నారు. 'కళావతిని నాకిస్తే మీబట్టలు మీకు ఇచ్చి వేస్తా" నని సమాధానము చెప్పినాడు. కళావతికి ఇంద్రదత్తమైనశాపము ఉన్నట్టుగా దేవాంగనలు జ్ఞప్తికి తెచ్చుకొని ఠింఠాకరాళుడు చెప్పినదానికి అంగీక

రించినాడు. దేవతలు వెళ్ళిపోయినతరువాత అతను కళావతితో సుఖంగా ఉంటున్నాడు. ఆమె అతనితో "నాథా! ఇంద్రశాపంవల్లనే కదా మీరు నాకులభించారు!" అని సంతోషంతో పలికింది. అతను భార్యను శాపకారణము అడిగినాడు. ఆమె ఇలా చెప్పింది: "వనంలో దేవత లుండగా నేను చూచి మానవలోకంలో సుఖాలను మెచ్చుకొన్నాను, దేవభోగాలను నిందించాను. అందువల్ల ఇంద్రునికి కోపం వచ్చి నన్ను శపించగా మానవునిభార్య నైనాను. మనసంయోగానికి ఇంద్రశాపమే ముఖ్యకారణం. రేపు స్వర్గానికి వెళ్ళవలసినపని వచ్చింది. ఇంద్రసభలో రంభ సరికొత్త నాట్యము చేస్తుందట. అది పూర్తి అయ్యేదాకా మేము అక్కడే ఉండాలి." ఠింఠాకరాళుడు అనురక్తితో 'నన్నుకూడా నీతో తీసుకుపో' అని అడిగినాడు. ఆఖరికి అతనిమాట ఆమె తీసివెయ్యలేక పోయింది.

తెల్లవారిన తరువాత కళావతి చెవిలో కలువపూవులో భర్తను దాచి దేవేంద్రభవనానికి తీసుకువెళ్ళింది. ఆమందిరాన్ని చూచి అతను సంతోషించినాడు. సభలో రంభానృత్యమును ఠింఠాకరాళుడు కన్నులార కాంచినాడు నృత్యానంతరము ఛాగభండుడు మేకరూపులో ఉండి నర్తించాడు. ఠింఠాకరాళుడు ఇదివరలో ఆమేకను ఉజ్జయినిలో చూచాడు. దానిని అతను గుర్తుపట్టి దివ్యమాయకు ఆశ్చర్యపడ్డాడు. ఇంద్రసభ అయినతరువాత కళావతి ప్రియుణ్ణి భూలోకానికి తీసుకుపోయింది. అక్కడ ఠింఠాకరాళుడు మేకరూపులో ఉన్నభండుని చూచి 'ఇంద్రునిదగ్గిర ఎలా నాట్యం చేశావో అలాగే ఇక్కడ కూడా చెయ్యి. లేకపోతే ఊరుకోను' అని బెదిరించినాడు. మేక అతనిమాటలు విని తెల్లపోయింది. ఠింఠాకరాళుడు దుడ్డుకర్రతో మేక తలమీద కొట్టినాడు. రక్తం కారింది. అది ఇంద్రునిదగ్గిరికి వెళ్ళి జరిగిన దంతా చెప్పింది. దేవేంద్రుడు యోగదృష్టివల్ల కలావతి ఠింఠాకరాళుని దేవ

లోకంలోకి తీసుకొని రావడం కై ఎత్తుకొచ్చాడు. కోపముతో యానకళా కళావతిదే కనక ఇంద్రుడు దానిని ఇలా శపించినాడు : "మానవప్రియురాలి మమకారంవల్ల నీవు తింతాక రాజును ఇంద్రసభలో తానికి తీసుకొనివచ్చావు. ఘాగభంమునికి అపస్థ పట్టింది. ఈ అపరాధమువల్ల నీవు నాగపురములో నరసింహరాజు కట్టించిన దేవాలయస్తంభములో రాతిబొమ్మగా మారిపోవలె." కలావతి నెత్తి నోరూ బాదు కొంటూ శాపావసానము కోరింది. ఇంద్రుడు ఇలా అనుగ్రహించినాడు: "ఆ నరసింహరాజు కట్టించిన దేవాలయము ఎప్పుడు నాశన మైతే అప్పుడే నీశాపము తీరిపోతుంది." ఆమె తింతాకరాజునకి తనశాపవిషయము చెప్పి తన నగలన్నీ అతని కిచ్చి నాగపురములో దేవాలయస్తంభ సాలభంజికగా మారిపోయింది. ప్రియావియోగమువల్ల తింతాకరాజు మూర్ఛపాలై తెలివొంది తననోటిమాట జారినందుకు విచారించినాడు. ధైర్యము తెచ్చుకొని అతను ప్రియురాలిశాపము తీర్చవలెనని యత్నించినాడు.

అతడు సన్యాసివేషము ధరించి నాగపురం వెళ్ళినాడు. అక్కడ శ్మశానవాటికలో నలుదెసలా భూమిలో గోతులు తీసి అతను ప్రియురాలిఆభరణాలను దాచిపెట్టినాడు. ఆమెధరించేమహారత్నాలను ఊళ్ళో దేవాలయముఎదుట పాతిపెట్టినాడు. ఏటిగట్టున పర్ణశాల వేయించుకొని తింతాకరాజును మాయతపస్సు ఆరంభించాడు. మూడు పూటలా స్నానము చేసేవాడు. క్రమేణా అతను మహాతాపసి అని ప్రతిష్ఠ సంపాయించాడు. మహారాజుకు అతని సంగతి తెలిసింది. రాజు స్వయంగా కరాజుదర్శనముచేసి వెళ్ళిపోతూఉండగా దూరంగా ఉన్ననక్క కూసింది. తాపసి అది చూచి నవ్వినాడు. రాజుకు ఏమీ తెలియలేదు. అతడు తాపసిని కారణము చెప్ప మని కోరగా అతను "రాజన్, ఈఊరికి తూర్పున అరణ్యంలో రత్నాభరణ పూర్ణకలశ మున్నది. దాన్ని తెచ్చుకో మని నక్క నాకు చెవుతున్నది" అని

పలికినాడు. రాజు తెల్లపోయి తాపసిని వెంట పెట్టుకొని కలశ మున్న చోటికి వెళ్ళి, నేల త్రవ్వి కలశ మును తీసినాడు. రాజు ఆభరణాలు తీసుకొని సన్న్యాసిని విశ్వసించి, అతనిని మహాజ్ఞానిగా తలచినాడు. నాటి నుంచీ రాజు అతనిని సత్యవచనుడిగా భావించి ఆశ్రమానికి వెళ్ళి జపదారిపాదాలకు వందనము చేసి నిజమందిరానికి వెళ్ళినాడు. ఆసన్న్యాసి మూడుదిక్కులా ఉన్న ఆభరణపూర్ణకలశాలను రాజుకు సంక్రమించేటట్టు చేసినాడు. మహారాజే కాక మందిరములో ఉన్న రాణులు అమాత్యులు ఆబాలగోపాలము సన్న్యాసికి భక్తులైనారు.

ఒకరోజున తింతాకరాళుడు దేవాలయము చూడాలని మహారాజసమేతంగా బయలుదేరినాడు. కాకి కాకా అని కూయగా, కూతవిని సన్న్యాసి రాజుతో 'రాజన్! విన్నావా ఈవాక్కు! ఈదేవాలయం ముందరే రత్నాభరణకలశ మున్నదంటున్నది కాకి'' అని చెప్పినాడు. రాజు కలశ మున్నచోటికి వెళ్ళి దానిని గ్రహించినాడు. రాజసమేతంగా సన్న్యాసి దేవాలయంలో ప్రవేశించినాడు. స్తంభాన ఉన్న తనప్రియురాలి రాతిరూపమును చూచి, ధూర్తసన్న్యాసి రాజుతో 'రాజన్, అకాలంలో దేవాలయము కట్టించావు. చెప్పకూడని విషయమైనా చెప్పక తప్పదు, కనక చెబుతున్నాను. ఈరాతిబొమ్మ దుఃఖిస్తున్నది. నీకు శుభంగా తోచడం లేదు. వెంటనే ఈ దేవాలయాన్ని పడగొట్టించాలి'' అని విన్నవించినాడు. మహారాజు భయపడి వెంటనే దేవాలయము నేలమట్టముచేయించి మరొకచోట దేవమందిర నిర్మాణము ఆరంభించినాడు. తన కోరిక ఈడేరడంవల్ల సన్న్యాసిరూపంలో ఉన్న తింతాకరాళుడు ఉజ్జయినికి వెళ్ళినాడు. కళావతికి శాపావసానము కలిగి ప్రియునిదగ్గిరికి వచ్చింది. ఆమె అతనిని ఊరడించి దేవేంద్రదర్శనార్థము స్వర్గలోకానికి వెళ్ళింది. ఇంద్రుడు కళావతిని చూచి ఆశ్చర్యపడి, తింతాకరాళుని మహామాయాశక్తి విని సంతోషించినాడు.

ఇంద్రసభలో బృహస్పతి దేవేంద్రునితో ఇలా చెబుతున్నాడు: మాయచేసేవాళ్ళనీ జూదగాళ్ళనీ నమ్మకూడదు.

పూర్వము ఒకపట్టణంలో కుట్టినీకపటుడు అనేజూదగాడు ఉండేవాడు. వాడు చనిపోయినతరువాత యమలోకానికి వెళ్ళినాడు. యమధర్మ రాజు వాణ్ణి 'జూదరీ! నీవు పాపం చేసుకున్నవాడివి. కల్పకాలము నరకవాసము అనుభవించు. పూర్వజన్మలో నువ్వు బ్రహ్మవేత్తకు ఒక వరహా కానుక ఇచ్చావు. దానిఫలం ఒకదినము నీకు ఇంద్రత్వము ప్రాప్తిస్తుంది. ప్రథమంలో ఇంద్రత్వము అనుభవించి నరకానికి తరు వాత వస్తావా? ముందు నరకవాసం అనుభవించి అనంతరం ఇంద్ర పదవి అనుభవిస్తావా?'' అని అడిగినాడు. జూదగాడు ఆదిలోనే ఇంద్రత్వము అనుభవిస్తా నన్నాడు.

వెంటనే యమధర్మరాజు వాణ్ణి నాకలోకానికి పంపివేసినాడు. దేవ తలు ఇంద్రుని సింహాసనమునుంచి తొలిగించి కుట్టినీకపటుణ్ణి ఇంద్రుణ్ణి చేశారు. వాడు పట్టాభిషేకము చేయించుకొని భూలోకంలో ఉండే మిత్రులనూ, జూదగాళ్ళనూ, వేశ్యలనూ దేవలోకానికి రప్పించుకొని, దేవతలకు ఆజ్ఞచేశాడు "వెంటనే మమ్మల్ని సర్వతీర్థాలకూ తిప్పండి. భూమండలంలో ఉన్న రాజులదగ్గిర ధనం తీసుకొని దేవతలు మా తరపున దానధర్మాలు చేయాలి" దేవతలు జూదగానితరపున దాన ధర్మాలు చేయడంవల్ల వాడికి ఇంద్రత్వము దృఢమైంది. స్వర్లోకానికి వచ్చిన మానవులు, వేశ్యలు అందరూ దేవత్వము పొందినారు. మర్నాడు చిత్రగుప్తుడు యమధర్మరాజుతో "జూదగాడు బుద్ధిసూక్ష్మత వల్ల ఇంద్రత్వము అనుభవిస్తున్నాడు" అంటూ విన్నవించాడు. ధర్మ రాజు "ఆహా జూదరి నన్నే మోసం చేశాడే?" అని ఆశ్చర్యపడ్డాడు. ఇలా ఉంటారు జూదగాళ్ళు!

ఇలా బృహస్పతి కథ పూర్తి చేసినతదుపరి ఇంద్రుడు కళావతి వల్ల ౹ంతాకరాళుని దివికి తెప్పించి అతని తెలివితేటలకు మెచ్చుకొన్నాడు.

అతను కళావతిని కరాళునికి అప్పగించినాడు, అప్పగించి కింకాకరా ళుడు ఇంద్రుని దగ్గరే ఉంటున్నాడు. మాయాసాహసాలవల్ల కార్య ములు ఎలా నెరవేరుతవో చూచావా! ఓ అగ్ని భేతాళా! అజాదగాడు డాకినేయుడు మాయాశక్తివల్ల నిన్ను నూతిలోత్రోసినాడు. అందులో వింత పడవలసింది లేదు నూతిలోనుంచి పైకి రావోయి, మేమూ నీతో వస్తాము.” బ్రహ్మరాక్షసులు ఇలా అన్న తరువాత నేను గోతిలో నుంచి బైటికి వచ్చాను. రాత్రి నాకు ఆకలివేసింది. ఒక విప్రుడు వెళుతూ ఉండగా అతన్ని పట్టి తినివేదా మని యత్నించాను. ఆవిప్రుడు విక్రమార్క మహారాజు పేరు పలికి మొరపెట్టినాడు. విక్రమాదిత్యుడు అతని మొర ఆలించి అగ్నివలె ప్రకాశిస్తూవచ్చి బ్రాహ్మణ్ణి చంపకు అంటూ నన్ను బెదిరించినాడు. ఆయన నాచిత్రముగీసి అందులో నా శిరసు చెరిపివేసినాడు. వెంటనే నాకంఠాన గాయమై రక్తం కారింది. నేను విప్రుణ్ణి వధించకుండా వదిలిపెట్టి విక్రమార్కుని శరణు వేడినాను. ఆరాజేంద్రుడు దయార్ద్రహృదయుడు కావడంచేత నన్ను రక్షించినాడు. ఆయన ఆజ్ఞాప్రకారము నేను కాపాలికుని వధించినాను. ఓభేతాళుడా వీడు నాకు ఆహారము, వీణ్ణి వదిలిపెట్టు.” అగ్నిశిఖుడు ఇలా చెప్పినా వినక యమశిఖ భేతాళుడు కాపాలికుని కళేబరాన్ని హరించినాడు. వెంటనే విక్రమాదిత్యుడు వచ్చి నేలమీద పురుషుని చిత్రము గీసి దాని చేతిని కత్తితో ఖండించినాడు. యమశిఖుని హస్తము తెగిపడింది. వాడు కళేబరాన్ని విడిచిపెట్టి భయపడి పారిపోయినాడు. అగ్నిశిఖునికి కళే బరము ఆహార మయింది. విక్రమాదిత్యుని దివ్యప్రభావంవల్ల భయ పడక జరిగినది యావత్తూ కళ్ళారా చూచినాను.

ఇలా నీమహిమాతిశయాన్ని యక్షిణి అయిన మదన మంజరి వర్ణించి నాతో అన్నది. “అనంగదేవా! విక్రమార్కుడు నన్ను భర్తృ గృహానికి వెళ్ళ మని హెచ్చరించినాడు. రాజేంద్రునికి ప్రణామము

చేసి, ఆ యువకు ప్రత్యుపకారము ఏమి చేతునని ఆలోచిస్తూ ఇంటికి వచ్చినాను. ఇలా నీ ప్రభువు నా ఇల్లు నిలవబెట్టినాడు. సర్వవిధాలా ఆయన నన్ను కాపాడినాడు. విక్రమాదిత్యప్రభువును సింహళరాజేంద్ర తనయ స్వయంవరములో వరించింది. ఆసింహళరాజకుమారిని త్రైలోక్య సుందరిని హరించాలని రాజు లందరూ ఒకటైనారు. ఆమెను రక్షకు డైన విక్రమశక్తిని చంపివేయాలని రాజులు తిరుగుతున్నారు. అందు చేత నీవు వెళ్ళిపోయి విక్రమశక్తికి తెలియచెప్పు. ఆయన తగిన జాగ్రత్త తీసుకొంటాడు. నేనూ విక్రమాదిత్యుడూ కలిసి శత్రుసంహారము చేస్తాము. నామాయాశక్తివల్లనే నిన్ను ఇక్కడికి తెచ్చినాను మీ రాజు నాకుచేసిన మహోపకారానికి కృతజ్ఞత తెలియచేస్తూ కానుక పంపు తాను.'' యక్షిణి ఇలాపలికినతరువాత శ్వేతవర్ణ, ప్రియంగు శ్యామల వర్ణలైన ఇద్దరుకన్యలు లేడిపిల్లతో మాదగ్గిరికి వచ్చినారు. వాళ్ళను చూచి నేను యక్షిణిని "దేవీ! ఈకన్యలెవరు? ఈపసిడిలేడి ఏమిటి?'' అని అడిగినాను. ఆమె ఇలా సమాధానమిచ్చింది. "అనంగ దేవా! నీకు రుచిస్తే విను:

పూర్వము బ్రహ్మ సృష్టి చేస్తున్నప్పుడు, ఘంటానిఘంటులనే ఇద్దరు రాక్షసులు విఘ్నము చేయవలెనని వచ్చారు. బ్రహ్మ వారిద్దరిని చంపదలచి సుందరీమణులను ఇద్దరిని సృష్టి చేశాడు. వారి అద్భుత సౌందర్యం చూచి రాక్షసులు మత్తెక్కి హరించవలె నని త్వరపడి ఒకరితో ఒకరు యుద్ధం చేసి చనిపోయినారు. బ్రహ్మ కన్యలను కుబేరుని కిచ్చి తగినవరులను చూడమన్నాడు. కుబేరుడు ఆసుందరీమణులను తన తమ్ముడికీ, నాభర్తకూ ఇచ్చి పెళ్ళిచేశాడు. నేను దేవతాంశాభవుని విక్రమాదిత్యుని వీరికి తగిన వరునిగా సంకల్పించాను. ఇది కన్యల వృత్తాంతము.

బంగారు లేడిసంగతి విను. ఇంద్రునికి జయంతుడనే ప్రియసుతుడు దేవతాస్త్రీలతో గగనమండలంలో తిరుగుతూ, భూమండలంలో

లేడిపిల్లలతో ఆడుకొంటున్న రాజకుమార్తెను చూశాను. [illegible] ఇంద్రజిత్తు [illegible] దగ్గరికి వెళ్ళి లేడిపిల్లలు తాను ఆడుకొంటా! నాకు [illegible]ని మారాము చేశాను. ఇంద్రుడు కుమార్తెకోసం [illegible] పసిడిలేడి చేయించి అమృతంపోసి ప్రాణప్రతిష్ఠ కావించాడు. [illegible] ఆలేడితో ఆడుకొంటూ సంతోషంగా ఉన్నాడు [illegible] రావణానుజునికుమారుడు ఇంద్రజిత్తు పైడిలేడిని హరించి లంకకు తీసుకొని వెళ్ళాడు. తరువాత సీతాపహరణంవల్ల, రామలక్ష్మణులు రావణునీ, ఇంద్రజిత్తునూ వధించి, లంకకు విభీషణుణ్ణి రాజును చేశారు. రాజగృహములో పైడిలేడి ఉంటూ వచ్చింది. [illegible] నేను విభీషణుణ్ణి చూడాలని లంకకు వెళ్ళాను. రాజు బంగారు లేడిని నాకు కానుక చేసినాడు. ప్రస్తుతం ఈ పైడిలేడి మాఇంట్లో ఉంటున్నది. నేను దీనినే విక్రమాదిత్య రాజేంద్రునకు కానుకగా సమర్పిస్తాను." సంజవేళ సంధ్యోపాసన ముగించుకొని నేనూ సింహళరాజదూత ఇద్దరమూ శయనించాము.

తెల్లవారేసరికి మేము విక్రమశక్తి నడుపుతున్న సేనదగ్గిరున్నాము. మాకుచాలా ఆశ్చర్యము వేసింది. ఆయన మాకు ఉచితరీతిని సన్మానము చేసేలోగా, యక్షిణి వర్ణించిన అందగత్తెలు ఇద్దరూ లేడితో యక్షసేనతో వచ్చారు. విక్రమశక్తి యక్షసేనను చూచి భూతాలని సంశయించి ఏమిటని నన్ను అడిగినాడు. నేను విక్రమశక్తికి సింహళేశ్వరుని వృత్తాంతము, యక్షిణీకన్యల విషయమూ చెప్పాను. ఆయనను జాగ్రత్తగా ఉండమని హెచ్చరించాను. విక్రమార్కుడు మమ్మల్నీ దివ్యకన్యలనూ గౌరవించి, సేనను సమాయత్తము చేసినాడు. అప్పుడే ఆయనకు శత్రుసేన ఎదురైంది. ఉభయపక్షాలూ హోరాహోరిగా యుద్ధంచేస్తున్నారు. యక్షులు తమస్త్రీలకు సహాయము చేయడంవల్ల శత్రువులు పరాజితులైనారు. శత్రువులతలలు కత్తివేటుకు తెగి తెగి పడుతూ

వాటిని ఎగిరిపడుతూన్నప్పుడు విజయలక్ష్మి కందుకక్రీడ సలుపుతూ ఉన్నట్టున్నది. హతశేషులు శిబిరానికి వచ్చి విక్రమాదిత్యునిపాదాలు పట్టుకొన్నారు.

ఇలా ఓచక్రవర్తీ, నీవు సప్తద్వీపావృతవసుంధరనూ దిక్కులనూ జయించి, మ్లేచ్ఛులను సంహరించగా, యక్షిణి ప్రియునితో మాకు గోచరించింది. ఆమె నాతోను విక్రమశక్తితోనూ ఇలా పలికింది: "నాకృతజ్ఞత మహారాజుకు నివేదించండి: ఆయనకు నామాటగా చెప్పవలె. ఈదేవకన్యలను ఆయన వివాహము చేసుకోని. మృగశిశువును లాలించవలె. ఇదే మహారాజుకు నావిన్నపము."

యక్షిణి రత్నరాశిని పారితోషికంగాఇచ్చి సభర్తృకంగా అంతర్ధానమైనది. మర్నాడు సింహళేశ్వరకుమారి సపరివారంగా వచ్చి కలిసింది. విక్రమశక్తి ఎదురువెళ్ళి నిండుసంతోషంతో స్కంధావారంలో ఆమెకు విడిది ఇచ్చినాడు. రెండోనాడు విక్రమశక్తి సింహళరాజకుమారిని, దివ్యకన్యలను, పసిడిలేడిని వెంటబెట్టుకొని వెళ్ళినాడు. దేవా! విక్రమాదిత్యప్రభూ! విక్రమశక్తి సమీపంలో ఉన్నాడు. ఏలినవారికి ఈవిషయం మనవి చెయ్యమని మమ్మల్ని పంపినాడు.

ఈశుభవర్తమానము చెప్పిన అనంగదేవు డనేసింహళరాజదూతను సత్కరించినాడు మహారాజు. విక్రమాదిత్యుడు సింహళరాజపుత్రికనూ దివ్యకన్యలనూ కలుసుకోడానికి తరలినాడు. దండనాథికారులు విక్రమాదిత్యునితో వెళ్ళేసామంతులకు గజాశ్వములు ఏర్పాటు చేస్తూ ఉన్నారు. మహారాజు తరలేసరికి భూనభోంతరాళాలు దద్దరిల్లినవి.

## తరంగము: ౧౨౨

విక్రమాదిత్య మహారాజు విక్రమశక్తిని కలుసుకొన్నాడు. విక్రమశక్తి మహారాజుకు ప్రణామముచేసినాడు. విక్రముని సామంతు లందరూ

వరసగా రాజేంద్రునికి సందర్శనములు అర్పించినాడు. ఆయన సింహళ రాజపుత్రిని, దివ్యకన్యలనూ, సామంతులనూ సమాశ్వాసించినాడు. సామంత పరివార సమేతుడై విక్రమాదిత్యుడు ఉజ్జయినీ నగరికి వెళ్ళినాడు. అక్కణ్ణించి ఆయన సామంతులను తమ దేశాలకు పంపివేసినాడు.

కన్యల వైవాహికంగా వసంతోత్సవము వచ్చింది. తుమ్మెదలు ఝుంకారసంగీతము చేసినవి. వనలతలు గాలికి నృత్యము చేసినవి. కోకిలలు పంచమస్వరంలో మంగళగీతాలు పాడినవి. ఆ వసంత సమయాన మహారాజు సింహళకన్యను వివాహము చేసుకొన్నాడు. తక్కిన దివ్యకన్యాద్వయాన్ని కూడా ఆయన పెళ్ళాడినాడు. సింహళకన్య సోదరుడు సింహవర్మ మహారాజుకు రత్నరాశిని బహూకరించినాడు. యక్షిణి, మదనమంజరి అమూల్యరత్నదానులను కానుక ఇచ్చింది. ఆమె ఇలా అన్నది: "ప్రభూ! ఏలినవారు చేసిన మహోపకారానికి తగిన రీతిగా ప్రత్యుపకారము చేయలేను. యథాశక్తి నాశక్తికొద్దీ ఈదివ్యకన్యలనూ, లేడిసీ ఇస్తున్నాను. స్వీకరించండి." యక్షిణి విక్రమాదిత్యునివల్ల సత్కారాలు పొంది అంతర్ధానమైనది. ఆయన సప్తద్వీపవసుంధరను నిష్కంటకంగా ఏలుతున్నాడు. ఆరాజచంద్రుడు ఆమనిలో వనాలలోనూ, గ్రీష్మంలో కేళాకుళుల్లోనూ, వర్షకాలంలో శుద్ధాంతంలోనూ, శరత్తులో రమణీయసౌధాలలోనూ, హేమంతంలో రాణివాసంతో కాలాగురుపరిమళవాసితాలైన శయ్యామందిరాల లోనూ భోగా లనుభవించినాడు.

### మ ల య వ తి క థ

నగరస్వామి అనే చిత్రకారుడు రెండేసిరోజులకు ఒక్కొక్క చిత్తరువును బహుభంగుల వ్రాసి, విక్రమాదిత్యునికి తెచ్చి ఇస్తున్నాడు. ఒకసారి ఉత్సవ సందర్భంలో ఆశిల్పి చిత్తరువుమాట మరిచిపోయి

మహారాజుకు ఏకాంతంగా అప్పగించాలని విచారించాడు. హఠాత్తుగా బాటసారి వచ్చి ఆశవిలాసుల్లో ఒక పెట్టె పెట్టి వెళ్ళిపోయినాడు. శిల్పి కుతూహలంతో పెట్టెను తెరిచి చూడగా, తాను చిత్తరువులో లిఖించిన కన్య అందులో ఉన్నది! ఇతడు పట్టరాని సంతోషంతో దాన్ని మహారాజుకు అర్పించాడు. విక్రమాదిత్యుడు ఆశ్చర్యపడి “ఇది నీ శిల్పం కాదు. విశ్వకర్మ నిర్మాణమే ఇది. ఇటువంటి రూపాన్ని ఎవరు చిత్రించగలరు!” అని పలికినాడు. చిత్రకారుడు రాజుకు యథార్థము మనవిచేశాడు. మహారాజు అస్తమానమూ ఆ చిత్తరువునే చూస్తూ ఉన్నాడు. రాత్రి ఆయనకలలో ఒకద్వీపంలో చిత్రంలో చూచిన అందాలరాశే కనపడింది. స్వప్నంలో రాజు నాయికపొందు కోరేసమయంలో వీధిలో గస్తీవాడు కేకవేసినాడు. కల చెదిరిపోయింది. విక్రమాదిత్యునికి కోపం వచ్చి గస్తీవాణ్ణి నగరంనుంచి వెళ్ళగొట్టినాడు. మహారాజు విరహవేదనతో పొగిలిపోతూ, కలలో కన్నకామినీ సమాగమంకోసం ఆతురపడుతున్నాడు. భద్రాయుధుడనే ప్రతీహారుడు ఏకాంతంగా రాజును “దేవా! తమ తాపానికి కారణమేమిటి?” అని అడిగినాడు. మహారాజు ఇలా తనవిరహగాథ తెలియచేసినాడు:

‘చెలికాడా! చిత్రకారుడు నగరస్వామి నాకు కన్యాచిత్రాన్ని తెచ్చి ఇచ్చిన సంగతి ఎరుగుదువు. చిత్తరువులో ఉన్న కాంతను తలపోస్తూ నిద్రపోయినాను. కలలో నేను సముద్రము దాటి ఒక నగరము చేరినాను. సాయుధలైన కన్యలు కొందరు నన్ను చూచి కొట్టండి కొట్టండి అంటూ గోలచేశారు. తత్తరపాటుతో తాపసి వచ్చి తన కుటీరంలోకి నన్ను తీసుక పోయి ఇలా అన్నాడు. “పుత్రా! మలయవతి అనే పురుషద్వేషిణి యథేచ్ఛగా తిరుగుతూ ఇక్కడికి వచ్చింది. ఆమెకంటికి పురుషులు గోచరించినమాత్రాన కన్యలచేత వాళ్ళను చంపిస్తుంది. నిన్ను చూశామని నాకుటీరానికి తీసుకు వచ్చాను. ఆసన్యాసి నాకు

స్త్రీవేషము వేసినాడు. నేనందుకు అంగీకరించాను. ఈలోగా మలయవతి కన్యలతో అక్కడికే వచ్చింది. సరిగ్గా మలయవతినే నేను చిత్తరువులో చూచాను. నేను ఆశ్చర్యపోయి "కృతార్థుణ్ణి ప్రత్యక్షంగా ప్రియురాలిని చూడగలిగినాను" అనుకొన్నాను. పురుషద్వేషిణి మలయవతి సన్యాసిని "స్వామిన్ ఎవరో పురుషుడు ఇలా వచ్చాడు. ఎక్కడున్నాడు?" అని అడిగింది. స్వామి "నా చెల్లెలి కూతురు నన్ను చూడాలని వచ్చింది" అని సమాధానము చెప్పినాడు. ఆమె స్త్రీరూపంలో ఉన్న నన్ను చూచి "స్వామిన్, ఈమె బంధువైన మాత్రాన నాకు మాత్రంకాదా! ఈమెను మాయింటికి! తీసుకువెళ్ళి సత్కరిస్తాను" అన్నది. ఇలా అంటూ మలయవతి నా చెయ్యి పట్టుకొని నిజమందిరానికి తీసుకుపోయింది. సన్యాసి అందుకు అంగీకరించినాడు. ఆ రాజకన్య కన్యాజనంతో నన్ను వినోదపరచింది. ఆమె క్షణమైనా నన్ను విడిచిపెట్టి ఉండలేకపోతున్నది. ఆమె మనసంతా నామీదనే ఉంచింది. కన్యలు రాజకన్యను వధువుగాను నన్ను వరుణ్ణిగాను చేసి వినోదానికి వివాహక్రీడ సలిపినారు. వివాహానంతరం మమ్మల్ని శయ్యాగృహములో ప్రవేశపెట్టినారు. రాజకన్య నిర్భయంగా నామీద చుట్టి వేసింది. ఆకంఠాలింగనంవల్ల నాకు ఉత్కంఠ ఎక్కువైంది. నేనామెను కౌగలించుకొన్నాను. ఆమె నన్ను చూచి సిగ్గుతో తల వాల్చింది. మా సమాగమ కాలంలో గస్తీవాడు వీధిలో కేకలు వేసినాడు. నాతల చెదిరిపోయింది. అందువల్ల భద్రాయుధా, చిత్రంలో కన్న కన్య, మలయవతి లభించకపోతే జీవించలేను.

రాజు ఇలా అన్నతరువాత ప్రతీహారుడు భద్రాయుధుడు ఏలికను ఓదార్చి "దేవరా! మీకు జ్ఞప్తి వుంటే కలలో కన్న పట్టణాన్ని పటంలో వ్రాసి ఇవ్వండి. తరవాత సాధనం ఆలోచనచేశాము" అని హెచ్చరించినాడు. మహారాజు స్వప్నంలో చూచిన నగరాన్ని

చిత్రించి ఇచ్చినాడు. ప్రతీహారుడు చిత్రాన్ని తీసుకొని వెంటనే ఒక మఠాయతనం కట్టించి అందులో పటాన్ని వేలాడ దీసినాడు. ఆ పురం లోకి వచ్చిన పరదేశీయులకు స్వేష్టప్రవృత్తిగా భోజనం పెట్టి, ధోవతుల చాపు, బంగారము ఇవ్వవలె నని కట్టడి అయింది. భద్రాయుధుడు సత్రంలో వాళ్ళకు ఇలా ఆజ్ఞ ఇచ్చినాడు. 'ఈ గోడను వేలాడతీసిన పట ములో పట్టణము ఎరిగినవాడు ఎవడైనా ఉంటే నాకు తెలియచేయండి"

ఈలోగా వర్షఋతువు వచ్చింది. విక్రమాదిత్యమహీపాలునికి విరహము వృద్ధి కాగా అంతఃపురములో విలాసినులు అనునయ ఉపచారాలు ఆరం భించినారు. వర్షం వెనకబట్టి తెల్లని రెల్లుపువ్వుల అందాలలో శరత్కా- లము వచ్చింది. అప్పుడు పరదేశీయుడు ఒకవంది సత్రాముశనానికి భోజ నార్థం వచ్చినాడు. శంబరసిద్ధి అనేఅవంది షడ్రసోపేతంగా భోజనంచేసి సువర్ణమూ, వస్త్రాలూ పుచ్చుకొని, గోడమీద చిత్రరూపుచూచి తెల్ల పోయాడు: "ఎవ రీచిత్రం రాసింది? నేను ఈనగరం చూచిన మొదటి వాణ్ణి. ఎవ రీచిత్రకారుడు? ఇతనికి ఈనగరం తెలిసివుంటుంది. మరి మూడోవాడు ఎవడూ దీనిని ఎరగడు." వందిమాటలు విని సత్రంలో వాళ్ళు ప్రతీహారునికి చెప్పినారు.

ప్రతీహారుడు వందిని రాజుదగ్గిరికి తీసుకు వెళ్ళినాడు. విక్రమాదిత్య రాజేంద్రుడు "నిజంగా నువ్వు నగరాన్ని చూశావా?" అని వందిని అడిగినాడు. అతను "దేవా! సముద్రమధ్యములో ఉన్న మలయపురమనే ద్వీపనగరము చూశాను. దానిఏలిక మలయసింహుడు. ఆయనకుమార్తె చాలా అందగత్తె. ఆమె పురుషులను చూచి అస హ్యించుకొనేది. ఒకసారి స్వప్నములో ఆమలయవతి విహారార్థం బయలుదేరి ఒకపురుషశ్రేష్ఠుణ్ణి చూచింది. ఆమె అగ్రహము అతనిని చూచిన తరువాత పోయింది. ఆకన్య అతనిని నిజమందిరానికి తీసుకు పోయి వివాహము చేసుకొన్నది. భార్యాభర్తలు శయ్యామందిరములో

తెల్లవారేదాకా ఉన్నారు. వేకువవేళ మలయవతికి మెలకువ రాక పోవడంచేత దాసి ఆమెను మేలుకొలిపింది. కోపాతిరేకంతో మలయవతి దాసీదాన్ని ఇంట్లోనుంచి పంపివేసి, కలలో కన్న ప్రియుణ్ణి స్మరిస్తూ విరహంతో కృశిస్తూ ఉన్నది. తల్లి తండ్రీ ఏమడిగినా, ఆమె సమాధానము చెప్పడానికి మనస్కరించక ఊరుకొన్నది. జననీజనకులు బలవంత పెట్టగా మలయవతి స్వప్నవృత్తాంతము ఆప్తురాలయిన చెలికి చెప్పింది. తద్వారా వాళ్ళకు తెలిసింది తండ్రి కుమార్తెను ఓదార్చినాడు. ఆమె ఆరుమాసాలలో ప్రియుణ్ణి పొందలేకపోతే అగ్నిలో దుముకుతానని శపథం చేసింది. ఇలా వంది చెప్పగా విక్రమాదిత్యుడు యథార్థం గ్రహించి సంతోషించినాడు. ప్రతీహారుడు "దేవా! కార్యము సానుకూలమైంది. ఆ స్వప్నగత ద్వీపనగరము ఏలినవారి రాజ్యంలోదే. ఆరవమాసం పూర్తి కాకపూర్వమే తమరు నగరానికి వెంచేయాలి." అని హెచ్చరించినాడు.

విక్రమాదిత్య మహీకాంతుడు వందినీ, ప్రతీహారినీ సత్కరించి కాంతకోసం నిరాతంకుడై సేనతో తరలినాడు. ఆయన సముద్రము దాటి ద్వీపంలో ప్రవేశించగా, ఆరుమాసాలగడువు దాటిపోయి మలయవతి అగ్నిప్రవేశం చేయబోతున్నదని వార్త బయలుదేరింది. రాజకుమారి మహారాజును చూడడంతోనే "నాప్రాణేశ్వరుడు వచ్చినాడు. నాతండ్రితో చెప్పండి" అని అనుచరులకు ఆజ్ఞ ఇచ్చింది. వారు ద్వీపాధిపతికి చెప్పేసరికి ఆయన పరమసంతోషంతో విక్రమార్కుని దగ్గిరకి వచ్చినాడు. అప్పుడు శంబర సిద్ధి గొంతెత్తి ఇలా పఠించినాడు: "నిజతేజ విజితభూతగణా, మ్లేచ్ఛారణ్యదావాగ్ని, జయ! సప్తసాగరసీమ మహీమానినీవల్లభా, జయ! విజిత సకలరాజవినత శిరోధారితశాసనా, విక్రమవారిధీ, వినయశీల మహీపతీ. విక్రమాదిత్యప్రభూ, జయ!"

మలయసింహ మహీపతి వందివాక్యము విని ఆయన విక్రమాదిత్యుడని గ్రహించి, పాదప్రణామము చేసి, అతిథిసత్కారాలతో

పాటు మలయవతిని కూడా తీసుకొని పోయి యథావిధిగా అతని కిచ్చి వివాహము చేసినాడు. చిత్రపటములోనూ, స్వప్నములోనూ కనబడి నట్టి ఉన్న ప్రియురాలిని చూచి విక్రమాదిత్యుడు ఆ అద్భుతవృత్తాంతము శివానుగ్రహమువల్లనే అని భావించినాడు. అనంతరము మహా రాజు మార్గమధ్యములో సామంతప్రభువుల కానుకలు స్వీకరిస్తూ తన రాజధానికి చేరినాడు.

మహారాజు ప్రభావానికి ఉజ్జయినీ నగరములో ఆశ్చర్య పడనివారు లేరు. చిత్రపటములో చూచిన రమణిని రాజుసాధించి వివాహము చేసుకొన్నందుకు అందరూ ఆనందించి ఉత్సవాలు చేసినారు.

## తరంగము : ౧౩

## కళింగసేన కథ

విక్రమాదిత్య ప్రభువురాణులలో కళింగసేనరాజ్ఞి తక్కినరాణులతో ప్రసంగవశాన ఒకనాడు ఇలా చెప్పింది! మలయవతికోసము దేవరవారు చేసినదానికి ఆశ్చర్యపడ నక్కరలేదు. ఆయన ఎప్పుడూ విషమశీలుడే కదా! ప్రభువు నాచిత్రప్రతిమ చూచి మోహించి నన్ను బలవంతాన తెచ్చి పెళ్ళి చేసుకోలేదా? దేవసేనుడు అనే కార్పటికుడు ఈవిషయ మంతా ఒకసారి నాకు చెప్పినాడు. నేను విచారములో ఉంటే అతడు నన్ను ఓదార్చి ఈకథ సవిస్తరంగా చెప్పినాడు.

దేవీ, నేను మహారాజును సేవిస్తూ, ఒకనాడు అరణ్యానికి వెళ్ళి నప్పుడు మహావరాహము కనబడ్డది. వచ్చి విన్నవించాను. ప్రభువు వేటకు బయలుదేరి కొంతదూరము వెళ్ళి ఆవరాహాన్ని చూచినాడు. అది సామాన్యసూకరము కాదని గ్రహించి, రాజు రత్నాకర మనే గుర్ర మెక్కి దానివెంట బడినాడు. సూకరము దొరకకుండా మహా వేగముతో పరుగెత్తింది. రాజూ నేనూ పట్టు విడవకుండా మహావేగ

ముత్తో దాన్ని తినివేసాము. పరివారజన మంతా వెనక్కు తిరిగిపోయినారు. కొంతసేపటికి ప్రభువు నన్ను చూచి 'ఎంతదూరము వచ్చినాము?' అని అడిగితే 'మూడుసందల యోజనాలు వచ్చినాము' అని నేను సమాధానము చెప్పినాను. ప్రభువు ఆశ్చర్యపడి 'కాలినడకతో నావెంట ఎలా రాగలిగినావు?' అని అడిగినాడు. నేను ఈకథ చెప్పినాను:

## కా ర్ప టి కు ని క థ

"దేవా, నావద్ద పాదలేప మనే ఔషధ మున్నది. దాని ప్రభావము వల్ల వేగముగా రాగలిగినాను. పూర్వము నాభార్య పోయినప్పుడు వైరాగ్యముచేత తీర్థయాత్రలకు బయలుదేరినాను. కొంతదూరము వెళ్ళేసరికి పొద్దుకూకింది. అక్కడ ఉద్యానవనములో దేవాలయము లోకి వెళ్ళినాను. ఎవరో యువతి నాకు ఆతిథ్య మిచ్చింది. రాత్రివేళ ఆమె ఒకపెదవి ఆకాశానికీ, ఒకపెదవి భూమికీ అంటేటట్టు నోరు తెరచి ఇలాంటినోరు నీవు ఎక్కడైనా చూచావా అని అడిగింది. నేను కత్తి దూసి, ఇటువంటి పురుషుణ్ణి ఎక్కడైనా చూచావా అని బొమముడి పాటుతో అడిగాను. ఆమె భయంకరాకారము విడిచిపెట్టి, సౌమ్య రూపము ధరించి 'మహాశయా, నేను చండి అనే యక్షిని. నీధైర్యానికి మెచ్చినాను. నీకేమి కావాలో చెప్పు' అన్నది. 'నీకు నిజంగా నా విషయంలో సంతుష్టి కలిగితే, నేను శ్రమ లేకుండా సమస్తపుణ్య తీర్థాలకూ వెళ్ళగలిగిన ఉపాయం తెలియచెయ్యి' అని నేను పలికినాను. అప్పు డామె నాకు పాదలేపము ఇచ్చింది. దాని ప్రభావమువల్ల నేను పుణ్యతీర్థా లన్నీ సేవించి, మీవద్దకువచ్చాను. దానిశక్తివల్లనే ప్రతి రోజూ అరణ్యానికి వెళ్ళి ఫలాదులు భక్షించి మీసన్నిధానానికి వస్తూ ఉంటాను. అని చెప్పి దేవా, మీకు ఫలాలు కావలిస్తే చాలా రుచి గలపండ్లు తెస్తాను" అని విన్నవించాను. 'ఇప్పుడు వద్దు. తర్వాత

లేనప్పుడు. కొన్ని తెలిసిపోయినాయి. నీకీ ఫలాహారము చెయ్యి' అని ప్రభువు సెలవిచ్చినాడు. అప్పుడు నేను దోసకాయ తిన్నాను. తినీ తినడములో అజగరము (కొండచిలువ) అయినాను.

నన్ను చూచి విక్రమశీలప్రభువు విషాదమూ ఆశ్చర్యమూ పొంది, భూతకేతువు అనే బేతాళుని రప్పించినాడు. అతడువచ్చి వినయపూర్వకముగా 'దేవా, ఏమి ఆజ్ఞ?' అని అడిగినాడు 'భద్రుడా, నాకార్పటికుడు ఆకస్మికముగా అజగర మయినాడు. మళ్ళీ పూర్వస్థితికి వచ్చేలాగున చూడు' అని ప్రభువు అంటే 'దేవా, నాకు అటువంటిశక్తిలేదు. నీకు మెరుపుతీగెను అర్పగలదా' అని బేతాళుడు విన్నవించినాడు. 'సరే మనము ఇక్కడే పల్లెకు వెళ్ళుదాము. అందులో శబరులవల్ల మేలు కలుగుతుందేమో చూతాము' అని రాజు బేతాళునితో కలిసి పల్లెకు వెళ్ళినాడు.

అక్కడికి వెళ్ళేసరికి ప్రభువు శరీరాన అమూల్యాభరణాలు చూచి, దుర్మార్గులు చోరబుద్ధితో ఆయనమీద బాణాలు విడిచినారు. బేతాళుడు వారిలో అయిదువందల మందిని ప్రభువు కోరికమీద సంహరించినాడు. మిగిలినవారు పారిపోయి తమ సేనానాయకుడైన ఏకాకికేసరికి విన్నవించారు. వాడు రోషముతో దండును వెంట బెట్టుకొని వచ్చినాడు. వానిసేవకులలో ఒకడు విక్రమార్క మహారాజును గుర్తుపట్టి ఏకాకికేసరికి తెలిపినాడు. వాడు వచ్చి రాజుపాదాలమీద వాలి, తనసంగతి తెలుపుకొన్నాడు. రాజు వాని యోగక్షేమాలడిగి నాకార్పటికుడు అరణ్యములో దోసపండు తిని, అజగరమయినాడు. నీకుచేతనయితే అతన్ని మళ్ళీ మనిషిని చెయ్యవలె' అన్నాడు. 'నాకుమారునికి తమ భృత్యుడు అజగరాన్ని చూపించగలడా?' అన్నాడు ఏకాకికేసరి.

తర్వాత బేతాళుడు అకనకమూరుచితో సహా నావద్దకు వచ్చి నాడు. శబరుడు ఏదో ఓషధీరసము నాచేతికి అందించినాడు. నాకు యథా ప్రకారముగా మానవాకారము వచ్చింది. అందరమూ సంతోషముతో మహారాజు సన్నిధికి వెళ్ళినాము.

పిమ్మట ఏకాకికేసరి ప్రభువును ప్రార్థించి మమ్మల్ని అందరినీ తన నివాసానికి తీసుకు వెళ్ళినాడు. అతని గృహములో గోడలకు ఏనుగు దంతాలు తాపటముచేసి ఉన్నవి. ఇంటిమీదికప్పు పులిగోళ్ళు స్త్రీలు నెమలిపురులే వస్త్రాలుగా ధరించి ఉన్నారు. వాళ్ళమెడలలో గురివెంద గింజలదండలు, శరీరాన ఏనుగుమదము పూత. కస్తూరివాసనతో ఘుమ ఘుమ లాడే వస్త్రాలు ధరించి ముత్యాలదండలు మెడలో వేసుకొని సేనాపతి భార్య వచ్చి ప్రభువుకు స్వయముగా ఉపచారము చేసింది. రాజు స్నానభోజనాదికము అయినతర్వాత శబరనాయకుని చూచి 'సేనాపతీ, నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది. నీవు యువకుని వలె కని పిస్తావు. నీకుమారులు వృద్ధులవలె ఉన్నారు. ఏమిటి ఇందులో రహ స్యము'' అని అడిగినాడు. శబరసేనాపతి ఇలా చెప్పినాడు.

## ఏకాకికేసరి కథ

దేవా, చాలా గాథ ఉన్నది. నేను చంద్రస్వామి అనే బ్రాహ్మణు డను. పూర్వము మాయాపురిలో ఉండేవాడను. ఒకనాడు నేను మార్గానవెళ్ళుతుంటే కోతి అడ్డముగా నిలుచుండి జాలిచూపులతో మరోమార్గము చూపించింది. ఇది నన్ను కరవలేదు. చాలా సౌమ్యంగా జాలిగా కనిపిస్తుంది. పోనీ ఇది చూపిన తోవనే వెళితే ఏమవుందో చూస్తాను. అని నేను బయలుదేరి వెళ్ళినాను. కోతి నాముందు నడుస్తూ, వెనుకకు తిరిగి చూస్తూ, పోయిపోయి నేరేడు చెట్టు మీదికి వెళ్ళింది. చెట్టుపైన తీగలు గుబురుగా అల్లుకొన్నవి. అందులో కోతి చిక్కుకున్నది.

దీనిని విడిపించడానికే నన్ను కోతి ఇక్కడికి తీసుకువచ్చింది. అని భావించి నేను తీగలను ఖండించినాను. కోతులు రెండూ క్రిందికి దిగినవి. నేను దిగిన తర్వాత కోతులు నాపాదాలు పట్టుకొన్నవి. మగకోతి వెంటనే ఎక్కడికో వెళ్ళి మంచిఫలము తెచ్చి నాకిచ్చింది. ఇంటికి వెళ్ళినపిమ్మట నేను భార్యకు ఫలము చూపించినాను. ఉభయులమూ పండు తిన్నాము. అందువల్ల మాకు వార్ధకముగాని, రోగముగాని రాలేదు.

తర్వాత కొన్నాళ్ళకు మారాష్ట్రములో కరువు వచ్చింది. జనులు నానాముఖాల చెదిరిపోయినారు. మేము ఉభయులమూ ఇక్కడికి వచ్చాము. ఇక్కడ కాంచనదంష్ట్రుడు అనే శబరనాయకుని కొలువులో చేరి చాలా యుద్ధాలలో అతనికి జయము చేకూర్చినాను. అతడు చాలా సంతోషించి నన్ను సేనాపతిని చేసినాడు. ఆయనకు సంతానము లేదు. అవసానకాలములో నాకు రాజ్యమిచ్చినాడు. పూర్వము ఫలము తినడముచేత ఇన్ని వందల సంవత్సరాలు గడచినా ముసలితనము రాలేదు.

కథ విని రాజు ఆశ్చర్యపడినాడు. శబరనాయకుడు 'దేవా, నేటికి మీసేవ చేయగలిగినాను. మీరు మాయింటికి అతిథిగా వచ్చారు. కాబట్టి అతిథి సత్కారము స్వీకరించవలె. నాకు క్షత్రియభార్యవల్ల కొమార్తె కలిగింది. మామదనసుందరి చాలా చక్కనిది. మీసమక్షాన శోభిస్తుంది. మదన సుందరిని మీకిస్తాను. యథావిధిగా వివాహమాడండి. నేను మీకు విధేయుడను. నాకు రెండులక్షలమంది సమర్థులు అనుచరులు' అని విన్నవించినాడు.

రాజు సంతోషించి శుభలగ్నమున మదనసుందరిని యథావిధిగా వివాహమాడినాడు. ఏకాకికేసరి అల్లునికి నూరు లొట్టిపిట్టలు, మోయగలిగినన్ని ముత్యాలు, కస్తూరి, అరణ మిచ్చినాడు. విక్రమాదిత్యుడు అక్కడ వారమురోజులుండి శబరసేన వెంటనడవగా మదనసుందరితో సహా తనరాజధానికి బయలుదేరినాడు.

## గ జ సూ క ర శా ప వి ము క్తి

ప్రభువు కనబడలే దని దిగులుపడ్డ మా పరివారముతో భద్రాయుధు డనే ప్రతీహారుడు ఇలా చెప్పినాడు: "ఎందుకు దిగులు పడతారు? ప్రభువు త్వరలోనే వస్తాడు. దివ్యప్రభావము కలిగిన విక్రమాదిత్య మహారాజుకు ఏమీ కీడు జరగదు. ఆయన పాతాళలోకానికి ఒంటరిగా వెళ్ళి నాగకన్యను వివాహమాడి తిరిగి రాలేదా? గంధర్వలోకానికి వెళ్ళి గంధర్వప్రభువుకూతురు తారావళిని తీసుకు రాలేదా?" భద్రాయుధుని పలుకులు విని అందరూ శాంతించి వనమువైపు దృష్టి ఉంచి ప్రభువు కోసము ప్రతీక్షిస్తూ ఉన్నారు.

అక్కడ మదనసుందరికి తోడుగా శబరసేన వెళుతూ ఉంటే, విక్రమార్కప్రభువు, బేతాళుడు, నేనూ గతవారములో చూచిన వరాహాన్ని వేటాడడానికి వెళ్ళినాము. అరణ్యములో ఆహారము ఎదురుపడ్డది. ప్రభువు అయిదు బాణాలు విడిచి దాన్ని సంహరించినాడు. బేతాళుడు వెళ్ళి వరాహశరీరము చీల్చేసరికి లోపలినుంచి సుందరాకారుడు వెలుపలికి వచ్చినాడు. అతనిని చూచి మహారాజు ఆశ్చర్యపడి ఎవరు నీవు అని అడిగినాడు. ఆక్షణములోనే అడవిఏనుగు అక్కడికి వచ్చింది. రాజు ఒక్క బాణము విడిచినాడు. ఆయువుపట్టున తగలడము చేత వనగజము వెంటనే పడిపోయింది. బేతాళుడు దానిశరీరము చీల్చినాడు. దివ్యపురుషుడూ, దివ్యస్త్రీ ఇవతలికి వచ్చినారు. వరాహము కడుపులోనుంచి వెలువడినపురుషుడు తనకథ ఇలా చెప్పినాడు:

ప్రభూ, మే ముభయులమూ దేవకుమారులము. ఇతడు భద్రుడు, నాపేరు శుభుడు. ఒకనాడు ఉభయులమూ వినోదముగా తిరుగుతూ ధ్యానములో ఉన్న కణ్వమహామునిని తమాషాగా గజసూకరాకారాలతో భయపెట్టినాము. ఆశరీరాలతోనే ఉండేలాగు మాకు శాప

మిచ్చినాడు మహర్షి. మేము ప్రార్థిస్తే, విక్రమాదిత్యమహారాజుచేతుల్లో మీరు హత మైననాడు శాపవిముక్తి అని అనుగ్రహించినాడు. బహు కాలము ఆశరీరాలతోనే మేము తిరిగి తిరిగి, నేటికి నీవల్ల శాప విముక్తుల మయినాము. ఈ తరుణి తనకథ తానే చెప్పుకొంటుంది. నీవు వరాహాము మెడనూ ఏనుగుపీపునూ తాకితే ఒకటి దివ్యఖడ్గ మవుతుంది, రెండవది డాలు అవుతుంది.'' ఇలా పలికి భద్రుడు శుభునితో కలిసి వెళ్ళిపోయినాడు. ప్రభువు చేతితో తాకేసరికి ఆ జంతువులలో ఒకటి కత్తి రెండవది డాలు అయినవి.

## గు ణ వ తి క థ

తర్వాత ప్రభువు ప్రశ్నించిన మీాదట స్త్రీ తన కథ ఇలా చెప్పింది.

ఉజ్జయినిలో ధనదత్తు డనేవర్తకుని భార్యను నేను. నిద్రపోతూ ఉండగా ఈయేనుగు నన్ను మింగి ఇక్కడికి వచ్చింది. మొదట దీని కడుపులో పురుషుడు లేడు. ఇప్పుడు బయట పడినాడు.

అని చెప్పి దీనవదనముతో ఉన్న ఆతరుణికి మహారాజు అభయ మిచ్చి 'నీభర్తసన్నిధికి చేర్చుతాము. నీవు మారాణివాసము వెంట వెళ్ళు' అనిచెప్పి బేతాళుని తోడుఇచ్చి మదనసుందరివద్దకు ఆమెను చేర్పించినాడు. బేతాళుడు తిరిగివచ్చినాడు. హఠాత్తుగా వనములో పెద్దపరివారముతో ఇద్దరు రాజకన్యలు కనబడినారు. రాజు నన్ను పంపించి వారి మహత్తరులను రప్పించి 'ఎవ రీకన్యలు ? ఎక్కడనుంచి ఎక్కడికి వెళ్ళుతున్నారు' అని ప్రశ్నించినాడు.

"మహత్తరులు ఇలా చెప్పినారు 'దేవా, కటాహద్వీపములో గుణ సాగరు డనే ప్రభు వున్నాడు. ఆయనకుమార్తె గుణవతికి సప్త ద్వీపము లేలే చక్రవర్తి భర్త అవుతాడని సిద్ధులు చెప్పినారు. ఆయన

మంత్రులతో సంప్రతించి విక్రమాదిత్యమహారాజే తనకన్యకకు తగిన భర్త అని నిర్ణయించి, పరివారముతో గుణవతిని పడవ యెక్కించినాడు. సువర్ణద్వీపము వద్దకు వచ్చిన పడవను మహామత్స్యము మింగి, పోటు వచ్చినప్పుడు ద్వీపతీరానికి కొట్టుకువచ్చింది. ప్రజలు దానిని ఆయుధాలతో సంహరించి కడుపు చీల్చినారు. జనులతో నిండిన ఓడ ఇవతలికి వచ్చింది. ఆవింతసంగతి విని చంద్రశేఖరుడనే అక్కడిరాజు చూడ వచ్చినాడు. ఆయన గుణసాగరప్రభువుకు బావమరది. పడవలో వాళ్ళు చెప్పినమీదట సంగతియావత్తూ గ్రహించి ఆయన తన మేనకోడలు గుణవతిని తనమందిరానికి తీసుకుపోయి ఉత్సవము చేసినాడు. ఆయన తనపుత్రిక చంద్రవతిని విక్రమాదిత్య ప్రభువుకు ఇయ్యవలె నని పూర్వమే సంకల్పించుకొన్నాడు. గుణవతితో కూడా చంద్రవతిని చేర్చి మహావైభవముగా ఓడయెక్కించి శుభముహూర్తములో ప్రయాణము చేయించినాడు. ఆకన్యలు ఇక్కడికి వచ్చినారు. మేము వారి పరివార ములోనివారము. ఈప్రాంతాలకు రాగానే ఒక వరాహము, ఒక యేనుగు ఆకన్యలకు అడ్డమువచ్చినవి "ఈకన్యలు విక్రమాదిత్య ప్రభువును వరించి స్వయంగా వచ్చినారు. లోకపాలకులారా, మీరు ఆప్రభువు ధర్మపరాయణత్వాన్ని స్మరించి వీరిని రక్షించండి" అని ఆక్రోశించాము. మావాక్కులు ఆలకించి గజవరాహములు స్పష్టవాక్కులతో "మీకు భయము లేదు. విక్రమాదిత్యప్రభువు పేరు ఉచ్చరించినమీదట మీకు భయమెక్కడిది? ఆమహారాజు ఇక్కడే ఉన్నాడు. త్వరలో మీకు ఆయనదర్శన మవుతుంది" అని ఎటో వెళ్ళిపోయినవి. ఇది మావృత్తాం తము మహాప్రభూ!

వారికి ప్రభువును ఎరుకపరచినాను. వారు మహారాజుకు పాద ప్రణామము చేసి కన్యలను సమర్పించారు. ప్రభువు బేతాళునితో చెప్పి కన్యలను మదనసుందరివద్దకు పంపినాడు. బేతాళుడు చెప్పినవని

వెంటనే నరవేశ్చి వచ్చినాము. మేము ముగ్గురమూ అరణ్యములో వెళ్ళు తున్నాము. సూర్యాస్తమానము అయింది. ఇంతలో మృదంగనాదము వినబడితే ఎక్కడిది అని రాజు ప్రశ్నించినాడు. 'దేవా, సమీపములో ఆలయమున్నది. దేవతలు ప్రతిష్ఠించినది. విశ్వకర్మనిర్మాణము చాలా చిత్రమైనది. సంధ్యాసమయము కావడముచేత ఆలయములో ప్రేక్షణక నాట్యము జరుగుతున్నది. అక్కడ మృదంగధ్వని ఇది' అని బేతాళుడు చెప్పినాడు. కుతూహలముపుట్టి మేము బయలుదేరి వెళ్ళి గుర్రాన్ని వెలుపలకట్టివేసి లోపలికి పోయినాము.

అక్కడ గరుడపచ్చలు చెక్కిన శివలింగానికి ఎవరో పూజచేసినట్టు కనవడ్డది. శివలింగసముఖాన దీపాలు దేదీప్యమానముగా వెలుగు తున్నవి. దివ్యాంగనలు నాట్యము చేస్తున్నారు. వివిధవాద్యాలు మోగినవి. నాట్యము పూర్తికాగానే ఆదివ్యాంగనలు అక్కడి స్తంభాల మీది బొమ్మలలో కలిసి మాయమయినారు. ప్రభువు ఆశ్చర్య పడుతూ ఉంటే బేతాళుడు 'దేవా, ఇది విశ్వకర్మకృత మయినమాయ. ప్రాతస్సాయం సంధ్యలలో ఇలా జరుగుతూనే ఉంటుంది' అని చెప్పినాడు. తర్వాత మేము ఆలయములో తిరుగుతూ ఉంటే ఒక స్తంభముమీది బొమ్మ మరీ అందంగా కనిపించింది. ప్రభువు దానిని చూచి ముగ్ధుడై పోయి 'ఇటువంటి రమణీయమూర్తి లభ్యము గాకపోతే జీవితము వ్యర్థము. రాజభోగాలుకూడా నిస్సారము' అని పలికినాడు.

బేతాళుడు వెంటనే 'దేవా, ఇటువంటి రూపముగల కన్య దొరకక పోదు. కళింగరాజు కూతురు కళింగసేన అనే కన్యామణిని చూచి వర్ధ మానపుర శిల్పి ఈ బొమ్మ చేసినాడు. ఏలినవారు ఉజ్జయినికి వెళ్ళి కళింగరాజుకు వర్తమానము పంపండి. మంచిమాటలకు కన్యాదానము రాని పక్షాన పరాక్రమము చూపి కన్యను స్వీకరించ వచ్చును' అని విన్నవించేసరికి రాజు సమ్మతించినాడు.

రాత్రి అక్కడ గడిపి తెల్లవారగానే లేచి మేము వెళుతూ ఉంటే మార్గములో అశోకవృక్షముకింద ఇద్దరుదివ్యమూర్తులు కనిపించారు. వారు లేచి రాజుకు ప్రణామము చేశారు. 'ఎవరు మీరు? ఎందుకు ఈవనములో ఉన్నారు?' అని ప్రభువు ప్రశ్నించినాడు. అందులో ఒకడు ఇలా చెప్పినాడు :

## ధ న ద త్తు ని క థ

'దేవా, మాది ఉజ్జయిని. నేను వణిక్కుమారుడను. నన్ను ధనదత్తు డంటారు. ఒకరాత్రి మామేడమీద భార్యాభర్తలము శయనించి నాము. తెల్లవారి నేను మెళుకువ వచ్చి చూస్తే, నాభార్య కనబడదు. అంతటా వెతికాను. ఏ మయిందో తెలియదు. ఆమెకు నామీద అను రాగమే కాని ద్వేషము లేదు. పైగా ఆమె పూర్వము పొగడదండ నాచేతి కిచ్చి నేను పాతివ్రత్యము విడవకుండా ఉంటే ఈవకుళమాలిక వాడదు' అని శపథముకూడా చేసింది. ఇప్పటికీ వకుళమాలిక వాడలేదు. కాబట్టి ఆమెను ఏభూతములో అపహరించి ఉండాలి. నేను చాలా బాధ పడుతూ ఇల్లు విడిచి దేవాలయములో ఉంటూ బ్రాహ్మణసంతర్పణలు చేయిస్తూ ఉన్నాను.

ఒకరోజు ఈబ్రాహ్మడు చాలా ఆయాసపడుతూ అక్కడికి వచ్చి నాడు. స్నానభోజనాదు లయినతర్వాత ఈయనవృత్తాంత మడిగినాను. కాశీనగరసమీపములో ఒకపల్లెలోవాడ నని ఈయన చెప్పినాడు, నాభృత్యులు ఈయనకు నావృత్తాంతమంతా తెలిపినారు. 'మిత్రమా. ప్రయత్నము మాని ఇలా కూచుంటే కార్యము నెరవేరుతుందా? ఇంట్లో కూర్చుండి క్షీణించిపోతున్నావు! లే మనమిద్దరమూ బయలు దేరి నీభార్యను వెదకబోదాము. నన్ను మిత్రునిగా భావించు' అని ఈయన ప్రోత్సాహము చేసినాడు. 'ఆమె ఎవు వెళ్ళింకో. మన

ఏసమాచారమూ తెలియకుండా ఏవైపు వెళ్ళుతాము?' అన్నాను నేను.
'అలా అనకు. పూర్వము! కేసటునిభార్య రూపవతి కనబడకుండా
పోయింది. మళ్ళీ లభిస్తుంది అనే ఆశకూడా లేకపోయినా పునస్సమా
గమము కలిగింది.' అని కథ ఇలాచెప్పినాడు మిత్రుడు:

## కే స టు ని క థ

పూర్వము పాటలిపురములో ఒకానొక ధనికబ్రాహ్మణునికి కేసటు
డనేకుమారుడు చాలా సుందరాకారుడు ఉండేవాడు. తనకు తగిన
భార్యకోసము కేసటుడు తీర్థయాత్ర అనే నెపముమీద దేశాలు
తిరుగుతున్నాడు. ఒకనాడు అతను నర్మదాతీరాన వెళుతుంటే పెళ్ళి
వారిముఠా కనిపించింది. ఆగుంపులోనుంచి వృద్ధబ్రాహ్మణుడు దగ్గిరికి
వచ్చి కేసటునితో మంచిమాట లాడి, 'నాయనా, నీవల్ల నాకు ఉప
కారము కావాలి. ఆకార్యము నెరవేర్చడము నీకు చాలా తేలిక;
పైగా వేడుకగా కూడా ఉంటుంది. చేస్తానంటే చెపుతా' నన్నాడు.
'నాచేత నయితే చేస్తాను. మీకు మేలు కావడమే నాకు సంతోషము'
అన్నాడు కేసటుడు.

వృద్ధబ్రాహ్మణుడు ఆతనిని కొంచెము అవతలికి తీసుకుపోయి
'నాయనా, నీవు ఎంత చక్కనివాడవో నాకుమారుడు అంత కురూపి.
కాని పుత్రవాత్సల్యముచేత వాడికి వివాహము చేసి, వాణ్ణి ఒకయింటి
వాణ్ణి చేతా మనే ఉద్దేశ్యముతో వాడు అందగాడని చెప్పి రత్న
దత్తునికుమార్తెను మాటాడినాను. దానిపేరు రూపవతి. పేరుకు
తగినట్టు చాలా అందగత్తె. ఈవేళనే వివాహముహూర్తము. నాకుమా
రుని చూస్తే వాళ్ళు పిల్ల నివ్వరు. మే మంతా పెళ్ళికి తరలి వచ్చాము.
కార్యహాని అవుతుందని భయంగా ఉన్నది. దైవవశాత్తు నీవు లభ్య
మయినావు. నా ఆలోచన ఫలించింది. నీవు నామక: పెళ్ళిపీటమీద

కూచుని 'రూపవతిని పెండ్లి [illegible] సౌభాగ్యము కాగానే పెళ్లి కుమార్తెను నాకప్పగించి అప్పజెప్పి నీదారిని వెళ్లు. చాలా ఉప కారము చేసినవాడవు అవుతావు' అని వేడుకొన్నాడు. కుతూహలము వల్ల కేసటుడు అంగీకరించినాడు.

అతన్ని వెంటబెట్టుకొని వృద్ధుడు పడవలో నర్మదానది దాటి గ్రామము చేరి పరివారముతో ఊరివెలుపలనే మకాము చేసినాడు. సూర్యాస్తమాన మయింది. చీకటిపడుతున్నప్పుడు కేసటుడప్పి తీర్చుకోడానికి నీటిదగ్గిరికి వెళ్ళినాడు. వెంటనే భీకరరాక్షసుడు లేచి నిన్ను భక్షిస్తాను అని కేక వేసినాడు. 'వద్దు. నన్ను చంపకు. నేను బ్రాహ్మణుడికివాగ్దానము చేశాను. ఆకార్యము నెరవేర్చి నీవద్దకు వస్తాను' అన్నాడు కేసటుడు. ప్రమాణము చేయించుకొని రాక్షసుడు అతన్ని విడిచిపెట్టినాడు. కేసటుడు పెళ్ళివారిగుంపులో కలిసినాడు.

బ్రాహ్మణుడు కేసటునికి బాగా అలంకారము చేసి పెళ్ళికొడుకును చేసి, మేళతాళాలతో రత్నదత్తుని యింటికి తీసుకుపోయి వివాహవేదిక మీాద కూర్చోబెట్టినాడు. యథావిధిగా వివాహము జరిగింది. చాలా ధనముతోసహా రత్నదత్తుడు రూపవతిని కేసటునికి ఇచ్చినాడు. అన్ని విధాలా తగిన ఆవధూవరులను చూచి అందరూ ఆనందించారు. ఆమె చెలికత్తెలకే కేసటునిమీాద మోహము కలిగిందంటే, రూపవతికి అను రాగము కలిగిం దని వేరే చెప్పనక్కరలేదు. కేసటునికి మాత్రము మనసులో విచారము హెచ్చింది. రాత్రివేళ శయ్యమీాద పెడమొగము పెట్టుకొని పడుకొన్నభర్తను చూచి ఆలోచించి రూపవతి నిద్ర అభిన యించింది. ఆమె నిద్రపోయిందని నమ్మినతర్వాత కేసటుడు నెమ్మ దిగా లేచి రాక్షసుని వద్దకు వెళ్ళినాడు. భర్తచర్య కనిపెట్టుతూ రూప వతి రహస్యముగా అతనిని అనుసరించి వెళ్ళింది. రాక్షసుడు అతనిని చూచి 'కేసటా, నీవు మహాసత్వుడవు. ఆడినమాట తప్పలేదు. నీ

నివాసమైన పాటలీపుత్రానికి ఏతెంచి కేసటునికి మేను తెచ్చావు సరే. ఇక దగ్గిరికి రా. నిన్ను భక్షిస్తాను' అన్నాడు. అప్పుడు రూపవతి ముందుకు వచ్చి 'అయ్యా, రాక్షసోత్తమా, నన్ను భక్షించు భర్తపోతే నాగతి ఏమవుతుంది' అని ప్రార్థించింది. 'నీకు భిక్షాటనమే గతి' అన్నాడు రాక్షసుడు. 'నాకు భిక్ష ఎవడుపెడతాడు? ఆడదాన్నిగదా' అన్నది రూపవతి. 'నీవు భిక్షఅడిగితే పెట్టని వాళ్ళతల బద్దలయి పోతుంది.' అన్నాడు రాక్షసుడు. 'మహానుభావా, నాకు పతిభిక్షపెట్టు' అన్నది ఆపతివ్రత. రాక్షసుడు అంగీకరించలేదు. తల పగిలి మరణించినాడు. ఆశ్చర్యపడుతూ రూపవతి కేసటుని వెంటబెట్టుకొని యింటికి వెళ్ళింది.

మర్నాడు త్వరగా భోజనాలు చేసి పెళ్ళివారు వధూవరులతో బయలుదేరి నర్మదాతీరము చేరినారు. వృద్ధబ్రాహ్మణుడు రూపవతినీ మరికొందరినీ ఒకపడవలో ఎక్కించి కేసటునివద్దనుంచి ఆభరణాదు లన్నీ తీసుకొని అతనిని ఒకనావలో ఎక్కించి తాను తక్కినవారితో మరొకపడవలో ఎక్కినాడు. నావికులు బ్రాహ్మణునివద్ద లంచము పుచ్చు కొనడముచేత నదీప్రవాహముమధ్యలో కేసటుని నావతోసహా విడిచి, తాము ఈదుకొంటూ ఒడ్డుచేరుకొన్నారు. ఆనావ వాయువశాన కొట్టుకుపోయి సముద్రతీరాన ఆగింది.

కేసటుడు వృద్ధుని మోసానికి విచారపడి అది అంతా కర్మఫల మనుకొన్నాడు. ఆరాత్రివేళ యోగినీచక్రము బయలుదేరి అతడు ఉన్నచోటికి వచ్చింది. ఆకోలాహలమువల్ల మెళుకువవచ్చి కేసటుడు కళ్లు తెరిచి చూచినాడు. అప్పుడే సుందరాకారుడు ఒకడు అతనియెదట నేలమీద పడినాడు. నూతనపురుషుడు తెప్పిరిల్లినతర్వాత కేసటుడు అతనిని 'ఎవరు బాబూ నీవు?' అని అడిగినాడు. ముందు నీచరిత్రచెప్పు తర్వాత నాసంగతి చెపుతాను అన్నాడు నూతనపురుషుడు. కేసటుడు తనవృత్తాంత మంతా చెప్పినాడు. 'మిత్రమా, మనయిద్దరిదీ సమా నావస్థ ఇక నాసంగతి విను అని ఇలా చెప్పినాడు.

## కం ద ర్పు ని క థ

వేణానదీతీరాన రత్నపురము నా నివాసము. మేము ధనికబ్రాహ్మణులము. నన్ను కందర్పు డంటారు. ఒక రాత్రి సలిలముకోసము వేణలో అడుగు పెట్టాను. కాలుజారింది. నదీవడికి కొట్టుకు పోయి పోయి అదృష్టవశాన తెల్లవారినతర్వాత నీటిదగ్గిర చెట్లగుబురులో చిక్కుకొన్నాను. కొమ్మలు పట్టుకొని ఎలాగో గట్టుమీద కెక్కేసరికి సమీపములో దేవాలయము కనిపించింది. అందులో మాతృదేవతలకు నమస్కారము చేసి బడలికవల్ల అక్కడే పడుకొని నిద్రపోయినాను. రాత్రి వేళ మాతృదేవతాగణములోనుంచి యోగినీసమూహము బయలుదేరింది. 'చక్రమేళనార్థము మన మిప్పుడు చక్రపురము వెళ్ళవలెను గదా! ఇక్కడ అడవిజంతువులు మెండు. ఈబ్రాహ్మణునికి అపాయము కలుగుతుంది. మనలను ఆశ్రయించిన యితనిని సురక్షితప్రదేశములో ఉంచి తర్వాత ఇక్కడికి తీసుకొని వత్తాము' అని కూడబలుకుకొని యోగినీగణము నాకు అలంకారము చేసి ఒకా నొక గ్రామములో ధనిక బ్రాహ్మణునియింట్లో నన్ను దిగబెట్టి యెక్కడికో వెళ్ళిపోయింది. అక్కడి సంగతులు గమనించాను. వివాహవేదిక సిద్ధమయింది. లగ్నము సమీపించింది. పెళ్ళికొడుకుపక్షమువారు ఇంకా రాలేదు. వర వేషములో ఉన్న నన్ను చూచి ఆడపెళ్ళివారు నాకు కన్య నిచ్చి యథా విధిగా వివాహముచేశారు. 'సుమనకు తగిన భర్త దొరికినాడు. ఏమి అదృష్టము! అని వారు చాలా సంతోషించారు. రాత్రిమేడమీద భార్యాభర్తలము నిద్రపోయినాము. తెల్లవారుజామున యోగినీచక్ర మువారు చక్రమేళకమునుంచి తిరిగి వస్తూ యుక్తితో నన్ను అపహరించుకు పోయినారు. ఆకాశమార్గాన వెళుతూ ఉంటే ఇంకో యోగినీ బృందము అడ్డము వచ్చింది. రెండు బృందాలకూ పోరాటము జరిగింది.

ఆగడబిడలో నేను జారిపోయి నీదగ్గిర పడ్డాను. నాభార్య సుమన ఏగ్రామములోదో నాకు తెలియదు. భవిష్యత్తు ఎలా ఉంటుందో తెలి యదు. ఇప్పుడునీతో సఖ్యముకావడము మాత్రము సంతోషదాయకము.

కందర్పునికథ విని కేసటుడు 'మిత్రమా, భయపడకు. యోగినీ బృందము నిన్నేమీ చెయ్యలేదు. నావద్ద గొప్పశక్తి ఉన్నది. ఇకముందు ఉభయులమూ కలిసి దేశాటనము చేతాము. శివానుగ్రహమువల్ల మనకు శుభమే కలుగుతుంది' అని చల్లనిమాటలు చెప్పినాడు. ప్రాతః కాలము ఉభయులూ సముద్రపుపాయ దాటి రత్నసదీసమీపాన ఉన్న భీమపురానికి వెళ్ళినారు. అక్కడ రెండుగట్లనడుమ చిక్కుకు పోయిన పెద్దచేపను చూచినారు. జనులు నానావిధములైన ఆయుధా లతో చేపను కోస్తున్నారు. చేపకడుపులోనుంచి ఒకసుందరి ఇవతలికి వచ్చింది. అందరూ ఆశ్చర్యపడ్డారు. ఆతరుణి జంకుతూ ఒడ్డుకు వచ్చింది. ఆమెను చూచి కందర్పుడు కేసటునితో 'మిత్రమా, ఆశ్చర్యము. ఆనాడు నేను వివాహమాడిన సుమన ఈమే! మత్స్యము కడుపులోకి ఎలా వెళ్ళిందో తెలియదు. వృత్తాంతము అంతా తెలిసేవరకూ మనము బయటపడకూడదు' అన్నాడు.

అక్కడివారు ఆమెసంగతి అడిగినారు. ఆమె విచారముతో మాది రత్నాకరపురము, మానాయన జయదత్తుడు, నన్ను సుమన అంటారు. నాభర్త చాలా సుందరమూర్తి. వివాహమయిన రాత్రే ఆయన రహస్యంగా ఎక్కడికో వెళ్ళిపోయినారు. నాతండ్రి ఆయనకోసము చాలా వెతికించినాడు. ఆయన దొరకకపోవడం చేత దుఃఖము పట్టలేక ఈనదిలో దూకినాను. ఈచేప నన్ను మింగింది. ఇప్పుడు ఇలా బయట బడినాను' అని చెప్పింది. జనములోనుంచి యజ్ఞస్వామి అనే బ్రాహ్మ ణుడు ముందుకు వచ్చి 'అమ్మాయీ, నీవు నామేనకోడలవు మా యింటికి వెళ్ళుదాము. రా' అన్నాడు. సుమన అతనిని గుర్తించి

పాదాలమీదపడి ఏడ్చి 'మామా, ఇంటికి రావడ మెందుకు, భర్త
లభించలేదు. నేను బతికి లాభమేమిటి? నన్ను చనిపోనీ!' అన్నది. కంద
ర్పుడు ఆమె హృదయము గ్రహించి ఎదటికి వెళ్ళినాడు. సుమన
వెంటనే భర్తను ఆనవాలుపట్టి అతని పాదాల మీద వాలి, రోదనము
చేసింది. మేనమామ అడిగిన మీదట కందర్పుడే తనభర్త అని చెప్పింది.
యజ్ఞస్వామి ముగ్గురినీ తనయింటికి తీసుకువెళ్ళి సమస్త ఉపచారములూ
చేయించినాడు. అక్కడ కొన్నిరోజులు వారు సుఖంగా గడిపినారు.
ఒకనాడు కేసటుడు కందర్పునితో 'మిత్రమా, నీవు కృతార్థుడ వయి
నావు. భార్య లభించింది. మీరు రత్నపురము వెళ్ళండి. నేను తీర్థ
యాత్రలుచేస్తూ కాలముగడుపుతాను. కృతకృత్యుడను కాలేదుగదా'
అన్నాడు. ఈమాటలు వింటున్న యజ్ఞస్వామి ఇలా అన్నాడు.

## కు సు మా యు ధు ని క థ

నీకు విచారమెందుకు? యథార్థంగా జరిగినకథ చెపుతాను. నీస్థితికి
ఉపయోగిస్తుంది. చండపురములో దేవస్వామి అనేబ్రాహ్మడికి కమల
లోచన అనే చక్కనికూతురు ఉండేది. ఆయన శిష్యుడు కుసుమా
యుధునికీ కమలలోచనకూ అనురాగము ఏర్పడ్డది. దేవస్వామి
కుమార్తెను ఎవరికో యిచ్చి వివాహము చేయడానికి నిర్ణయించినాడు.
చెలికత్తెద్వారా కమలలోచన ఈవార్త కుసుమాయుధునికి తెలియ
పరిచి తనను నేర్పుతో తీసుకు పోవలసిందని చెప్పింది. అతను సంకేత
స్థానము ఏర్పాటు చేసి, ఒక సేవకుణ్ణీ, మంచి గుర్రాన్నీ ఉంచినాడు.
కమలలోచన గుర్తుప్రకారము వెళ్ళి గుర్రమెక్కింది. సేవకుడు ఆమెను
కుసుమాయుధునివద్దకు తీసుకువెళ్ళక దుర్బుద్ధితో మరోమార్గము
చూపినాడు. తెల్లవారేసరికి వారు కొత్తనగరానికి వెళ్ళినారు. నా

ప్రియుడు ఎక్కడ? అక్కడికి నన్ను తీసుకు వెళ్ళవేమి?' అని అడిగింది కమలలోచన.

సేవకుడు నవ్వి 'నీప్రియునితో ఏమిపని? నిన్ను నేను వివాహమాడు తాను' అన్నాడు. బుద్ధిమంతురాలు క్షణములో సమస్తమూ గ్రహించి 'నిజానికి నాకు నీమీదనే ఇష్టము. వెంటనే పెళ్ళిసరుకులు తెచ్చి వివాహము చేసుకో' అన్నది. వాడు పరవశుడై ఆమెను అక్కడి ఉద్యానములో ఉంచి సామాను తేవడానికి అంగడికి వెళ్లి నాడు. వాడు వెళ్ళినకొద్దిసేపటిలోనే ఆమె గుర్ర మెక్కి పట్నములో ఒకానొక పుష్పమాలికాకారునియిల్లు చేరి, ఆవృద్ధునితో తన వృత్తాంతము చెప్పుకొన్నది. అతను భయముతీర్చి ఆమెను ఆదరించినాడు.

దుష్టభృత్యుడు ఉద్యానానికి తిరిగి వచ్చి చూస్తే కమలలోచన కనబడలేదు. వాడు వెతికి వెతికి వేసారి తన నగరానికి వెళ్లి యజమానితో 'స్వామీ, మీరు కల్లకపట మెరగనివారు: కుటిలస్త్రీల చేష్టలు గ్రహించడం కష్టము. ఆమె యిల్లు విడిచి రానేరాదు. నేను కనిపెట్టుకొనిఉంటే దుర్మార్గులు వచ్చి గుర్రము అపహరించుకు వెళ్లారు. నేను తప్పించుకు వచ్చాను' అని నక్కవినయముతో చెప్పినాడు. ఆ మాటలు నమ్మి కుసుమాయుధుడు శాంతించినాడు.

తర్వాత కొద్దిరోజులకు కుసుమాయుధుడు తండ్రిబలవంతము మీద పెళ్ళికి వెళ్ళుతూ కమలలోచన రహస్యముగా ఉన్న నగరమువద్ద ఆగి నాడు. పెళ్ళివారుకూడా వెనకటి ఉద్యానములోనే దిగినారు. కమల లోచన దైవవశాత్తు ఆతోటలోకే వచ్చి కొంచెము దూరములో కుసుమాయుధుని చూచి వెళ్ళి వృద్ధమాలాకారునితో చెప్పింది. అతను వచ్చి వృత్తాంతము యావత్తూ తెలిపి అతనిని తీసుకుపోయి వివాహము చేయించినాడు. తర్వాత కుసుమాయుధుడు సేవకుని శిక్షించినాడు. తనకు కమలలోచన లభించడానికి కారణమైన రెండవకన్యను కూడా

పెళ్ళిచేసుకొని ఇద్దరుభార్యలతోనూ నిజనగరానికి తిరిగివచ్చి సుఖముగా ఉన్నాడు. ఈప్రకారముగా అదృష్టవంతులకు ఊహాతీతముగా సమాగమము సంభవిస్తూ ఉంటుంది. ఇలాగే కేసటా, నీకుకూడా త్వరలోనే ప్రియాసమాగము ప్రాప్తిస్తుం దని నావిశ్వాసము.

కొన్నాళ్ళపాటు కందర్పుడు, సుమన, కేసటుడు యజ్ఞస్వామి యింట్లోనే ఉండి ఒకనాడు నిజనగరానికి బయలుదేరి పోయి పోయి మహారణ్యములో ప్రవేశించారు. అడవిఏనుగు అడ్డగించేసరికి ఎక్కడివా రక్కడ చెదిరిపోయినారు. వారిలో కేసటుడు కాశీకి వెళ్ళి కందర్పుని కలుసుకొన్నాడు. తర్వాత మిత్రు లిద్దరూ పాటలీపురానికి వెళ్ళినారు. కేసటుని చూచి తల్లిదండ్రులు చాలా ఆనందించారు. కేసటుడు తల్లిదండ్రులకు కందర్పునిసంగతి, రూపవతీవివాహవృత్తాంతమూ వివరించినాడు.

అక్కడ సుమన ఏనుగునుచూచి భయపడి మహారణ్యములోనికి పరుగెత్తుకు పోయింది. ఆమెరోదనము చేస్తూ ఒకచోట దావాగ్నికనబడితే అందులో పడబోయింది. కందర్పునిమీద అభిమాన మున్న యోగినులు రెండవయోగినీబృందాన్ని జయించి తమదేవాలయానికి వెళ్ళి దివ్యదృష్టివల్ల సుమనసంగతి గ్రహించి 'కందర్పుడు పురుషుడు కాబట్టి భయములేదు. ఎలా గయినా తనపని నెరవేర్చుకోగలడు. అబల కాబట్టి రూపవతిని మామగారియింట్లో దిగబెట్టుదాము. అక్కడ పతితోకూడా ఉంటుంది?' అని ఆలోచించి, అరణ్యములోనికి వెళ్ళి సుమనను తీసుకొని రత్నపురములో దింపినారు.

అక్కడ కందర్పుని రెండవభార్య అనంగవతి భర్తృవియోగము సహించలేక అగ్ని ప్రవేశము చేయడానికి సిద్ధముగా ఉన్నది. ఈసంగతి తెలిసి సుమన త్వరత్వరగా అక్కడికివెళ్ళి భర్త సజీవుడే అని తెలిపి అతను తన కిచ్చిన ఉంగరము చూపింది. అందరూ ఆమెమాటలు విశ్వసించి సంతోషించారు. మామ ఇద్దరుకోడళ్ళనూ ఇంటికి తీసుకువెళ్ళినాడు.

అక్కడ కందర్పుడు కేసటునితో చెప్పకుండా సుమనను వెదకడానికి బయలుదేరినాడు. కేసటుడు తల్లిదండ్రులతో చెప్పకుండా ఇల్లు విడిచి రూపవతి కోసము దేశాటనము చేశాడు. కేసటుడు రూపవతిని వివాహ మాడిన నగరానికి దైవవశాత్తు కందర్పుడు చేరినాడు. అప్పుడే అక్కడ కోలాహలముగా ఉంటే ఏమిటని జనాన్ని అడిగినాడు. భర్తృ వియోగమువల్ల రూపవతి ప్రాణాలు విడవడానికి సిద్ధముగా ఉన్న సంగతి తెలిసింది. అందులో ఒకడు ఇలా చెప్పినాడు.

అయ్యా, రూపవతికీ కేసటునికీ వివాహమయిన మర్నాడు ముసలి బాపడు రూపవతిని తీసుకొని స్వగ్రామము వెళ్ళుతూ ఉంటే ఆమె అనుమానపడి 'అందరూ కనిపిస్తారు, నాభర్త కనబడడేమి?' అని అడి గింది. ముసలివాడు తనకొడుకును చూపించి 'వీడు నాకుమారుడు వీనినే నీభర్తగా చూచుకో' అని చెప్పినాడు. కోపముతో రూపవతి అక్కడి పెద్దలతో 'ఈయన నాభర్త ఎలాఅవుతాడు? నిన్న నన్ను పెళ్ళాడిన భర్త కనబడకపోతే నేను ప్రాణాలు విడుస్తాను' అని అప్పటి నుంచీ అన్నపానములు విసర్జించింది. తనకు రాజదండన తప్పదనే భయముచేత ముసలివాడు రూపవతిని ఆమె పుట్టింటికే పంపించినాడు. ఆమెవృత్తాంతము అంతావిని తండ్రి విచారపడి 'అమ్మా, నీభర్త యెవరో ఎలా తెలుస్తుంది' అన్నాడు.

ఆయనిది పాటలీపుత్రము, తండ్రి దేసటుడు, ఆయనపేరు కేసటుడు. ఈవిషయాలు రాక్షసునిమాటలవల్ల తెలిసింది' అని రూపవతి రాక్షస కేసటులసంభాషణాదులు వివరించి చెప్పింది. ఆమెతండ్రి నదీతీరానికి పోయి అక్కడ రాక్షసుని కళేబరము చూచి కథ యావత్తూ విశ్వసించి, పాటలీపుత్రములో దేసటునికి వార్త పంపినాడు. కొన్నాళ్ళకు వార్తా వహులు తిరిగివచ్చి కేసటుడు తనవెంట మిత్రుడు కందర్పుడు వెడలి పోయిన తర్వాత చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయినాడని ఆయన

తండ్రి మాకు తెలిపినాడు, అని విన్నవించినాడు. రూపవతి అగ్ని ప్రవేశము చేయడానికి నిశ్చయించింది. ఆమె చెలికత్తెలు శృంగారవతి అనురాగవతి కూడా అగ్నిప్రవేశానికి వచ్చినారు. [illegible]రానికి ఇదే కారణము.

ఈమాటలు వినగానే కందర్పుడు వడివడిగా వెళ్లి కేసటుడు జీవించి ఉన్నాడని చెప్పి సాహసకార్యము మాన్పించినాడు. [illegible]ణుడు మోసముచేసి కేసటుని పడవలో ఎక్కించి సముద్రములో విడిచిపెట్టడమూ తదితరవిషయాలూ విన్నమీదట రూపవతికి నమ్మకము కుదిరింది. అందరూ కలిసి రూపవతి తండ్రియింటికి వెళ్లినారు.

కేసటుడు దేశాలవెంట తిరుగుతూ రత్నపురము చేరుకొన్నాడు. అతను వీధివెంట వెళుతుంటే కందర్పునిభార్య సుమన మేడమీదనుంచి చూచి అత్తమామలతో 'ఆవెళ్ళేపురుషుడు మావారిమిత్రుడు, కేసటుడు. వారిసంగతి ఆయనకు తెలియవచ్చును. వెంటనే లోపలికి పిలిపించండి' అని చెప్పింది. కేసటుడు వచ్చి సుమనను చూచి సంతోషించి తెలిసినసంగతులన్నీ చెప్పినాడు. అక్కడ అతను కొన్నాళ్లున్నాడు.

ఒకనాడు వార్తావహుడు కందర్పునివద్దనుంచి జాబు తెచ్చినాడు.

"కందర్పునిమిత్రుడు కేసటుడు రూపవతిని వివాహమాడిన చోట కందర్పుడు ఉన్నాడు. ఆమెకూడా అక్కడే ఉన్నది." అనేమాటలు ఉత్తరములోనూ ఉన్నవి, వార్తావహుడూ అవే చెప్పినాడు.

కందర్పునితండ్రికి కేసటుడు రూపవతీవివాహవిషయము చెప్పినాడు. తండ్రి పండుగ చేసుకొని కందర్పుని తీసుకురావడానికి దూతనూ, భార్య వద్దకు కేసటునీ పంపించినాడు.

అక్కడ కందర్పునీ, తనభార్య రూపవతినీ చూచి కేసటుడు చాలా ఆనందించినాడు. రూపవతిప్రేరేపణవల్ల కేసటుడు ఆమెచెలికత్తెల నిద్దరినీ పెళ్ళాడి, రూపవతిని, అనురాగవతిని, శృంగారవతిని వెంటబెట్టు

కొని మిత్రునివద్ద సెలవు తీసుకొని తన దేశానికి వెళ్ళినాడు. కందర్పుడు దూతవెంట పత్నీపురమునకు చేరి, సుమనను, అనంగవతిని, బంధువులనూ కలుసుకొని సుఖముగా ఉన్నాడు.

చెడురోజులు తొలగిపోగానే ధీరచిత్తులు మళ్ళీ ప్రియసమాగమము పొంది సుఖములు అనుభవిస్తారు. కాబట్టి, మిత్రమా, బయలుదేరు. మనము వెళ్ళి నీభార్యను వెతుకుదాము. దైవగతి ఎలా ఉన్నదో! మరణించిన నాభార్య మళ్ళీ జలికి లభించింది కాదా?

ఈ విధంగా ఉత్సాహవాక్యాలు పలికి నాతోకూడా ప్రయాణమయినాడు మిత్రుడు. తిరిగి తిరిగి ఇప్పటికి ఇక్కడికి వచ్చాము. వరాహమూ, ఏనుగూ కనబడినవి. అదేమి చిత్రమో! ఏనుగు నాభార్యను వెలికి కక్కి మళ్ళీ మింగివేసింది. అప్పటినుంచీ ఏనుగుకోసము వెతుకుతూ ఉన్నాను. అది కనబడలేదు. కాని నాసుకృతవశమువల్ల మహాప్రభూ, ఏలినవారిదర్శనము అయినది.

ఈ విధముగా వణిక్కుమారుడు విన్నవించిన మీదట విక్రమాదిత్య మహారాజు అతనిభార్యను పిలిపించి అతనికి ఇచ్చినాడు.

ఇటువంటి విచిత్రసమాగమానికి భార్యాభర్తలు ఆశ్చర్యహర్షాలలో ఓలలాడి విషమశీల మహారాజును బహువిధాల స్తోత్రము చేసినారు.

## తరంగము : ౧౨౪

## చంద్రస్వామి కథ

అంతట విక్రమాదిత్యుడు వణిక్కుమారునివెంట ఉన్న బ్రాహ్మణమిత్రుని చూచి 'ఆర్యా నీభార్య మరణించిందనీ తర్వాత జీవించిందనీ అన్నావే, ఆసంగతి వివరించి చెప్పు, భద్రా' అని అడిగినాడు. 'దేవా, కుతూహలమునంటే మనవి చేస్తాను' అని అతడు ఇలా ప్రారంభించినాడు.

నాది బ్రహ్మస్థల మనే అగ్రహారము. నేను బ్రాహ్మణుడను, నన్ను చంద్రస్వామి అంటారు. నా భార్య చాలా సౌందర్యవతి, ఏదో పని మీద మా నాయన నన్ను గ్రామాంతరము పంపించాడు. ఆ సమయములో కాపాలికుడు భిక్షాన్నము కోసము ఇంటికి వచ్చి నా భార్యను చూచి నాడు. జ్వరము తగిలి ఆమె చనిపోయింది. ఆమెను మా బంధువులు శ్మశానానికి తీసుకు పోయి, చితిమీద పెట్టి నిప్పు ముట్టించినారు. ఇంతలో నేను గ్రామాంతరము నుంచి వచ్చి దుఃఖవార్త విని రాత్రివేళ శ్మశానానికి వెళ్ళినాను. ఆవేళకు కాపాలికుడు డమరుకము వాయిస్తూ భుజము మీద మంచముకోడు ఆడిస్తూ అక్కడికి వచ్చి చితిమీద బూడిద చల్లినాడు. అగ్ని ఆరిపోయింది. నా భార్య ప్రాణాలువచ్చి లేచింది. ఆమె శరీరము మీద చిన్న బొబ్బకూడా లేదు. తన మంత్రప్రభావమువల్ల కాపాలికుడు నా భార్యను ముగ్ధురాలిని చేసినాడు. ఆమె అతనివెంట తొందర తొందరగా వెళ్ళుతున్నది. వాడికి కనపడకుండా నేను కొంత దూరాన నడుస్తున్నాను. వాడు గంగాతీరానికి వెళ్ళి అక్కడిగుహలో ప్రవేశించాడు. చేతిలో ఆయుధము ఉండడముచేత ధైర్యముచేసి నేను కూడా చల్లగా లోపల ప్రవేశించాను. వాడు మంచపుకోడు నేల మీద పెట్టి లోపలఉన్నకన్య లిద్దరితో "ముగ్ధలారా మిమ్ములిని తీసుకొని వచ్చికూడా మీతో నేను ఎందుకు కూడలేదో తెలుసునా ? ఈమె నాకు స్వాధీనము కాకపోవడముచేత. ఇప్పుడు లభించింది. నా ప్రతిజ్ఞ నేటికి నెరవేరింది." అని నాభార్యను వాళ్ళకు చూపినాడు. వెనక నుంచి నేను చాలా నేర్పుతో మంచపుకోడు తీసుకుపోయి గంగలో విసిరివేశాను. అది లేకపోతే వాడి ఆటలు సాగవని నాకు తెలుసు. అంతట నేను 'కాపాలికాధమా, నా భార్యను హరించి తెచ్చావు. నీపని అయిపోయింది చూసుకో!' అని బెదరించేసరికి వాడు పరుగెత్తడము ప్రారంభించినాడు. నేను వెంటబడి వాణ్ణిపొడిచాను. శివాగమము పేరు

చెప్పుకోని దుష్కార్యాలు చేసేపామండులు అన్ని విధాలా పతితులు. ఆయిద్దరు కన్యలతోసహా నాభార్యనుతీసుకుని మాయింటికి నేను వెళ్ళే సరికి బంధువులు భయపడి తర్వాత సంతోషించారు.

ఆకన్యలలో ఒకతె కాశీరాజుకూతురు, రెండవది అక్కడ వర్తక శ్రేష్ఠునికుమార్తె. వారిని నిజనివాసాలకు తీసుకుపోయి అప్పగించాను. తిరిగివస్తూ ఉంటే భార్యావియోగి ఈ వణిక్కుమారుడు తగిలినాడు. ఇద్దరముమూ కలిసి ఇక్కడికి వచ్చాము. కాపాలికునిగుహలో అంగ రాగము (మైపూత) తగిలి నాశరీరము ఘుమఘుమ లాడుతున్నది. ఎంత కడిగినా పోను. ఈప్రకారముగా భార్యనాకు మళ్ళీ లభించింది.

విక్రమాదిత్యుడు వారిద్దరినీ సత్కరించి పంపించి గుణవతీ చంద్రవతీ మదనకుంజరులను పిలిపించి వారితోసహా తనసైన్యాన్ని కలుసుకొని ఉజ్జయిని చేరినాడు. అక్కడ రాజు గుణవతీ చంద్రవతులను పెండ్లి ఆడినాడు.

విశ్వకర్మాలయములో స్తంభముమీద చూచినప్రతిమను స్మరించి ఆప్రతిమ యెవరిదో ఆకన్యకోసము విక్రమాదిత్యుడు ఆమెతండ్రి కళింగసేనమహారాజువద్దకు దూతను పంపించమని ప్రతీహారుడికి ఆజ్ఞ ఇచ్చినాడు. అతడు సువిగ్రహుడనేదూతను పంపినాడు. దూత కళింగ సేనునిదర్శనము చేసి ఈ ప్రకారముగా సందేశము చెప్పినాడు. 'రాజా, శ్రీ విక్రమాదిత్యుని ఆజ్ఞ. భూమిలో ఉత్తమరత్నము మాకు చేర వలెను. నీదగ్గర కన్యారత్నమున్నది. ఆమెను మాకు సమర్పించవలె. మాప్రసాదమువల్ల నీవు సుఖముగా శాశ్వతముగా రాజ్యము ఏలుకో వచ్చును.' ఆసందేశము విని 'ఎవ రీవిక్రమాదిత్యుడు, మమ్మల్ని ఆజ్ఞాపించేందుకు! మాకన్యను కానుకగా కోరుతున్నాడా! బాగుపడడు!' అని కళింగసేను డన్నాడు. 'కళింగరాజా, నీవు సేవకుడవు. సార్వ భౌమునివిషయంలో ఇలా మాటాడినావు! ఆయనప్రతాపాగ్నిలో

కలభము కాగోరుతున్నావా!' అని సువిగ్రహుడు తిరిగివచ్చి ప్రభువుకు సమస్తమూ విన్నవించినాడు.

విక్రమాదిత్యుడు కళింగసేనుని మీదికి దండయాత్ర చేసి, కళింగము చేరి దుర్గములో ఉన్న రాజును ముట్టడించి తనలో 'ఇతనికుమార్తె రానిది నాకు సుఖము లేదు. మామను ఎలా సంహరించను!' అని ఆలోచించి భేతాళుని తీసుకొని కళింగసేన ప్రభువు శయనాగారములో రాత్రివేళ ఎవరికీ కనబడకుండా ప్రవేశించాడు. భేతాళుడు అతనిని నిద్రలేపి 'ఓయీ, విషమశీలునితో వైరము పెట్టుకొని నిద్ర పోతున్నావా!' అని నవ్వి కేకవేసినాడు. కళింగరాజు భయపడి, విక్రమాదిత్యుని గుర్తుపట్టి ఆయనపాదాలమీద వాలి 'మహాప్రభూ, ఇప్పుడు నీకు ఒకవర్తిని. ఏమి చెయ్యవలెనో ఆజ్ఞాపించు అని వేసినాడు. 'పుత్రిక కళింగసేనను నాకు సమర్పించు' అన్నాడు విక్రమాదిత్యుడు. కళింగరాజు సమ్మతించినాడు. కృతకృత్యుడై విక్రమాదిత్యుడు తన శిబిరానికి వెళ్ళినాడు.

దేవీ, మర్నాడు మీనాయన కళింగరాజు నన్ను విషమశీల విక్ర మాదిత్య మహారాజు కిచ్చి యథావిధిగా వివాహము చేసినాడు. ఆయన నమీాద గాఢానురాగముచేత దండెత్తి వచ్చినాడు, కాని జయేచ్ఛచేత కాదు. ఈప్రకారముగా తీర్థసేవ చేస్తున్న దేవసేనుడు చెప్పగా నావిచా రము పోయింది. స్తంభముమీాది ప్రతిమను చూచి మహారాజు నన్ను వివాహ మాడినాడు. చిత్తరువును చూచి ఈమలయవతిని పెళ్ళి చేసు కొన్నాడు' అని కళింగసేన భర్తప్రభావము వర్ణించి సవతులను సంతోష పెట్టింది.

జ్ఞాతులవల్ల నష్టపడిన కృష్ణశక్తి అనేరాజపుత్రుడు అయిదు వందల మందితో దక్షిణాపథమునుంచి వచ్చి విక్రమాదిత్యుని సింహద్వారము వద్ద కార్పటిక వ్రతము అవలంబించి సేవచేస్తున్నాడు. పన్నెండేళ్ళ

దీక్షలో పడి కొండు సంవత్సరాలు గడిచినవి. ఒకనాడు భార్యదగ్గరనుంచి ఉత్తరము వస్తే కృష్ణశక్తి దీపపు వెలుతురులో లేఖలో ఈపంక్తులు చదివినాడు.

నీ వియోగాన ఈ నిష్ఠుర స్వాంతకు
వేడి నిట్టూరుపుల్ విరతి లేకుండంగ
వెలువడున్, ప్రాణముల్ వెడలి పోవవు నాథ!

అదృష్టపటాన చాటున ఉన్న రాజుకు ఈవాక్యాలు వినబడ్డవి. ఆయన బాగా ఆలోచించి వెంటనే పరిచారికను పంపించి కృష్ణశక్తిని రప్పించి శాసనము వ్రాయించి 'భద్రా, ఓంకారపీఠమార్గాన ఉత్తర దిక్కుకు వెళ్ళు. అక్కడ ఖండవటగ్రామాన్ని శాసనప్రకారంగా అనుభవించు. మార్గములో అక్కడక్కడ అడుగుతూ వెళ్ళితే గ్రామము చేరుతావు' అని శాసనము అతని చేతి కిచ్చినాడు.

కృష్ణశక్తి రహస్యముగా బయలుదేరి 'ఒక్కగ్రామమిచ్చినాడు రాజు, చాలా లజ్జాకరము! ఇంకా జిగీష యెందుకు! అయినా రాజాజ్ఞ నెర వేర్చవలికదా!' అనుకొని నిరుత్సాహంగా నడుస్తూ ఒక అరణ్యము చేరి నాడు. అక్కడ చాలామంది కన్యలు ఆడుకొంటూ ఉన్నారు. మీకు ఖండవటగ్రామము తెలుసునా? అని అతడు అడిగితే వాళ్లు 'మాకు ఆపేరే తెలియదు. పదియోజనాలలో ఉన్నమానాయునకు తెలియు వచ్చును.' అన్నారు. కృష్ణశక్తి వెళ్ళి వాళ్ళతండ్రిని చూచాడు. అతడు భీకరరాక్షసుడు. కృష్ణశక్తి ప్రశ్న విని అతనిధైర్యానికి మెచ్చుకొని 'ఆర్యా, ఖండవటములో నీ కేమిపని? ఆగ్రామము పాడు పడిపోయిందే, ఈమార్గము రెండుపాయలుగా చీలుతుంది. వామమార్గాన వెళ్ళితే ఉన్నతప్రాకారమూ రాజవీధీ కనిపిస్తవి. అదే ఖండవటము' అన్నాడు. కృష్ణశక్తి వాడుచెప్పినట్లు వెళ్ళితే పాడుపడిన పెద్దనగరము కనిపించింది. ఖండవటము గ్రామము కాదు. దానికి ఏడుప్రాకారా లున్నవి.

మధ్య ఉన్న రాజమందిరము ప్రవేశించి మణి కాంచనమయము మయిన సౌధములోకి వెళ్ళి రత్నసింహాసనముమీద కృష్ణశక్తి కూర్చునేసరికి వేత్రహస్తుడైన రాక్షసుడు వచ్చి 'మానవుడా, సింహాసనముమీద కూర్చున్నావేమి?' అన్నాడు. 'ఇక్కడ నేనే ప్రభువును. మీరంతా నాకు పన్నులు చెల్లించాలి. శ్రీవిక్రమాదిత్య సార్వభౌముడు శాసన రూపాన నాకు ప్రభుత్వము దయచేసినాడు' అని కృష్ణశక్తి అనేసరికి రాక్షసుడు అతనిపాదాలకు మొక్కి 'దేవా, ఇక్కడ నీవే రాజువు. నేను నీప్రతీహారుడను. శ్రీవిక్రమాదిత్యుని శాసనానికి ఎదురు లేదు' అని అందరినీ రప్పించినాడు. మంత్రులు వచ్చినారు. రాజ పరివారము వచ్చింది. చతురంగబలముతో నగరము నిండిపోయింది. అందరి ప్రణామములూ అందుకొని కృష్ణశక్తి అక్కడ రాజ్యభారము వహించినాడు. ఉజ్జయినిలో విక్రమాదిత్యుడు కృష్ణశక్తి మిత్రులను పోషిస్తున్నాడు. 'విక్రమాదిత్యుని ప్రభావము ఆశ్చర్యకరము. రాజ్యమిచ్చి గ్రామమన్నాడు. ఎంతగంభీరుడు!' అని కృష్ణశక్తి ఆశ్చర్యపడి కొంతకాలము అక్కడ ప్రభుత్వము చేసి ఒకనాడు సేనాసమేతుడై ఉజ్జయినికి వెళ్ళి మహారాజు పాదాలకు ప్రణామము చేసినాడు. 'నీకు లేఖ పంపినభార్య నిట్టూర్పులను నివారించు' అని విక్రమాదిత్యుడు మందహాసముతో అతనిని మందలించినాడు. అతడు కృతజ్ఞుడై సెలవు తీసుకొని వెళ్ళి దాయాదులను జయించి భార్యను చేరి ఆనందించినాడు.

## దేవస్వామి కథ

ఒకనాడు విక్రమాదిత్యునివద్దకు వెంట్రుకలు నిక్కబొడుచుకొని ఉన్న బ్రాహ్మణుడు వచ్చినాడు. ఎందుకు ఇలా అయింది?' అని రాజు అడిగితే బ్రాహ్మణుడు కథ చెప్పినాడు: "పాటలిపుత్రములో మహాగ్నిహోత్రి అగ్నిస్వామి నాతండ్రి. నన్ను దేవస్వామి అంటారు. దూర

గ్రామములో చిన్న పిల్లను వివాహం చేసుకున్నాను. ఆవిడ పెద్ద దయినతర్వాత కాపురానికి తీసుకు రావడానికి నేను గుర్రమెక్కి వెంట సేవకుని తీసుకొని అత్తవారింటికి వెళ్ళాను. మామ నన్ను చాలా ఆదరించి నా భార్యను పరిచారికతో సహా పంపినాడు. సగముదూరము ప్రయాణము చేసి నాభార్య గుర్రము దిగి మంచి నీళ్ళు తాగుతా నని ఏటిలోకి వెళ్ళింది. ఎంతసేపటికీ ఆవిడ రాకపోతే నేను సేవకుని పంపాను. వాడూ రాకపోతే నేను వెళ్ళి చూచాను. నాభార్య సేవకుని భక్షించి రక్తమయంగా ఉన్నది. భయపడి నేను వెనకకు పరుగెత్తి వచ్చి చూస్తే ఆవిడపరిచారిక గుర్రాన్ని భక్షించింది. ఒళ్ళు తెలియకుండా నేను పరుగెత్తుకు పోయినాను. అప్పటినుంచీ నెత్తి వెంట్రుకలు నిక్కబొడుచుకొని ఉన్నవి. మనసులోనుంచి భయము పోలేదు. నీదర్శనము చేస్తే పోతుందని తెలిసి ఇక్కడికి వచ్చాను.

విక్రమాదిత్యుడు విని ఆనపెట్టి బ్రాహ్మణుని భయము పోగొట్టి 'ఆహా, స్త్రీలు ఎంత వింత అయినవాళ్ళు' అన్నాడు. అక్కడ ఉన్న మంత్రి ప్రభువుతో 'దేవా, స్త్రీలలో దుర్మార్గులు ఉన్నారు. వాళ్ళు ఎటువంటి పని అయినా చేస్తారు. దేవరవారు అగ్నిశర్మ వృత్తాంతము వినలేదా!' అని కథ చెప్పినాడు.

## అగ్నిశర్మ కథ

మన నగరములోనే సోమశర్మ కుమారుడు అగ్నిశర్మ చాలా గారాబంగా తిరిగి చదువులేక మూర్ఖుడయినాడు. ధనమున్నవాడు కాబట్టి మూర్ఖుడయినప్పటికీ వానికి వర్ధమానపురములో బ్రాహ్మణ కన్య నిచ్చి వివాహము చేశారు. పిల్ల పెద్దదయిన తర్వాత ఇంటికి తీసుకు రమ్మని తల్లిదండ్రులు అగ్నిశర్మతో అన్నారు. వాడు ఎవరితోను చెప్పకుండా ఒంటరిగా బయలుదేరి అత్తవారింటికి వెళ్ళాడు.

వాడు బయలుదేరగానే కపింజలపక్షి కుడివైపు వెళ్ళింది. దక్షిణంగా ఉండి నక్క ఎడమవైపు ముఖము పెట్టి కూసింది. ఆమూర్ఖుడు చిరం జీవ చిరంజీవ అని దీవించాడు. అదృశ్యముగా ఉన్న శకునదేవత అందుకు నవ్వింది. వాడు అత్తవారింటిలోకి పోతూఉంటే కపింజలము ఎడమవైపు వెళ్ళింది. నక్క ఎడమవైపు నడిచింది. అందుకు అగ్నిశర్మ మళ్ళీ చిరంజీవ చిరంజీవ అని దీవించాడు. అప్పుడు దేవత చూచి 'పాపము వీడు మహామూర్ఖుడు. అశుభం శుభ మనుకొని ఆనందిస్తు న్నాడు. అశుభము సూచించిన జంతువులను ఆశీర్వదిస్తున్నాడు. 'పాపము! ప్రాణముమీదికి వచ్చినప్పుడు ఈఅమాయికుణ్ణి రక్షిస్తాను' అనుకొన్నది.

అగ్నిశర్మ వెళ్ళినాడు. అత్తమామలు ఆనందించారు. 'ఒంటరిగా వచ్చావేమి?' అని వారడిగితే 'ఇంట్లో చెప్పకుండా వచ్చాను' అన్నాడు అగ్నిశర్మ. అల్లునికి అన్నిమర్యాదలూ చేసి రాత్రి అత్తమామలు కొమార్తెను అలంకరించి గదిలోకి పంపించారు. ప్రయాణపు బడలికవల్ల అగ్నిశర్మ ఒళ్ళు తెలియకుండా నిద్రపోయినాడు.

భర్త నిద్రపోగానే ఆదుర్మార్గురాలు తనఉపపతిని చూడబోయింది. వాడు చోరుడు. వానిని పట్టి ఆనాడు రాజభటులు శూలారోపణము చేయించారు. అది వానిని సమీపించి కౌగలించుకొన్నది. వెంటనే వాడిశరీరములోనుంచి భూతము లేచి దానిముక్కు తెగకొరికింది. ఆ దుర్మార్గురాలు భయపడి త్వరగా ఇంటికి వచ్చి, ఒరలోనుంచి కత్తి తీసి, నిద్రిస్తున్నపతిపార్శ్వాన పెట్టి అయ్యో, చచ్చాను!. నాభర్త నిష్కారణంగా నాముక్కు కోశాడు! అయ్యో! అని బిగ్గరగా రోదనము ప్రారంభించింది. దానిచుట్టాలు లేచి వచ్చి ముక్కు లేకపోవడము గమనించి అగ్నిశర్మను కర్రలతో బాదినారు. ప్రాతఃకాలము వాళ్లు ప్రభువుదగ్గిరికి పోయి మొరపెట్టుకొని అగ్నిశర్మకు రాజుచేత ప్రాణ

దండనశిక్ష వేయించి అతనిని శూలారోపకులకు అప్పగించారు. అతన్ని వాళ్లు వధ్యస్థానానికి తీసుకువెళ్ళినారు.

రాత్రివేళ ఆదుర్మార్గురాలి చర్యలు చూచిన శకునదేవత జాలిపడి 'పాపము, ఈబ్రాహ్మణుడికి అపశకునఫలం సంప్రాప్త మయింది. అయితే ఇతను జీవ జీవ అన్నాడు. ఇతన్ని మృత్యుముఖమునుంచి తప్పిస్తాను' అని భావించి బిగ్గరగా 'తలవరులారా, ఈబ్రాహ్మణుడు నిర్దోషి, వధ్యుడు కాడు. మీరువెళ్ళి కొత్రున ఉన్న చోరునినోరు చూడండి. పళ్ళసందున తెగినముక్కు కనిపిస్తుంది' అని బ్రాహ్మణభార్యచర్యలు వివరించింది. వాళ్లు వెళ్లిచూచి రాజుకు ప్రతీహారునిద్వారా సమస్తమూ విన్నవించారు. రాజు అగ్నిశర్మను విడిపించి, ఆకులటనూ దానిచుట్టాలనూ శిక్షించినాడు.

మహాప్రభూ, స్త్రీలు ఇలాంటివాళ్లు. ఈప్రకారముగా మంత్రి చెప్పినమీదట విక్రమాదిత్య మహారాజు అవు నని అంగీకరించినాడు.

## మూ ల దే వు ని క థ

ప్రభువుసమీపంలో ఉన్న మూలదేవుడనే ధూర్తుడు లేచి 'దేవా, కొంతమంది కులటలు ఉన్నారుగదా అని ప్రపంచములో పతివ్రతలే లేరు అనడం భావ్యమా? విషలతలు ఉంటేమాత్రము చూతలతలు లేవా? నా అనుభవము మనవిచేస్తాను. పూర్వము నేను నాగరకక్షేత్రమైనపాటలిపుత్రానికి వెళ్లి అక్కడివారివైదగ్ధ్యము (జాణతనము) గ్రహించాలి అనుకొన్నాను. నగరము వెలుపల తటాకములో వస్త్రాలు ఉతుకుతున్న వృద్ధస్త్రీని చూచి బాటసారులు ఇక్కడ ఎక్కడ దిగుతారు? అని ప్రశ్న వేశాను. 'చక్రవాకములు తీరమునా, మత్స్యములు జలములోనూ, తుమ్మెదలు పద్మములమీదనూ ఉంటవి. ఇక్కడ బాటసారులు నివాసము చెయ్యగా నేను చూడలేదు' అని

వృద్ధస్త్రీ చమత్కారంగా ప్రత్యుత్తర మిచ్చింది. నేను తెల్లపోయి మిత్రుడు శశితోసహా నగరములోకి వెళ్లినాను.

ఒకచోట గడపదగ్గర బాలుడు ఎదురుగా వేడిపరమాన్నపుగిన్నె చూస్తూ ఏడుస్తున్నాడు. శశి వాణ్ణి చూసి 'ఈబాలకుడు ఎంత వెర్రి వాడు, పరమాన్నము తినకుండా రోదనము చేస్తూశ్రమపడుతున్నాడు" అని అన్నాడు. శశిమాటలు విని బాలుడు కళ్ళు తుడుచుకొని నవ్వి 'మీరు వెర్రివాళ్ళు. రోదనము ఎంతలాభదాయకమో మీకు తెలి యదు. పరమాన్నము క్రమంగా వేడి తగ్గుతుంది. మాధుర్యము హెచ్చు తుంది. నాశ్లేష్మము తగ్గిపోతుంది. మందబుద్ధినై ఏడవడంలేదు. మీరు పల్లెటూరివాళ్ళవలె కనిపిస్తారు. నాహృదయము గ్రహించారు కారు' అని సమాధానము చెప్పినాడు. బాలుడి మాటలకు మేము సిగ్గు పడ్డాము. ఆశ్చర్యమూ కలిగింది. అక్కడినుంచి కదిలి మేము మరో చోటికి వెళ్ళినాము.

అక్కడ మామిడిచెట్టుకింద కొందరు కన్యలూ తరుస్కంధముమీద కన్యామణీ కనిపించారు. చెట్టుమీది కన్యామణి మామిడిపళ్ళు కోస్తు న్నది. 'మాకు కాసినిపళ్ళు ఇస్తావా?' అని నేను అడిగితే 'మీకువేడి పళ్ళు కావాలా? చల్లటిపళ్ళు కావాలా?' అని ఆమె అన్నది. ఆచిత్ర మేమిటో చూతా మని వెచ్చనిపళ్ళే కావాలి అన్నాను. ఆకన్యామణి ఫలములు కోసి నేలమీద ధూళిలో పడవేసింది. మేము ఫలములు తీసుకొని ఊది దుమ్ము దులిపి భక్షించినాము. వాళ్ళందరూ నవ్వి నారు. కన్యామణి 'మీకు చల్లనిఫలాలు ఇస్తున్నాను. ఇదివరలో వేడిఫలాలు ఊది తిన్నారు. ఇప్పుడు నోటితో ఊదవలసినపని లేదు. పట్టండి వస్త్రాలు' అన్నది. మేముపట్టినవస్త్రాలలో కొన్నిపండ్లు ఆమె పడవేసింది. మేము ఫలాలు పుచ్చుకుని తెల్లమొగాలు వేసి అక్కడి నుంచి బయలుదేరినాము. కొంచెముదూరము పోయినతర్వాత నేను

శశితోనూ అక్కడ ఉన్నవారితోనూ 'చూచారా! ఆపిల్ల నెరజాణ. దాన్ని నేను పెళ్ళి ఆడకపోతే ఏముంది? అది చేసినపరిహాసానికి నేను ప్రతిక్రియ చెయ్యకపోతే ధూర్తశిరోమణి అనే నాపౌరుషనామ మెందుకు!' అన్నాను. వాళ్ళు ఆకస్యతంత్రుడియిల్లు ప్రయత్నముమీద కనుక్కొన్నారు.

మర్నాడు మేము మారువేషాలు వేసుకొని ఆబ్రాహ్మడింటికి వెళ్ళి నాము. వేదపాఠము చేస్తున్న ఆయన మమ్మలిని చూచి ఎవరు మీరు? అని అడిగినాడు. 'ఆర్యా, మేము మాయాపురినుంచి వస్తు న్నాము. విద్యాగ్రహణము చెయ్యవలె ననికోరిక' అని మనవిచేశాము. ఆయన ధనికుడు కావడముచేత 'నాయనలారా, దూరదేశమునుంచి వస్తున్నారు. చాతుర్మాస్యాలు (నాలుగునెలలు) మాయింట్లోనే గడిపి నన్ను ధన్యుణ్ణి చెయ్యండి' అన్నాడు విప్రుడు. ఆయనపేరు యజ్ఞ స్వామి. విప్రోత్తమా, నాలుగుమాసాలతర్వాత మీరు మాకోరిక తీరిస్తే ఇప్పుడు మేము మీకోరిక తీరుస్తాము' అని మేము చెప్పినాము. 'నాకు సాధ్య మయినది, మీరుకోరితే తప్పకుండా ఇస్తాను' అన్నాడు యజ్ఞస్వామి. మేము అక్కడ నాలుగుమాసాలూ గడిపి నాము. గడిపి, ఒకనాడు స్వామీ! మేము వెళుతాము. మీరు మాకోరిక నెరవేర్చండి, అని వేడినాము. 'మీకు ఏమి కావాలి? అన్నాడు శ్రోత్రియుడు. 'మాలో ముఖ్యునికి మీకొమార్తె నిచ్చి వివాహము చెయ్యండి' అన్నాము. యజ్ఞస్వామి ఆలోచించి, వాగ్దా నము భంగము కాకుండా పుత్రికను నాకిచ్చి వివాహము చేసినాడు.

రాత్రి శయనమందిరములో నాభార్యతో 'కల్యాణీ, వేడిమామిడి పళ్ళు చల్లమామిడిపళ్ళు ఇచ్చిన సంగతి నీకు జ్ఞాపకం ఉందా?' అన్నాడు. ఆమె నవ్వి పల్లెటూరివారు నాగరికులవల్ల ఇలాగే మోసపోతారు' అన్నది. 'నాగరికురాలా! సుఖంగా ఉండు, నేను పల్లెటూరి

వాడను, నిన్ను విడిచిపెట్టి దూరదేశము వెళ్ళకపోతే ఒట్టు!' అని ఆమెను జడిపించాను. 'మీవల్ల నాకు కలిగే కుమారునిచేత మిమ్ములిని కట్టివేయించి ఇక్కడికి తెప్పించుకొంటాను' అని ఆమె ప్రతిజ్ఞ చేసింది. ఉభయులమూ ప్రతిజ్ఞ చేశాము. నేను మారు మొగముపెట్టి పడుకొని ఆమె నిద్రపోయిన తర్వాత నాచేతి ఉంగరము తీసి ఆమె చేతికిపెట్టి ఆవిడ తెలివితేటలు పరీక్షింతా మనుకొని మిత్రులతో సహా బయలు దేరి ఉజ్జయినికి వచ్చాను.

తర్వాత చాలా కాలానికి సమస్తమూ నేను తెలుసుకొన్నాను. నేను వెళ్ళిన మర్నాడు నాభార్య తండ్రితో 'నాన్నా నాభర్త చెప్పకుండా ఎక్కడికో వెళ్ళిపోయినాడు. నేను తీర్థయాత్రలుచేసి వస్తాను' అని చెప్పి తండ్రి వద్దు అన్నప్పటికీ వినక కొంత ధనమూ కొద్దిమంది పరిజనులూ తీసుకొని ఉజ్జయినికి వచ్చిందిట. తాను కామరూప దేశమునుంచి వచ్చిన వేశ్యను అనీ, పేరు సుమంగళ అనీ, హెచ్చు ధనాధికము ఇస్తేగాని సరసులను స్వీకరించననీ పుకారు పుట్టించింది. ఉజ్జయినిలో మహా ప్రఖ్యాతి పొందిన గణిక దేవదత్త అనేది సుమంగళను ఆదరముతో తీసుకువచ్చి తన మందిరములో ప్రత్యేకముగా దింపింది. ఈసంగతి తెలిసి మిత్రుడు శశి ఒకరాత్రి గడపడానికి తన సేవకునిద్వారా ఆమెకు వార్త పంపినాడు.

'మేము చెప్పినప్రకారము నడుచుకొనే సరసులు మాత్రము మా వద్దకు వస్తారు. మాకు ధనమక్కరలేదు. అనాగరకులతో మాకు పనిలేదు' అని సుమంగళి సమాధానము పంపింది. శశి రాత్రి ప్రథమ యామప్రారంభములోనే ద్వారదేశానికి వెళ్ళి తన ఆగమనవార్త తెలియ పరచినాడు. 'సరే, మంచిది. మాయజమానురాలి మాట ప్రకారము నడుచుకోండి' అని ద్వారపాలకుడు అతనిని స్నానానికి లేవ వలసింది. అన్నాడు. వెంటనే కొందరు దాసీలు వచ్చి అతన్ని లోప

లికి తీసుకొనిపోయి అభ్యంగనస్నానము చేయించేటప్పటికి ప్రథమ యామము దాటిపోయింది. శశి రెండోద్వారమువద్దకు వెళ్ళేసరికి ద్వారపాలకుడు అతనితో 'తలంటు అయినది. సరే, అలంకరణము కావాలి' అన్నాడు. దాసీలు వచ్చి శశికి రకరకాల అలంకారము చేశారు. రెండోయామము గడిచిపోయింది. శశి తృతీయద్వారానికి వెళ్ళేటప్పటికి ద్వారపాలకులు 'స్వామీ, భోజనము చేసి లోపలికి దయ చేతురుగాని' అన్నారు. శశి అంగీకరించినాడు. దాసీలు వచ్చి వివిధ విధాల ఆహారము పెట్టినారు. భోజన మయ్యేసరికి మూడోజాము గడి చింది. చివరకు శశి నాలుగోద్వారానికి వెళ్ళినాడు. అక్కడి ద్వార పాలకుడు 'గ్రామ్యపరసుడా, వెనకకు వెళ్ళిపోతే మంచిది. ఆలస్యము చేస్తే చీవాట్లు తగులుతవి. కొత్తగా గణికవద్దకు నాలుగోయామ ములో వస్తావా! చాలు చాలు!, అని హేళన చేసినాడు. శశి తెల్లపోయి వచ్చిన దారినే కొంప చేరుకొన్నాడు. ఇంకా కొంతమంది అలాగే పరాభవము పొందినారు.

ఒకనాడు నేను కుతూహలము పుట్టి సుమంగళకు వర్తమానము చేసి జవాబు తెప్పించుకొని రాత్రి అలంకరించుకొని సకాలానికి ఆమె మందిరానికి వెళ్ళినాను. ద్వారపాలకులకు బహుమానాలిస్తూ ఆమె శయనమందిరానికి చేరాను. అక్కడివాళ్ళు నన్ను లోపలికి వెళ్ళ నిచ్చారు. సుమంగళ ఎదురువచ్చి నన్ను తీసుకువెళ్ళి శయనముమీద కూర్చోబెట్టింది. ఆమెను నేను గుర్తించలేదు. ఆవిడ చేసినసపర్యలకు ముగ్ధుడ నయిపోయినాను. మాకిద్దరికీ గాఢానురాగము కలిగింది. ఒకరి నొకరము విడిచిపెట్టలేక పోయినాము కొన్నాళ్ళు ఆమెతో గడిపాను. ఇంతలో ఆమె గర్భము ధరించింది. తర్వాత కొద్దిరోజులకు సుమంగళ నాచేతికి ఉత్తరమిచ్చి చదవమన్నది. జాబు విప్పి చదివాను. 'కామ రూపదేశమునుంచి శ్రీమార్గ మానసింహ మహీపతి శ్రీమతి సుమంగ

శకు పంపిన ఆనతి: 'నీవు చాలా కాలయాపన చేస్తున్నావు. దేశాటన వాంఛ విరమించి త్వరలో బయలుదేరి రావలసింది' అన్న పంక్తులు ఆమెకు వినిపించాను. సుమంగళ తెల్లపోయి 'వెళ్ళక తప్పదు. నా మీద మీరు కోపము వహించకూడదు. ఏమి చెయ్యను! ఎలాగయినా పరాధీననుకదా!' అని చెప్పి ప్రయాణమయింది. ఎంత అనురాగమున్నప్పటికీ నేను ఆమెవెంట వెళ్ళలేదు.

పాటలీ పుత్రము వెళ్ళి ఆమె కాలక్రమేణ కొడుకును కన్నది. పన్నెండేళ్ళ వయసులో ఆబాలుడు ఒకరోజున ఆటలాడుతూ తనసమ వయస్కుడైనదాసీపుత్రుని లతా వేత్రముతో దెబ్బవేసినాడు. వాడు రోదనముచేస్తూ నీవు మహామొనగాడ ననుకొంటున్నావు. నీఅయ్యే ఎవడో తెలియదు. మీఅమ్మ దేశాలవెంట తిరిగి వచ్చాక పుట్టిన మహానుభావుడవు!' అని ఎత్తిపొడిచాడు. బాలుడు సిగ్గుపడి ఇంటికివెళ్ళి 'అమ్మా, మానాయన ఎవరు? ఎక్కడున్నాడో చెప్పు' అని తల్లిని నిర్బంధము చేసినాడు. ఆమె కొంచెము యోచించి 'నాయనా, నీతండ్రి మూలదేవుడు. నన్ను విడిచిపెట్టి ఉజ్జయినికి వెళ్ళినాడు' అని సమస్త వృత్తాంతమూ చెప్పింది. బాలుడు 'అమ్మా నీప్రతిజ్ఞ నెరవేరుస్తాను. వెళ్ళి నాయనను బంధించి ఇక్కడికి తీసుకువస్తాను. నీవు విచారపడకు' అనిచెప్పి నాఆకారప్రకారాలు తల్లివల్ల గ్రహించి ఇక్కడికి వచ్చినాడు.

తర్వాత బాలుడు నేను జూదమాడుతున్న తింతాస్థానము చేరి నన్ను గుర్తుపట్టినాడట. కుర్రవాడయినప్పటికీ వాడు తింతలో ఉన్న జూదగాళ్ళ నందరినీ గెలిచి, వచ్చినధనము అర్థులకు ఇచ్చివేసినాడు. అందరూ ఆశ్చర్యపడ్డారు. వాడు రాత్రి మాయింటికి వచ్చి నిద్ర పోతున్న నన్ను నెమ్మదిగా ఉపాయంగా పరుపుమీదికి జరిపి మంచము ఎత్తుకొని పోయినాడు. ప్రాతఃకాలము నేను లేచి చూచుకొంటే మంచము కనబడలేదు. పక్కనే పరుపుమీద ఉన్నాను! తర్వాత కొంతసేపటికి బజారుకు వెళ్ళితే అక్కడ బాలుడు నామంచము అమ్మ

జూపుతున్నాడు. 'అబ్బాయీ, ఈమంచము ఎంత కిస్తావు' అని అడిగాను. వాడు 'ధూర్తమహాశయా, ఈమంచము అమూల్యము అత్యద్భుతమైన వృత్తాంతము వర్ణించి చెప్పగలిగితే ఇది మీకు లభిస్తుంది' అన్నాడు.

'సరే, నీకు అద్భుతకథ చెపుతాను, దానితత్త్వము గ్రహించి నీవు సత్యమని అంగీకరించాలి. అలా చెయ్యకపోతే నీవు యోగ్యుడవు కావని అంగీకరించి మంచము నాకు ఇచ్చివెయ్యాలి. కథ విను: పూర్వము ఒకానొక రాజ్యములో కరువు వచ్చింది. ఆదేశప్రభువు నాగముల వాహనాల శీకరాలతో సూకరప్రియ వీపుమీద వ్యవసాయము చేయించి పండిన పంటతో ప్రజలందరికీ కష్టము తొలిగించి లోకవంద్యు డయినాడు' అని నేను చెప్పినాను.

బాలుడు నవ్వి 'నాగములకు వాహనాలు మేఘములు. వరాహప్రియ భూమి. విష్ణువు వరాహముగా అవతరించినప్పుడు ఆయనప్రియురాలు భూదేవి. మేఘజలము భూమిమీద పడితే పంటలు పండినవి. ఇందులో ఆశ్చర్య మే మున్నది! ఇక నేను అద్భుతకథ చెపుతాను. మీరు దానిమర్మము గ్రహించి సత్య మని అంగీకరిస్తే ఈమంచము మీ కిస్తాను. మీరు కథామర్మము గ్రహించలేకపోతే నేను చెప్పినట్టు మీరు చెయ్యాలి. ఇక కథ. ధూర్తశిరోమణీ, ఇందులో పూర్వము ఒకబాలుడు పుట్టి వెంటనే పాదభారముచేత భూమిని అదరగొట్టినాడు. తత్క్షణమే వృద్ధుడై లోకాంతరములో పాదము పెట్టినాడు' అని ఆధూర్త బాలుడు చెప్పినాడు.

నాకు దానితత్త్వము తెలియలేదు. 'పో, వట్టిది ఎవడునమ్ముతాడు.'' అని నేను పరిహాసము చేశాను. వాడు నవ్వుతూ విష్ణువు వామనావతారము ధరించినప్పుడు ఆయనపాదభారానికి భూమి అదిరిపోయింది కాదూ? వామనమూర్తి వెంటనే వృద్ధి పొంది, పాదము స్వర్లోకములో ఉంచలేదూ? మీకు దీనిభావము తెలియలేదు. మీరు ఓడిపోయినారు. నేను చెప్పినట్టు చెయ్యాలి. మాప్రతిజ్ఞలకు ఇక్కడివా

రంతా సాక్షులు' అని నాభుజముమీద చెయ్యి వేసినాడు. ప్రజ లంతా వానిపక్షమే పలికినారు.

వాడు నన్ను వెంటబెట్టుకొని పాటలీపుత్రానికి తీసుకపోయి నాచేతులకు తాళ్లుకట్టి తనతల్లి సమక్షానికి నడుపుకొని వెళ్ళినాడు. ఆమె నన్ను చూసి నమస్కారము చేసి 'స్వామీ, నాప్రతిజ్ఞ నిలువుకొన్నాను. మీకుమారునిచేత మిమ్మల్ని కట్టివేయించి తెప్పించాను. ఏమీ అనుకోవద్దు' అని జరిగిన వృత్తాంతము అక్కడ చేరినవారియెదట చెప్పింది. నేను సంతోషించాను. అందరూ ఆనందించి ఆమెను అభినందించారు. బంధువులు పండగ చేశారు. భార్యాపుత్రులతో కలసి కొంతకాలము పాటలీపుత్రములో ఉండి తర్వాత ఇక్కడికి వచ్చాను. మహాప్రభూ లోకములో ఉత్తమాంగనలుకూడా ఉంటారు. ఇలా మూలదేవుడు చెప్పిన కథ విని మహారాజు మంత్రులూ ఆమోదించారు.

విషమశీలుడైన విక్రమాదిత్య మహారాజు సమస్తభూమిని జయించి బహుకాలము ప్రజారంజకముగా పరిపాలన చేసినాడు.

సంయోగ వియోగములు చాలా పొందిన విషమశీలుని కథ చెప్పి కణ్వమహాముని నన్ను ఇలా ఊరడించినాడు. 'నరవాహనా, ప్రాణికోటికి సంయోగ వియోగములు ఊహాతీతముగా కలుగుతూ ఉంటవి. శీఘ్రకాలములోనే నీకు ప్రియా సమాగమము సంభవిస్తుంది. ధైర్యము వహించు. భార్యా సచివసమన్వితుడవై బహుకాలము విద్యాధర చక్రవర్తి పదవి అనుభవిస్తావు.' ఈవిధముగా కణ్వమహాముని చెప్పిన చల్లని మాటలవల్ల నేను శాంతించి మదనమంచుకా ధ్యానములో ఉండి కాలక్రమేణా భార్యలను విద్యలను విద్యాధర సామ్రాజ్యాన్ని అనుభవించాను. వరప్రదాత అయిన మహేశ్వరుని అనుగ్రహమువల్ల అన్నీ ఎలా లభించినవో మీకు ఇతఃపూర్వమే తెలుసును.

నరవాహనదత్తుడు కశ్యపాశ్రమములో ముని జనానికి తన మామకూ నిజచరిత్ర వివరించి వర్షాకాలము అక్కడ గడిపి తర్వాత వారందరి

వద్ద సెలవు తీసుకొని విమాన మెక్కినాడు. విద్యాధర సైన్యము అనుస రించి వెళ్ళింది. నరవాహనుడు ఋషభాద్రికి పోయి విద్యాధరేంద్రులను కలుసుకొని మదనమంచుక రత్నప్రభ మొదలయిన రాణులతో కల్పముపాటు సుఖములు అనుభవించినాడు.

## విషమశీల లంబకము

### ఫ ల శ్రు తి

కైలాసపృష్ఠాన కథ యిట్లు పూర్వమ్ము
సంప్రీతుడై చెప్పె శశిశేఖరస్వామి
పర్వతేశ్వరసుతా ప్రార్థమ్మునజేసి.
పుష్పదంతాదు లీభూస్థలిన్ శాపాన
కాత్యాయనాదులై కాయముల్ ధరియించి
కలిగించి రీ బృహత్కథకు ప్రాకట్యంబు.
"మన్ముఖోద్గత మైనమహనీయకథ నెవ్వ
డాదరమ్మున జదువు, నాలకించు నెవండు
జ్ఞప్తి దాల్చు నెవండు, సత్వరమ్ముగ వాడు
కిల్బిషమ్ములు ద్రోసి కృతకృత్యుడై, కాంచి
విద్యాధరత్వమ్ము, విధిగ నాలోకంబు
నొందువా" డని కథకు నొసగినా డప్పుడే
పర్వతేశ్వరసుతా ప్రాణేశ్వరుడు వరము.

నమః పార్వతీ పతయే !
హర, హర, మహాదేవ !

*

తల్లావఝ్ఝల వారు
తెలిగించిన కథా సరిత్సాగరము
సంపూర్ణము

